




# ఎమెస్కో వచన రామాయణం

శతావధాని కోట వీరాంజనేయ శర్మ



# ఎమెస్కో వచన రామాయణం

(నాల్గవ సంపుటం)

రచన:

శతవధాని కోట వీరాంజనేయ శర్మ



192

యం. శేషాచలం అండ్ కంపెనీ

మచిలీపట్నం - సికింద్రాబాదు

EMESCO VACHANA RAMAYANAM - Vol. 4

*As retold by* :
SATAVADHANI KOTA VEERANJANEYA SARMA



*First Edition* :
AUGUST 1980



*Publishers* :
M. SESHACHALAM & Co.,
Machilipatnam - Secunderabad.

*Cover Design* :
B A P U

*Printers* ;
PRASAD PROCESS,
Machilipatnam




**Price : Rs. 5-00**

*Distributors* :
M/s. ANDHRA PRADESH BOOK DISTRIBUTORS,
3237 Rashtrapathi Road, Secunderabad-3



192

# ద్వాద శాదిత్యమండలం వలె ప్రకాశించే
# 12 సంపుటాల ఎమెస్కో వచన రామాయణ ప్రాశస్త్యం

ఏనాడు వాల్మీకి మహర్షి అపార తపశ్శక్తితో వేదాన్ని రామాయణాత్మకంగా ఆవిష్కరించాడో ఆ నాటినుండి అవిచ్ఛిన్నంగా శాఖోపశాఖలతో బహు నామాలతో ఆ కల్పవృక్షం భారతాన్ని పుణ్యభూమిగా, కర్మభూమిగా చేసి దిగ్దిగంతాలకు ప్రాకింది. ఇంకా ప్రాకుతుంది, అందుకే ఒక కవి "రాఘవేశ్వర చారిత్రము నెందరెన్ని గతులన్ వర్ణించినన్ గ్రాలదే" అని అన్నాడు. మేం కూడా ఆ పవిత్ర భావంతోనే ఈ మహా కార్యానికి పూనుకున్నాం. ఈ నూత్న ప్రయత్నంలో ఒక విలక్షణమైన మార్గం త్రొక్కటం జరిగింది. వేదానికి వేదం ప్రమాణంలాగా వాల్మీకి రామాయణానికి వాల్మీకియే ప్రమాణంగా అనువాదంలోనే అపవాదులు పరాస్తం చేయబడినై. యధాతధంగా అనువదించినా స్వతంత్ర కావ్యం వలే చదువరులకు ఆనందం కలిగిస్తుంది. ఎన్నో గ్రంథ గ్రంధులు వున్నై. ఎన్నో పూర్వాపర విరుద్ధాలున్నట్లు పైకి కనుపిస్తాయి. వచ్చిన కధలేవస్తై. ఒకచోట శంకకు ఎక్కడో పరిహారం వుంటుంది. ఈ చిక్కులన్నీ ఇందులో విడదీయబడినై. తైలధారవలె అవ్యాహతంగా రచనా స్రోతస్సు ప్రవహిస్తుంటే చవిటినేలలు, కేదారఖండాలు, నల్లని, ఎర్రని, రేగడ భూములు, నిస్సార నిరుపయోగ ప్రదేశాలు సస్యశ్యామలంగా మారి ఫలానుభవంతో ఇహపర సుఖాలు తమంత తామే కోరి వరించి వస్తై. ఈ రచనా విన్యాసం సరికొత్తది, పండిత పామరభేదం లేకుండా స్త్రీ శిశు విచక్షణ లేకుండా అందరికీ రామాయణ కల్పవృక్ష ఫలాలను అందిస్తుంది. ఏ అనుమానం వచ్చినా ఈ రామాయణం ఆ ఘట్టంలో చూసుకుంటే తెలుస్తుంది, ఇంతకు పూర్వం తెలియని ఎన్నో రహస్యాలు వెలికి తీయబడినై. ఉదాహరణకు దశరథుడు ముగ్గురు భార్యలకు పాయసం నాల్గు భాగాలెందుకు చేశాడు ? వాలి వధ ఎందుకు ధర్మబద్ధమైంది ? తార పతివ్రతగా ఎందుకు ఆరాధ్య అయింది ? సీతా పరిత్యాగంలో రాముడు అన్యాయం చేశాడా. ఇంకా ఎన్నో ఎన్నో - ఈ బృహత్కార్యం ఎందుకు సంకల్పించామో చదివి చదువరులు సాక్షులు గండి.

స్వామి! భవత్కృపాప్రబలసంగతి మూఁడవ సంపుటంబునుఁ
భూమిభవాత్మదేవు పదమ్ము స్పృశియింపఁగనుంచినాను; శో
భామయసూనమట్లుగను! పావని! నాల్గవ సంపుటంబునుఁ
దాపర పండిరా! భవ బంధహరంబుగ వ్రాయఁబూనుమా.

## సీతారాములు శయనించిన చోటుకని భరతుడు పలవించుట

గుహుండు చెప్పిన విషయాలన్నీ ఆకర్ణించి, తమ్మునితో, తల్లులతో, సుమంత్రునితో గుహుండు దారి చూపగా, గారచెట్టు చేరాడు. చేరిన వెంటనే శయ్య చుట్టూ తిరిగి నమస్కరించి, " మాతలారా! మా అన్నా వదినెలు పడుకున్న ప్రదేశం చూశారా. ఇది అన్న పండిన ప్రక్క. బలిష్ఠ శరీరభారాన్ని భరించలేక నలిగివున్నై దర్భలూ, ఆకులూ. తల్లీ! నీవు ప్రేమతో పట్టు పరుపులపై పవళింప చేసి, లాలించి, ముద్దులుకొన్న మా అన్న ఎక్కడ పడుకున్నాడో, ఎలా పడుకున్నాడో, ఎలా నిద్రించాడో కళ్ళార కాంచావుకదా. ఇటువైపు మా వదిన పరుండినశయ్య. ఆమె ఆభరణాలతోనే పండినట్లున్నది. దర్భల రాపిడికి బంగారంపొడి సూక్ష్మ రేణువులు అక్కడక్కడా అంటుకున్నై. ఆమెపై వలువ చెంగు పట్టుకున్నట్లు తెలుపుతున్న ఈ కుశాగ్రం చూడు. సన్నని పట్లు దారంగ చివర్లు కనిపిస్తున్నై. ఎక్కడ మహారాజప్రాసాదం? ఎక్కడ గారచెట్టు? ఎక్కడ పట్టు పరుపుల పందిరి మంచాలు? ఎక్కడి కుశాస్తరణాలు? మందమలయానిలాలహాయి ఎక్కడ? దాన దహన తప్తమై, ధూళి ధూసరమైన గాడుపు ఎక్కడ? మధుర మనోజ్ఞ విహంగకల కూజితాలకు కన్నులు తెరిచే అయోధ్యారాముడెక్కడ? జంబుక వృక పంచాననవ్యాఘ్ర భయంకరా రావాలకు మెలకువకనే అడవి రాముడెక్కడ? వసిష్ఠాది మహర్షులతో, సుమంత్రాది మంత్రులతో, సామంతులతో, పౌరులతో పరివేష్ఠింపబడిన పేరోలగంలో తండ్రి ప్రక్క సింహాసనంపై కూర్చుండి కొలువు తీరే అగ్రజుడెక్కడ? పిలిచిన పలికే దిక్కులేక, ఒంటరివాడై, రాయి రప్పల్లో, చెటుచేమల్లో తిరుగాడటం ఎక్కడ? ఈ కరకు రాతినేల, చంద్రకాంత శిలాఘటితమా? ఈ మొరకు దర్భలు మెత్తని దూది పరుపులా? ఈ ఇంగుదీ వృక్షం నవరత్న సగితశ్వేతచ్ఛత్రమా? ఈ హోరు గాలి వింజామరులు వీచే

కుమార సమీరమా ? కాకరుతి వందిమాగధస్తోత్రమా ? హేమ వికార భూషణ స్వనముగా ఝిల్లీ రవాన్ని ఎలా భావించావు ? మధురాతి మధుర ఫలభక్ష్యములుగా, కటుతిక్త లవణామ్లాది పదార్థాలను ఎలా భుజించావు ?

ఛీ ఛీ ! నేను భ్రాంతిలో పడ్డాను. ఇది సత్యమెలా అవుతుంది? ఇది నిజంగా కల. కాకపోతే, రఘురాముడెక్కడ ? కటిక నేలపై పరచిన దర్భలు శయనంగా పరుండటం ఎక్కడ ? దైవం బలమైనదన్నారు కాని, కాలమే బలమైంది. కాదంటే, సౌఖ్యమే ఎరగని నా అన్న దీని మీద పడి మైమరచి నిద్రిస్తాడా ? జనక చక్రవర్తి కూతురూ, పంక్తిరథుని కోడలూ, రాముని భార్యా అయినసీత, స్నానసమయంలో సమోష్ణ జలానికే కందే శరీరంగల సీత, నిశ్చింతగా నిద్రించిందంటే, కాలమే శక్తి కలదని కనపడ్డంలేదా ? నేను ఎంత పాపం చేశాను ! ఈ ఘోరం తిలకించి కూడా గుండె నిలిచిందంటే నాహృదయం, రాయీ కాదు, వజ్రమూ కాదు. అవి స్వజాతి ఘాతానికి బద్దలౌతై. కనుక నాకు హృదయమే లేదు. మహారాజవంశంలో పుట్టి, మహర్షుల అంతేవాసియై, జగత్పీడాకరులైన మారీచ తాటకా సుబాహుల మద మడంచిన లోకైక వీరుడు, అబలునివలే, అసహాయునివలే దర్భలపై శయనించటం ఎంత దుర్భరం ? ఈ దృశ్యాన్ని చూడాలని ఎంపిక కోరినట్లు. చూచి ఏం చేసినట్లు ? మా ముగ్గురు సోదరులలో సౌమిత్రి ధన్యుడు. కష్టకాలంలో అన్నవెన్ను వెంటనుండి, పవిత్ర హృదయంతో పరిచర్య చేస్తూ, అహోరాత్రాలు అనుకుంటున్నాడు. వదిన ఎంత మనస్విని ! సాహసులైన పురుషులకే చొరరాని దండకారణ్యానికి పతితో అనుగమించి వచ్చింది. పతిసేవా భాగ్యం పండించుకొని భారత నారీమణిహారతరళమైంది. తండ్రి మరణంతో, అన్నల అరణ్యవాసంతో కర్ణధారి లేని నావ వలే భూమండలం క్రక్కదలిపోతూంది. అన్న అడవిలో వున్నా ఆయనబాహు రక్షించకపోతే అయోధ్య శత్రువుల చేతికి పోదా ? గవనులన్నీ తెరచివున్నై. హయశిక్షకులు లేరు. గజరక్షకులు లేరు ప్రాకారాల పర్యవేక్షణ లేదు. ప్రజలు దిక్కుమాలిన దీనులై వున్నారు. అయోధ్య

అయోధ్యగానే వున్నది. భక్ష్యం విలువగల పదార్థమైనా విషమిశ్రమం అనితెలిస్తే, ఆరగించటానికి ఆశపడే దెవ్వరు ? నేను తెలిసికోరినా, తెలియకకోరినా, చూచింతర్వాత స్ఫురణకు వచ్చిన భావం చెపుతా వినండి.

ఈనాటి నుంచీ తృణ పర్ణశయనాలనే పండుకోటానికి పరిగ్రహిస్తాను. వలువలుగా నార వస్త్రాలే ధరిస్తాను. అన్నలవలె జడలు తాలుస్తాను, కాయ రక్షణకు కందమూల ఫలాల్నేగ్రహిస్తాను. అన్నకు బదులుగా. పితృ వాక్యపాలనార్థం అరణ్య వాసం నేను చేస్తాను. అన్నకు సౌమిత్రివలే, నాకు తమ్ముడు శత్రుఘ్నుడు తోడుగా వుంటాడు. అయోధ్యకు అన్నలను కొనిపొండి, సలక్ష్మణుడై వచ్చిన అన్నకు పట్టం కట్టండి. ఆయన పాలనలో అఖండ చరాచర జీవకోటి ఆనందించుగాక. ఓ దివ్యులారా ! మీకు నమస్కారం. నా అభికాంక్షితాన్ని నెరవేర్చండి. పాదాల పయిబడి ప్రార్థిస్తాను. అంగీకరించేట్లుగా అనుగ్రహించండి. ఆయన సమ్మతించకుంటే ఆయనతో వుండేందుకై ఇష్టపడునట్లయినా చేయండి. ఈనిర్ణయానికి మీరే సాక్షులు. "

## భరతుడు గంగా నది దాటుట

అని, అద్వైతమైన ప్రతినలుచేసి, తమ్మునితో, " నా కింకా విద్రరాదు. ఇప్పుడు నాల్గవ జాము వచ్చింది. నీవుపోయి మహారాజును తోడ్కొనిరా. నదిదాటే ప్రయత్నం చేయిస్తాడు. నిశాశేషం ఆ జాగరణలో వెళ్ళబుచ్చుతాను. " అని చెప్పగా శత్రుఘ్నుడు ఏగి భరతవాక్యం వినిపించగా, ఆతడు వేగంగా వచ్చి, అంజలించి " దొరా ! గంగ మొత్తడున కష్టం లేకుండా రేతిరి నడిపిందా ? బలగానికి తగినంత సుకం మావోళ్ళు ఏరుపాటు సేసినారా ? దొరసానమ్మలు కులాసగ వున్నారా?"

అని క్షేమాన్ని గూర్చి ప్రశ్నించాడు. " మిత్రుడా! నీ సపర్యలు మాకన్ని విధాలా అందినై. తృప్తి పడ్డాం! ఇక గంగనది దాటే కార్యం నెరవేర్చు " అని తీవరించి భరతుడు పలికాడు. అడవిరేడు శర

వేగంతో నగరం లోకిపోయి కొమ్ము వూదించాడు. బిలబిల పరివారమంతా చేరింది. చేరినవారితో " మా పిన్న దొరను దండుతో గంగమ్మ తల్లిని దాటేయాలె. మీరంతా తీరానికి పోయి చిటికెలో సిద్ధం సేయండి " అని ఆజ్ఞచేశాడు. వారంతా గంగా తీరానికి గబగబా వెళ్ళారు. అయిదు వందల పడవలు " స్వస్తికం " అనే పేరుతో వ్యూహంగా పన్ని, గంటలూ, గవాక్షాలూ, జెండాలూ, కంబళాలూ, అలంకారంగా తీర్చి. రేవులకు చేర్చారు. గురువులు, విప్రులూ, రాణులూ, పౌరసతులూ వాటిల్లో ఎక్కారు. అన్నిటి కంటే శ్రేష్ఠంగా వుండే నావను శ్వేత కంబళాలతో చాందినీ కట్టి, ఆసనాలమర్చి, మంజుల ఘంటికా నాద మేదురంగా, సాలంకృత చిత్ర విచిత్ర వర్ణపటిచయ సంపూర్ణంగా వున్న దానిని గుహుడు ప్రత్యేకంగా రాజ కుటుంబం తరించటానికి తెచ్చి ముందరగా వుంచాడు. ఆ నౌకా సౌందర్యానికి అంతా అచ్చెరువు నందుచూ అధిరోహించారు. నావలలో భరతాదులు ప్రవేశించగానే ప్రయాణ సూచకంగా, బాకా లూదరు. మంగళ వాద్యాలు మొరసినై. వెంట తెచ్చిన వస్తు సముదాయం పడవలలో నింపారు. తాత్కాలిక విరచిత శిబిరాలు కొందరు దహింపగా, నేముందు నేముందు అని కొందరు నీళ్ళలో దిగారు. గంగానదీ సంతరణ సమయంలో వుల్లంబున మల్లడి గొని పెల్లుబికిన పరస్పర సంభాషణా రావం దశ దిశాంచలాలను ఘట్టించింది. కుంభ స్థలంపై మావటీంద్రుడు కూర్చుని వుండగా, కేతనాలు గాలికి రెపరెపలాడగా దంతావళ సంతానం తటిని తరిస్తుంటే, ప్రాణంతో వున్న పర్వతాలు కదలి వస్తున్నట్లుగా భ్రాంతిని కల్పిస్తూంది. వుత్సాహ వంతులు, ధైర్యవంతులు, సాహసవంతులు ఆధార రహితంగా ఈద సాగారు తెప్పలపై తేలుతూ కొద్దితో నడుపుతున్నారు. తేలికకొయ్యల సాయంగా కొందరూ, కుండలు వుపకరణంగా కొందరూ, యానపాత్రలపై కొందరూ, ఎవరికి తోచిన రీతి వారుగా వీలైన రేవుల్లోకి దిగి ఈదుకుని పోతూంటే, చేపల దండ్లు వలస పోతున్నాయా ? అని అనిపిస్తూంది. రామసేవకు పోతున్న భరతుణ్ణి గంగాదేవి సహస్రమీన నేత్రగా సందర్శిస్తు న్నట్లుంది.

## భరతుడు భరద్వాజుని సందర్శించ బోవుట

ఈ విధంగా భరతుడు పరివార బంధుజన సైన్య సమేతంగా గంగా నది దాటి, మంచి ముహూర్తంలో ప్రయాగ వనానికి ప్రయాణించాడు. వచ్చిన వారి నందర్నీ అక్కడ వుచిత ప్రదేశాల్లో వుండమని ఆజ్ఞఇచ్చి ద్విజశ్రేష్టులతో, బంధు ముఖ్యులతో, పాదచారియై, జ్ఞాన వృద్ధత్వంలో తపో వృద్ధత్వం సమీకరించుకున్న వానినీ, ఇంద్ర పురోధ ఐన వానినీ, భరద్వాజ మహర్షిని దర్శించే నిమిత్తం నందన వనాన్ని నవ్వే వనాన్ని చేరాడు. విల్లంబులువిడిచి, పట్టవస్త్రాన్ని బుజంపై వ్రేలాడవేసి, వసిష్ఠాదులు పురోగాములు కాగా ఆశ్రమంలో ప్రవేశించాడు. వసిష్ఠ దర్శనంతో భరద్వాజుడు ఆసనం దిగి శిష్యులతో ఎదురునడిచి అతిథి మర్యాదలన్నీ ఆచరించి, దర్భాసనాలపై ఆసీనుంచేసి, భరతునిగాంచి, " నీ చతురంగ బలానికీ, కోశానికీ, మిత్రా మాత్యులకూ లోపం వాటిల్ల లేదుకదా ? " అని క్లుప్తంగా కుశల ప్రశ్నలు చేసి వూరకున్నాడు, భరతుడు " మహర్షి శ్రేష్ఠా ! మీ అగ్ని హోత్ర కార్యాలకు అంతరాయం కలుగదుగదా ? తపస్సు నిర్విఘ్నంగా సాగుతున్నదని తలుస్తాను. శిష్యులు వేద పాఠాలు వల్లిస్తూ, బ్రహ్మజిజ్ఞాసువులై, మీ సేవా కార్యాల్లో శ్రద్ధగా వున్నారు కదా ? ఆశ్రమ ధేనువూ, శకుంతాలూ, ఆరోగ్య వంతములేకదా ? మీరు మమ్మల్ని ప్రశ్నించినట్లు, మేం మిమ్మల్ని ప్రశ్నించటం ధర్మం కాదని తెలుసు. లోకాచారాన్నీ, కులాచారాన్నీ పాటించానే గాని, మీకే అంతరాయం రాదనీ, మీ తపో బలమే విశ్వరక్షణ చేస్తున్నదనీ ఎరుంగుదును, ధర్మా ధర్మాల త్రాసునందు అధర్మభారం అధికమైనా అడుగుదాక వాల లేదంటే మీ అమోఘశక్తే అందుకు కారణం " అని ప్రాంజలిబంధంగా ప్రార్థించాడు.

## భరద్వాజుడు భరతుని రాకకు కారణం అడుగుట

భరతుని మాటలకు బదులు చెప్పి, " రాజా ! పట్టాభిషేకం వైభవంగా జరిగిందా ? పితృ మేధం సశాస్త్రీయంగా జరిగించావు కదా?

మంత్రాంగం సవ్యంగా నడుస్తూందా ? సామంతలోకం సవ్యంగా కప్పంకడుతూ, నీ ఆజ్ఞలు అవధరిస్తున్నదా ? పౌరులు అధివ్యాధుల్లేక, ఆనందంగా నీపై భక్తి విశ్వాసాలు ప్రకటిస్తున్నారా ? నీ తల్లులకు కుశలమేకదా ? ఇప్పుడు నీరాకకు కారణం ఏమిటి ? నీ తల్లివాక్యానుసారంగా నీ తండ్రి రాముణ్ణి అరణ్యానికి పంపించాడు. అతడు సభార్యా సోదరుడై, అన్నమాట ప్రకారం అడవుల చేరాడు. ఆ సత్య వ్రతుడు, అసూయా రహితుడు, పరహిత క్షేమంకరుడు, నీకపకారం చేసేవాడుకాదే, నీపాలనం అకంటకంగా వుండాలని ఆలోచించి, అతని వునికినే సందేహించి వచ్చావా ? మేఘరహితంగా పిడుగు పడ్డట్లు, ఈ అకాల గమనానికి అర్థం ఏమిటి ? ఈపాపార్జిత విత్తం ఇంత తీపా నీకు ? అగ్రజుడై, అధికారియై, వారసుడైకూడ, స్మరణ మాత్ర సర్వలోక సంహారక చాప విద్యా శిక్షితుడైన లక్ష్మణుడు కలవాడై, సాధు చింతనతో కానలకు కట్టు గుడ్డలతో వచ్చిన వానిపై ఇంకా పగ ఎందుకు ? అతడు నీ కేమీ అపకృతి చేయడు. నీరాజ్యాన్ని తిరిగి కోరడు. నీవు శాంతుడవై తిరిగి పోవచ్చు" అని సూటిగా పోటు మాటలన్నాడు మహర్షి భరద్వాజుడు.

భరతుడు ఘోరంగా దుఃఖిస్తూ మహర్షి పాదాలపై వ్రాలి, "ముని తల్లజా ! నన్ను అందరూ అన్ని విధాలా అనుమానింపవచ్చు. అందుకు కారణం కైకేయీ పుత్రుణ్ణి కావటంచేత. దానికి అంతగా బాధపడను. ఆగతానాగతాలు దర్శించే దివ్య దర్శనులు నన్నట్లా దర్శించి నందుకు బాధ పడుతున్నాను. నాకు తెలియని, నేను చేయని ఏదో దోషం నాలో వుండి వుండాలే. లేకపోతే మీ మనో దర్పణంలో నారూపం అలా ఎందుకు గోచరిస్తుంది ? ఇక నాజీవితం వ్యర్థం. అన్న దర్శనం కాలేదని ఆరాట పడవలసిన పనిలేదు. ఆయన్ను రాజును చేసే నిమిత్తం అర్థించవలసినపని అంతకంటే లేదు. నేనేకాదు. అయోధ్య వాసులేకాదు, అవనీ పతులే కాదు, అవని అంతా ఆయన పాలనలో సంతోషించే సత్కర్మలు చేయలేదు. రామలక్ష్మణ రహితుడైన భరత శత్రుఘ్నులు బ్రతకటం పృథివికి భారం, గురుదేవా ! దయతో నాకు ప్రాయోప

వేళానికి అనుమతి ఈయండి. జన్మాంతరం లోనైనా మా ఆత్మలు అన్న తేజంలో అంతర్లీనం అవుతై" అంటూ అందుకు సిద్ధం కాబోతుంటే, భరద్వాజుడు ఆనందంతో ఆలింగనం చేసుకొని "వత్సా! శోకింపకుము. నీరాక నాకు తెలుసు. నీహృదయంతెలుసు. నీనిర్ణయంకూడా నాకు తెలుసు. నీ పవిత్ర కార్యాచరణదీక్ష, నీ సోదరభక్తి, లోకానికి తెలియచేయటానికే, వున్నదానిని ద్విగుణీతంచేసి అచంచలంగా వుంచటానికే, పరుషంగా పలికానేకాని, నిన్ను శంకించి కాదు రామద్వేషంగల ప్రాణి నా ఆశ్రమములో అడుగుపెట్టే అవకాశంలేదు. సీతారామలక్ష్మణులు సుఖంగా వున్నారు నీవు సపరివారంగా, ఈ రాత్రికి ఇక్కడ నిల్చి, రేపు వెళ్ళవచ్చు" అని కోరాడు.

"మహానుభావా! మీ అపారకృపాపాత్రుడ నైనందుకు నాజన్మ చరితార్థం అయింది. నాలోని యత్కించిత్పాపలేశంకూడా మిగులక దగ్ధమైంది. మీరిచ్చిన ఆతిథ్యంతో మేం తృప్తులమైనాం. అయోధ్య అంతా వచ్చింది. తాము తాపసులు, ఇందరికి భోజన భాజనాలకై తాము శ్రమించడం ఎందుకు? అన్నీ సంసిద్ధంగానే వున్నై" అని భరతుడు అనగానే నవ్వి "దాశరథీ! సందేహించవలసిన పనిలేదు. నాకు ప్రీతిపాత్రుడైన రాముణ్ణి రాజునుచేసే ప్రయత్నంలో వచ్చావు. అందుకు నా ఆనందం హద్దులు దాటింది. మా శ్రమ క్షణకాలం మానసికమైంది, మీరే వచ్చారుగాని, సేనా పరివారంరాలేదు. వెంటనే కబురుపెట్టించి పిలిపించు. నేను మీకు విందు చేస్తాను" అని భరద్వాజుడు అన్నాడు. "దేవా! ఇది ఆశ్రమం. ఇక్కడ నిర్మల వాతావరణం, ప్రశాంతి, నియతకర్మానుష్ఠాన విధులూ కలుషితం కాకూడదని మేమే వచ్చాం. గుర్రాలూ ఏనుగులూ, జనసందోహం, సైన్యం వస్తై. వాటి అన్నింటికీ అవాంతరం వస్తుంది. మీకు అపకారంజరుగుతుంది అనే భయంతో తీసుకురాలేదు" అని భరతుడు చెప్పగా "భయపడపనిలేదు. మేంకోరి ఆహ్వానిస్తున్నాం. మా మాటలు మన్నించటం మీకు క్షేమం" అంటూ ముని త్వరపెట్టాడు. తనతోవచ్చిన వారిలో ముఖ్యులనుబిల్చి అందరినీ కొనిరమ్మని ఆనతిచ్చాడు.

## భరద్వాజుడు భరతునికి విందుచేయుట

ఆమాటలువిని భరద్వాజుడు అగ్నిహోత్రగృహంలో ప్రవేశించాడు. ముమ్మారు ఆచమించి, ముఖమార్జనం రెండుసార్లు చేసి, ఆతిథ్యం ఇచ్చే నిమిత్తం సంకల్పంచేసి విశ్వకర్మను ఆహ్వానించాడు. వచ్చినవానితో తన కోరికచెప్పాడు. నీవూ, 'త్వష్టా' కలిసి గృహనిర్మాణం చేయండి. ఇంద్రుడు మొదలైనవారు సకలవస్తు సంతానం సంతరిస్తారు. తూర్పు పడమర దిక్కులా, మింటాపున్న సమస్త నదులు, కొన్ని చెరకురసం, కొన్ని సురా, కొన్ని మైరేయం, కొనితెస్తై. దేవగంధర్వ, యక్ష. విశ్వావసు, హాహా, హూహూలు, రెండు విధాలైన అప్సరః కాంతలు, విశ్వాచీ, ఘృతాచీ, వినుతా, అలంబసా, నాగదంతా, హేమా. మిశ్రకేశీ, బ్రహ్మలోక వాసినులైనవారూ, నారదతుంబురులూ, కలసివచ్చి సంగీతశాస్త్ర భేదాలు సమకూరుస్తారు. కుబేరుని చైత్రవనం వస్త్రభూషణ పరిచారికా సహస్రం ప్రసాదిస్తుంది. చంద్రుడు భక్ష్యభోజ్యాలూ, లేహ్యచోష్యాలూ, వివిధాన్న భేదాలు చేకూరుస్తాడు. ఇంకా రకరకాల పూలదండలూ, మధురజలాలూ, పక్వ మాంసపదార్థాలూ సమృద్ధం చేస్తాడు, అనే అర్థం కలిగిన వేదమంత్రాలను, శిక్షాస్వరం తప్పకుండా, సమాధిగతుడై ప్రాఙ్ముఖంగా పఠిస్తూ, ఒక్కొక్క దేవతను ఆహ్వానిస్తూ, ఆదేశిస్తున్నాడు.

ఆయన తపశ్శక్తితో ముక్కోటి దేవతలు తిరుగుతున్నారు. ఎవరిని పిలుస్తాడో అనే భీతితో అంతా వున్ముఖులై వున్నారు. సంకల్పంతో స్వర్గంలోకం వంటిలోకం సృష్టిస్తుంటే, బాహ్యలోకంలో ఆయన వాంఛాధీనంగా ప్రకృతి పరివర్తనం పొందుతూంది. పూలవాన కురిసింది. దుందుభులు మొరశాయి. సువాసనా భరితంగా సుఖంగా, మలయానిలంవీచింది. అప్సరసల చరణవిన్యాస మంజీరనాదాలూ. జంత్రస్వనాలూ. గాయక గేయరవాలూ కర్ణపేయం కలిగించినై. ఆధ్వనులు ఆగినవెనువెంటనే అయిదు యోజనాలప్రదేశం, శిలాకంటక నిమ్నోన్నతస్థితి మారి సమతలమై, సుందర మందిరాలు రూపులు దిద్దుకున్నై. నీల వైడూర్య స్నిగ్ధకాంతులతో గరిక బయళ్ళు కనువిందుకూర్చినై. మారేడు, వెలగ, [illegible], పనస, మామిడి,

పుసిరిక వృక్షాలను ఫలసహితంగా చైత్రవనం కల్పించింది. నదులు సాకారంతో మద్యం, ఇక్షురసం, మైరేయం, కొనివచ్చినై. చచ్చవకంగల ఇండ్లూ గజవాజిశాలలూ, తోరణాలతోకూడిన ప్రాసాదహర్మ్యాలూ, వింతలై, విశాలంగా, సంతాన, పారిజాత సుమసమలంకృతాలైన శయ్యలూ, దివ్యరసాంచితభోజన వస్తుసంచయం, వస్త్రాలూ, భూషణాలూ, స్నానశాలలూ, పానవాటికలూ, మరుగుదొడ్లూ ఆవిర్భవించినై. వైజయంతీ విలాసాన్నిమించిన భర్మహర్మ్యంలోనికి, రాజమర్యాదలతో, భరతుణ్ణీ, బంధువులనూ, మాతృదేవతలనూ రమణీమణులు ఆహ్వానించారు. ఆసనాలపై మంత్రులంతా ఆసీనులై వున్నారు. మధ్యగా, నవరత్న స్థగితహేమసింహాసనం, ఛత్రం, చామరం వున్నై. వాటికి వలగొనిమ్రొక్కి మంత్రులవరుసలో కూరుచున్నాడు. ఆయన వెనుకమంత్రి పురోహిత మహర్షి సేనానాయకవారం యధోచితాసనాలను అలంకరించింది.

ఆసమయంలో కుబేరుని ఆజ్ఞచే దివ్యాభరణాలుదాల్చి, జిలుగుపావడజగట్టి, అస్తినాస్తి విచిత్సాహేతుమైన (వున్నవా? లేవా? అనే సందేహానికి అవకాశంగల) చీరలూ, రైకలూ ధరించి అప్సరసలు వచ్చారు. బ్రహ్మలోకంనుంచి సతీమతల్లులు వివిధాభరణ భూషితలై ఇరవైవేలమంది సువాసినులు విచ్చేశారు, వరుసవరుసకూ మధ్యగా కమ్మని వాసనలతో గంగ కాలువగా ప్రవహించింది. ఆఒడ్డుల్లో ఎవరికివారికి ఎదురుగా చిరుగద్దెలు అమర్చబడినై. అధికారాన్నిబట్టి, బంగారం, వెండి, కంచు, కలిగిన పళ్ళాలూ, అరటి ఆకులూ సమకూర్చబడ్డాయి. ఆలాగే పానపాత్రలు ప్రక్కన పెట్టబడినై, బంతి బంతికీ, తాకితే కందేవాళ్ళు, చూస్తే వెర్రిపుట్టించే వాళ్ళు, కోరకనే కోర్కెలు తీర్చేవారూ, లక్ష జన్మలెత్తినా లభించని వారూ అయిన దేవతాస్త్రీలు, అప్సరోగణం, సువాసినులు భోజనపదార్థాలను తెచ్చి వడ్డిస్తుంటే, నారద తుంబురులు వీణావాదనంతో వీనుల విందు కల్పిస్తున్నారు. ఆమహర్షి ఆశ్రమ వాతావరణంలోని ప్రతి అణువు పరమసుకుమార సుందరాకారంతో పొల్చే అంగనాజనమైకానవస్తోంది. ఆడుతున్నది, పాడుతున్నది. మనిషిమనిషికీ వ్యవధిలేకుండా మనస్సులో కోరిక బయటికిరాకముందే భోజనపాత్రలలో ప్రత్యక్షమవుతూంది.

"ఓ మదిరాపాయులారా! (త్రాగుబోతులారా) రండి. త్రాగండి. తనివితీరగా త్రాగండి. ఇదిగో పాయసం. అవకాశం పోతేరాదు. అమృతమే ఇది. సేవించండి. ఇవి మాంసం వంటకాలు. ఆరోగ్యశాస్త్రానుసారం అశ్వనీకుమారుల పర్యవేక్షణలో వండబడినై. తినండి. ఇంకా తినండి. ఇదిగో తాంబూలం. ఇవిగో కదళీఫలాలు. సీతాఫలాలు, బత్తాయిలు, నారింజపండ్లు, పనసతొనలు, ద్రాక్షలు. మొగమాటపడకండి. అభిమానపడి వద్దని ఆశాభంగం కాకండి. ఇదంతా దేవతాప్రసాదమే. సారాయంలో పేరాలరసం కలిపి, చెరుకురసంపోసి తయారుచేశాం. సేనాపతులు సేవించండి రాండి. రాండి. అవి స్నానాలగదులు. సంపెంగనూనె, అత్తరువు, పన్నీరు అక్కడ వున్నై. శిరస్స్నానం చేయిస్తాము. నలుగులుపెడతాం. తలలంటుతాం. తప్తజలంపోస్తాము" అంటూ, ఒక మనిషికి ఎనిమిదిమంది మదవతులుచేరి, బలాత్కారంగా, తలంట్లు పోస్తున్నారు. సన్నని దేవతావస్త్రాలు సవరిస్తున్నారు, తినిపిస్తున్నారు, గంధం పూస్తున్నారు. కస్తూరి రాస్తున్నారు. పురుషదేవతలు, రథాలకు అలంకారం చేశారు. గుర్రాలకు నీళ్ళుపెట్టారు. దాణాలుపెట్టారు. జీనులు, కళ్ళెలు సరిచేశారు. ఏనుగుల శాలల్లో ఒక్కొక్కముద్ద గుమ్మడికాయంతచేసి ఆహారం గజాలకు అందించారు. ఒకళ్ళు కడిగారు. బంగారం అంచులున్న పట్టుగుడ్డలు వీపులపైవేసి అంబారీలు సిద్ధంచేశారు. ఒంటెలకు, కుక్కలకు, పశువులకు, పక్షులకు కాదగిన రీతిగా పదార్థాలు పెట్టి తృప్తిపరిచారు. తల మాపినవాళ్ళు, వలువలు మాపినవాళ్ళు, కంటిలోకి కలికానికైనా కానరాకుండా శ్రద్ధతీసుకున్నారు. అసంఖ్యాకంగా వచ్చిన అయోధ్యా పౌరజన, సేనలు ఆ విందులోబడి తినిమంద బుద్ధులైనై.

ముచ్చెలు, పావుకోళ్ళు, కిర్రుచెప్పులు, అద్దాలు, దువ్వెన్లు, ఏలకులు, లవంగాలు, జాజికాయలు, జాపత్రులు, పచ్చకర్పూరం. పోకలు, ఆకులు, ముత్యాలసున్నం, కస్తూరి, దంత ధావనమార్ణం, కాష్ఠాలు, కూర్చాకృతులైన పలుతోము దంతపు పుడకలు, జిహ్వాశుద్ధికి బంగారు రేకులు, ధూమపాన వస్తువులు, ఒకటేమిటి, నాటికీ, ఆనాటికీ, నేటికీ. ఏనాటికీ మానవుని వ్యామోహంలో పుట్టే వాంఛలన్నీ ఆకృతిగొని అక్కడవిల్చి ఆతిథ్యం ఇచ్చినై.

లభించువారికి అతినూత్నంగా అనుభవం చేకూర్చింది. ఆ అనుభవ సమయంలో వారన్నారుకదా "సీతారామ లక్ష్మణులకు క్షేమం కలుగుగాక, భరతుడు చిరకాలం వర్ధిల్లుగాక. మేం అడవిలోకీపోం, అయోధ్యకూపోం, ఇక్కడేవుంటాం. ఈ స్వర్గసుఖాలన్నీ చూరకొంటుంటాం" అని. అలా భావించారంటే అందుకు కారణం లేకపోలేదు. వారు విడిసిన చోటినుంచి వనానికి వచ్చేలోపల ఈనగర నిర్మాణమేమిటి? ఈ అతిలోకమైన ఆతిథ్యం ఏమిటి? ఎలాజరిగింది? కల్పితమనీ, కలఅనీ, త్రోసేద్దామంటే, రాత్రి అనుభవించిన చిహ్నాలన్నీ తెల్లవారిన తర్వాతకూడా వున్నై, నగరంలేదు. ఆ తోటల్లేవు. ఆ సుందరీసుందరులు లేరు. ఆ పాధేయాలు లేవు. అన్నీ అదృశ్యమైనై. కాని, తాము ధరించినవన్నీ వున్నై. తమమేని వాసలు వున్నై. తమ అనుభవంవుంది. తమ అలంకారాలు వున్నై.

## భరతుడు భరద్వాజునకు తల్లుల నెరిగించుట

సూర్యోదయం కాగానే తల్లులతో, పురోహితులతో, గురుదేవులతో కూడి ఆశ్రమానికివచ్చి భరతుడు మహర్షిపాదాలకు ప్రణమిల్లాడు. సంయమి ఆశీర్వదించి రాత్రి విందువిషయం ప్రస్తావనకుతెచ్చి, "వత్సా! అరణ్యకులమైన మా ఆతిథ్యం అందుకున్నారా? అసంతృప్తి కలుగలేదుకదా" అని అడిగాడు. దానికి దాశరథి "స్వామీ! మేం సామాన్యులం. మాకు లౌకికమే కొంతతెలుసు. అలౌకికశక్తులకు ఆట పట్టయిన మిమ్మల ప్రశంసించే యోగ్యతే మాకులేదు. మేం ఏనుగుల వంటివాళ్ళం. ఆకారం ఎంతపెద్దదో అక్షులు అంతచిన్నవి. మీ ఆతిథ్యం గ్రహించిన ఆనందంలో మావాళ్ళు వచ్చినపని మరచి ఇక్కడేవుంటాం అంటున్నారు. ఇంతకంటె నేనేంచెప్పగలను? నా మనస్సు నాస్వాధీనంలో నిల్వటంలేదు. అన్న దర్శనార్థం ఆత్రులువాస్తోంది అన్న ఎక్కడవున్నాడు? దారేది? సెలవిస్తే, పోయి ఆయన్నుసేవించి అయోధ్యకురమ్మని అర్థిస్తా" అని సమాధానం చెప్పాడు.

అప్పుడు భరద్వాజుడు భరతునితో భరతా! ఇక్కడికి రెండున్నర యోజనాల దూరంలో "చిత్రకూటం" అనే పర్వతంవుంది. దానికి వుత్తరంగా, సుందరతరులతా బృంద తుందిలమైన "మందాకినీ" నదివుంది. దానితీరంలో

రాముని పర్ణశాలవుంది. ఇక్కడనుండి దక్షిణంగా పోయి, సవ్యదక్షిణంగా పోయేదారి రాగానే, ఆ దారినిపోతే అన్నపర్ణశాలకు అది చేరుస్తుంది" అని చెప్పాడు. అందరూ నమస్కారంచేసి అనుమతి పొందారు. రాణులు ముగ్గురు ప్రత్యేకంగా అభివాదంచేశారు అప్పుడు ముని వృషభుడు "వత్సా! వీరిని వివరంగా తెలుపు" మని కోరాడు. వెంటనే భరతుడు, "దేవా! తలపండి, పుత్రవియోగ శోకభారంతో పొగిలి పొగిలి, కృశించిన శరీరంగల ఆమె అన్నతల్లీ, నాపెత్తల్లీ, ఆమెప్రక్కనిల్చిన మహాయోగిని నా చినపెద్దమ్మ లక్ష్మణ శత్రుఘ్నులగన్న తల్లి. ఆమె నన్ను కన్నతల్లి. ఈయవాంతర దుస్సంఘటనలకు ఆమే మూలం. ఇంతకన్న ఏంచెప్పను?" అని తలవంచుకున్నాడు. "నాయనా! తల్లిని నిందించవద్దు. ఏదిజరిగినా మనమంచికే. ఆమె, నిందకు పాత్రురాలై, అఖిలజగత్తుకు ఆనందం ప్రసాదించింది. ఆమెనిమిత్తం. అమరకార్యం. అసురభంజనం. ప్రజారాపను రంజనం, ధర్మనిక్షేపగ్రహణాంజనం. పోయిరాండి. శుభంభూయాత్.

## భరతుడు చిత్ర కూటానికి ప్రయాణం సేయుట

భరద్వాజ మహర్షి, భరతాదుల పట్టరాని సంతోషంతో ఆశీర్వదించి అనుజ్ఞ ఇచ్చాడు. అనంతరం చతురంగ బలసమేతంగా, మహర్షి చెప్పిన మార్గం గుండా భరతుడు ప్రయాణం సాగించాడు. నానా విధాలంకారాలతో ఒప్పుతున్న వాహనాలపై కొందరు పోతున్నారు. గంటలు మ్రోగుతుండగా కదలి పోతున్న గజసంతానం. వర్షకాలంలో ఆకాశాన్ని ఆవరించే మేఘంలాగా నేలను ఆక్రమిస్తూంది. కదను త్రొక్కుతూ నడుస్తున్న గుర్రాల డేకల ధాటికి నలిగిరేగిన ధూళి. రామదర్శనార్థం పోతున్న అయోధ్యా వాసుల ఆనందంలో మీరూ, పాలు పంచుకునేందుకు రండని దేవతలను ఆహ్వానించే నిమిత్తం అంబరానికి పయనిస్తూంది. చల్లని పిల్లవాయువులు మార్గాయాసం తగుల కుండా మంద మందంగా వీవనాలు వీస్తున్నై. "అడవిలో సీతరామలక్ష్మణులు సంతోషంగా కాలం గడుపుతున్నా" రని వస్తున్న వారికి ముందే కుశల వార్తలు చెప్పుతున్నవా ? అన్నట్లు పక్షులు మధుర మంజుల కూజితాలు చేస్తున్నై.

ఉచిత వేషధారులై, ఆయుధ పాణులై, వ్యూహగతిలో, నాద్యానుకూలంగా, పదాతులు పయనిస్తున్నారు. " కోడలినీ, కొడుకులనూ, ఎప్పుడు చూస్తా " మన్న తహ తహ ఇనుమడింపగా రాణులు వాహనాలెక్కి వెళ్ళుతున్నారు. తరుణారుణార్క కిరణ సన్నిభంబైన వెలుగులు విరజిమ్మే పల్లకీపై భరత శత్రుఘ్నులు ప్రయాణించారు.

ఆ విధంగా నడచినడచి గంగానది ఆవలి తీరంలో వున్న పెద్ద వనంలో ఆ అనీకిని ( సేన ) చేరింది. అతి వేగంగా వస్తున్న ఆ సైన్య సంచలనానికీ, ఆ భేరీరావాహాఘాంకారాలకూ, బెదరి, కలగుండు పడి ప్రాణ భీతితో పరువెత్తే వనవరాహ, రురు, గజ, హరి, శార్దూలాది మృగ సంచయం, నానావిధ పక్షి సంతానం కొండల్లో, గుట్టల్లో, చెట్లల్లో, వర్ష కాల మేఘంలాగా ఆవరించింది. వాహినీపద ఘట్టనంతో రేగిన ధూళి అరణ్యాన్ని శోభా విహీనం చేస్తూంది. ఎంతో దూరం ప్రయాణించటం వల్ల అలసిపోయిన వారినందర్నీ అక్కడ నిలువ ఆజ్ఞ ఇచ్చి భరతుడు వశిష్టుల వారితో " గురుదేవా ! భరద్వాజులవారు చెప్పిన అడవి ఇదే కావచ్చును. దూరం నుంచి కనుపిస్తున్న పర్వతమే చిత్రకూటం కావచ్చు. ఆ కనుపించేనదే " మందాకిని " అనుకుంటాను. మనం ఇంకొక్క యోజనం పోవలసి వుంటుంది. ఎంత తీవ్ర గమనం చేస్తున్నా దారి తరగటం లేదు." తమ్ముడా ! అటుచూడూ.

## భరతుడు శత్రుఘ్నునికి చిత్ర కూటాన్ని వర్ణించి చెప్పుట

ఆకు పచ్చని రంగుతో, ఆకసాన్ని చుంబించే వృక్షాలతో నయన పర్వం చేస్తున్నదే. అదే మనం చేరవలసిన పర్వతం. అటుచూడు. ఆ పర్వత సానువులలో స్వేచ్ఛగా సంచరిస్తున్న గజబృందం, వర్షాభ్రం నేలను ఆక్రమించిందన్న భావం కల్పిస్తూంది. వాటి సంచార సమ్మర్ద సంఘర్షణపు కాళ్ళ క్రింద రాళ్ళన్నీ పొడి అవుతున్నై. చెట్లన్నీ పూలురాల్చి వానజల్లులవలె భాసిస్తున్నై. అమర కిన్నరీ మిథునం విహార యాత్రలో విలాసంగా సంచరిస్తూంది. గిరిపాద ప్రదేశం, సైనికులతోడ

త్రొక్కిడితో భయపడిన మృగాలు పారిపోతుంటే, సుడిగాలికి బెదరి శరవేగంతో, బారులు కట్టి మింటిపై పోతున్న బెగ్గురు పక్షుల భ్రాంతి పుట్టుతూంది. మన పరివారం నల్లని కురులను ముడివేసి, పూలు ముడిచి దాక్షిణాత్యజనంవలె కనిపిస్తూంది. జనరహితంగా పూర్వం వున్న ఈ అరణ్యం జనతా సంకీర్ణమై అయోధ్యవలె కనులకు ఆనందం సంతరిస్తూంది. రథ గజ తురగ పదాతుల పదఘట్టంతో రేగినదుమ్ము ఘన భోంతరాలను భేద శూన్యం చేస్తుంటే, పెనుగాలులు వీచి ఆ కావిరి పారద్రోలి నాకు హర్షం చేకూరుస్తున్నై. మన సైన్యాన్ని చూచి వులికిపాటుతో నడవలేక, ఎగిరిపోలేక, తొట్రుపాటు పడుతున్న వనమయూర సముదయం ముప్పిరిగా ముదాన్ని కల్గిస్తూంది.

సోదరా! నేత్రోత్సవం కల్గిస్తున్న ఈ కానన ప్రదేశం రెండవ స్వర్గలోకం ఇదేయన్నట్లున్నది. ఇందులో తాప సాశ్రమాలు తప్పక వుంటాయని తోస్తున్నది. పుష్పాల వర్ణ శోభవలె బిందు మృగాలు కనిపిస్తున్నై. ఆ ప్రాంత పరిసరాలల్లోనే అన్న వున్న ఆశ్రమం వుండి వుంటుంది. విచక్షణా దక్షులైన మన సైన్యంలో సాధువులను విడివిడిగా పంపి వెదకించు. వారు వచ్చే వరకు ఇక్కడ విశ్రాంతి తీసుకుందాం."

అన్న అన్నమాటపై తమ్ముడు శత్రుఘ్నుడు సేనాపతులను పిలిపించి, "మనవారిలో సాధువులైన పవాతులను అన్నవున్న ప్రదేశం తెలిసికొని రమ్మని అన్న ఆజ్ఞ ఇచ్చాడు. ఆవిశంగా చేయండి" అని చెప్పాడు. వెంటనే వారు నూర్గురు బుద్ధిమంతులను పదిజట్లుగా విభజించి పంపారు. ఆ పోయిన వారిలో ఒక జట్టు తిరిగి వచ్చి, భరతునకు ప్రణామం చేసి, "దేవా! తమ ఆజ్ఞమేరకు కొంతదూరం వెళ్ళి వెదకి వచ్చాం. ఈ దిశగా చూడండి. ఆ చోట ఒకే ఒక స్థానం నుంచి పొగవస్తున్నది. ఇంకెక్కడా కనుపించటంలేదు, ఆ ప్రశాంత వాతావరణంలోనే పెద్ద దొరలు వుంటారని వూహించాం. ఒక వేళ వారు లేకుంటే అక్కడ తప్పక మున్యాశ్రమం వుంటుంది. అక్కడికి వెళ్ళి వారిని విచారించితే వారు ఎక్కడ ప్రభువులున్నది చెప్పగలరు. తమచిత్తం" అని పల్కి విన్నవించారు. వారితో భరతుడు "మీరంతా ఇక్కడే ఆగిపొండి.

అవసరమైతే మీకు కబురుపంపుతాం. ముందు మేం పోతాం " అని వారికి చెప్పి, తమ్ముడూ, సుమంత్రుడూ, గురుదేవుడూ వెంటరాగా, రామధ్యానైక మనస్కుడై, భక్తి భరతుని రూపంతాల్చగా, భూమినుండి గగనానికి వేసిన నిచ్చెనలాగా నిశ్చలంగా వేస్తున్న పొగను లక్ష్యంగా పెట్టుకుని ముందుకు నడిచాడు.

## చిత్రకూటంలోని వినోదాలు సీతకు శ్రీరాముడు చూపుట

ముందుగా నడుస్తున్న బ్రహ్మణ్యుడైన వసిష్ఠ మహర్షి శ్రీరామ దర్శనం కలుగబోతున్న దన్న సంతోషం పున్నమి వెన్నెల్లాగా దహరాకాశం నిండగా, క్షణకాలం ధ్యాన నిష్ఠుడై, " అనంతమై, అతి నిగూఢమై, అవ్యక్తవ్యక్తమైన ఈ విశాల విశ్వంభర, ఈ జ్యోతిర్గోళాలు, ఈ సృష్టి స్థితిలయాలు ఎవనిచేత, ఎందుకు జరుగుతున్నదో తెలిసికోటానికై యుగ యుగాలు, మన్వంతరాలు మహాతపస్సాధనతో అన్వేషించి " తేజో రూపంగా గుర్తించి, యోగనిష్ఠలో, శరీరంలోని ప్రతి అణువులోనికి ఆకర్షించి ప్రజ్ఞాన, విజ్ఞాన, సుజ్ఞాన సంపూర్ణంగా ధ్వనిస్తున్ననాదాన్ని విశ్లేషించి, ఉచ్చారణ మాత్ర సౌలభ్యంగా ' శ్రుతి ' పేరుతో గానంచేసిన మహా మంత్రాలసారభూతం " రామాకారం " గా దర్శించాడు.

మధ్యలో నడుస్తున్న భరతుడు, అన్న సన్నిధానం అడుగడుగునకు చేరువైనకొద్దీ ఒడలు సంతృప్తితో పరవశంకాగా, ఆయన నీల నీరద కోమల శరీరం అనిర్వాచ్యమైన తేజస్సుగామారి జడచైతన్య మయమైన సృష్టిగా పరివర్తనం పొంది, మహర్షుల, మహాయోగుల హృదయాకాశం నుంచి సృష్టిరహస్యాన్ని వేదంగా, ఉపనిషత్తుగా, సృజిస్తున్నట్లు చూశాడు.

వెనుక నడుస్తున్న సుమంతుడు, బ్రహ్మణ్యుల దివ్య దర్శనంలో ఆవిర్భావంపొందిన ప్రకృతి రహస్యజ్ఞానం, తానాచరించి, తక్కిన లోకాన్ని ఆచరింప చేసి, అనుభవంలో సత్య స్థిరమైనది " ఆర్షధర్మం " అని విశ్వాసాన్ని ప్రతిష్ఠించుటకై క్షత్రియ ధర్మాన్ని చేకొన్న భగవంతుడుగా రాముని తన మనోదర్పణంలో చూచుకున్నాడు. ఇలా భావించుకుంటూ

నడుస్తున్న వారికి గమనాయాసం కల్గలేదు. అక్కడ చిత్ర కూటంలో సీతారాములు వేకువనే మేల్కాంచి సమయోచిత కార్యాలన్నీ పూర్తి చేసుకుని పరిచితమై, అనుభవంలో వున్నప్పటికీ, నిత్య నూత్నంగా కనుపిస్తున్న ఆ పర్వత సౌందర్యం వేరు వేరుగా సీతకు రాముడు తెలుపుతున్నాడు. ఆమెకూడ ఆమాటలు వింటూ ఆ శోభతిలకిస్తూంది.

"జానకీ! నాకీ పర్వతరాజు ఆతిథ్యం లభించినప్పటినుంచీ, బంధువులనూ, మిత్రులనూ, మాతాపితరులనూ, రాజభోగాలనూ, చివరకు రాజ్యాన్నీ వదలివచ్చానన్న తలంపే కలగటంలేదు. అదిగో, అటుచూడూ! అంబరాన్ని చుంబిస్తూ, శాఖాసాంద్రమైన వృక్షాలు, ఇంద్రనీలమణుల్లాగా, స్ఫటికాల్లాగా, ప్రవాళాల్లాగా కాంతులు కల్పిస్తూ కొండచరియలలోని ప్రదేశాలు నయన పర్వం కలిగిస్తున్నై. ఈవైపుచూడూ, పుష్పాదులసేకరణార్థం గుంపులుగా తిరుగుతున్న రోలంబ కదంబం (తుమ్మెదలగుంపు) గగనచ్ఛత్రానికి వ్రేలాడ తీసిన నీలమణులవలె ఎంతమనోహరంగావుందీ? సహజ శత్రుత్వం మరచి అన్యోన్యంకలసి తిరుగుతున్న సాధుమృగాలూ, క్రూరజంతువులూ, భగవంతుడిచ్చిన విశేషవిచక్షణా జ్ఞానాన్ని పాడుచేసుకుని పరస్పరం కలహిస్తూ, వంచిస్తూ, దోపిడిచేస్తూ, హింసిస్తూవుండే మానవులకంటే ఎన్నోవేలమడుంగులు వుత్తమోత్తమంగా కనుపిస్తున్నై. సూక్ష్మంగా పరిశీలిస్తే, "మానవుని మనుగడకోసమే ఇంతప్రకృతి భిన్నభిన్నంగా నిర్మించాడేమో దైవం" అని అనిపిస్తూంది. ఈప్రకృతికి మానవునితో పనిలేదు. మరి మానవునికి ఇదంతా కావాలి. ఏదిలేకపోతే దానికే తహతహపడి, తన్నుకుని, తిట్టుకుని, చంపుకునిచస్తున్నాడు. ఆప్రదేశం ఒక్కమాటుతిలకించూ. ఆకిన్నరదంపతులు ఎంత స్వేచ్ఛానురాగాలతో విహరిస్తున్నారో. వారల అన్యోన్యత ఎంత హృద్యంగావుందీ? ఈసానుస్థలాన్ని లక్షించు. విద్యాధరులు తమ అస్త్ర శస్త్రాలను శాఖలపైనుంచి, హస్తగ్రహీతలై అతివలు వెంటరాగా, వినోదార్థం లతాగృహాల్లో ప్రవేశిస్తున్నారు. ఒక్కమారు సకలసుమసౌరభం రలమున్కలుగా మారుతం క్రుమ్మరిస్తూంది. మనంవచ్చి చాలదినాలైనా, చూచినవే చూస్తున్నా వెగటుకొల్పక ఇంకా చూడాలనిపిస్తున్న ఈచిత్రకూటం, నిజంగా చిత్రకూటమే.

దేవీ! సహచరివై నీవూ, సహజన్ముడై సౌమిత్రీ నన్ననుసరించి వున్నంతకాలం అది ఎంతకాలమైనా ఈప్రదేశం వదలిపెట్టలేను. మాపిన్నమ్మ తెలియకయే పధ్నాలుగేండ్లు నిర్ణయించింది. ఆనిర్ణయం జీవిత పరమావధిగా చేసినట్లయితే ఎంతోబాగుండేది. మహర్షులంతా అనంతవిజ్ఞానం అరణ్యాలల్లో వుండేకదా సృష్టించారు. ఇది ఎంత సహజసంపద? దైవికంగా మొలిచి, దైవికంగా ఎదిగి, దైవికమైన ఋతు ధర్మానుసారంగా, ఫలించే ఈవృక్షలతా గుల్మాదులూ, ప్రవహించే సెలయేళ్ళు, నదులు జలపాతాలూ, గైరిక ధాతువులూ, ఖనిజనిధినిక్షేపాలూ, కృతకమైన మానవకల్పిత గృహారామాదుల్లో లభిస్తాయా? పరమ తాపసుల పద పరాగంతో, విస్ఫారిత విశ్వకల్యాణ వాంఛాభావ సంభారంతో నింపి, నిబిడీకృతమైన, పవిత్రతను సంతరించుకొన్న ఈ అద్రి, జడమైననూ, ఈ అరణ్యం స్థావరమైననూ, ఎంత పుణ్యం చేసుకున్నవో! నా ఈఅరణ్యవాసం ఇతర దుర్లభమైన మూడు మహాఫలాలను సాధించిపెట్టింది. పితృవాక్య పరిపాలనం, సోదర మాతృ హృదయానుశీలనం, ఆత్మధర్మ పరిశీలనం. ఇకనాకు కావలసింది ఏమీ లేదు. జానకీ! త్రికరణశుద్ధిగా నాతోకూడి ఈ మహానందానుభూతిని మరీ మరీ పొందుతావుకదా? చాపలు పరచినట్లుగా, నునుపు, చదరంకల్గి, నల్లగా తెల్లగా, ఎరుపుగా వందలకొలదిగావున్న ఈ చాపరాళ్లను చూశావుగా. ఈ రాళ్ళల్లో రాత్రివేళ పర్వతంలోవున్న ఎన్నో ఓషధులు తమ వెలుగుల ప్రసరింపచేసి "ఈ ప్రదేశమంతా నెమిళ్ళ కొలువుతీరినవా?" అన్నట్లు గోచరిస్తున్న సమయంలో నాతోవచ్చి విహరించగలవా? వనవాసవ్రతాన్ని కూర్చి మాపెద్దలేమన్నారో తెలుసా? అపవర్గావహమనీ, సంసృతిపాశావిచ్ఛేదకమనీ. (ముక్తికూర్చేదీ, సంసారబంధాన్ని త్రెంపేది).

ఇటువైపు సమీపంగా కనుపిస్తున్న దృశ్యంచూడు. ఎవరు ఈవిధంగా ఇక్కడ అమర్చారు? అంతా వావామగోచరం. ఒకేఒకకొండపై, కొంత భాగం ఇండ్లవరుసల్లా, కొంతభాగం సెలపంక ఆకృతిలో ఎలా తోటల్లాగా రాళ్ళుకూర్చబడివున్నై. ఈచిత్రకూటం భూమిని బ్రద్దలుచేసుకుని వచ్చినట్లున్నది. ఈపర్వత సమతలస్థలాల్లో, కాముకులు క్రీడాసమయాల్లో పరచుకువ్న

71,164

తామరపూలపాన్పులు, పున్నాగభూర్జ పత్రాలమీద పరచిన దుప్పటులుగా తోస్తున్నై. ఆ దంపతులగాఢాశ్లేషణాల్లో నలిగి. తెగిరాలిన దేవప్రసూన మాలికల వాసనలు ఘ్రాణతర్పణం చేస్తున్నై. మన పెద్దలపాలనలో పేరు మోసిన ఉత్తర కురుదేశాన్ని మించిన సమస్తసౌభాగ్యం ఇక్కడే వున్నది. ఈ ధరణీధరం. పరిహసితనీరాకరం. శోభాతిరస్కృతసుధాకరం. మనోహర వృక్షలతాగుల్మరచిత మాలాధరం. సమస్తశోకాపహం. సర్వవిధ సంతోషావహం.

## మందాకినీ నదినిచూపి సీతకు శ్రీరాముడు వర్ణించిచెప్పుట

ఇంకా ముందుకు పోదాంపద. ఈ నదీమతల్లి "మందాకిని" బంగరు వలె ప్రకాశించే ఇసుకతిన్నెలు ఇవిగో. నీరాకను చూసి, తానుకూడా నీ సౌందర్యాన్ని సంతరించు కుంటున్నది. వికసితపద్మ వదనంతో, ప్రకటితబిసకాండబాహువులతో, శంఖగళంతో, చక్రవాక వక్షోజంతో ఆవర్తనాభితో. మీననేత్రంతో, పులిన జఘనంతో, కచ్ఛపచర ణంతో. శైవాలవేణీ భరంతో, నిమ్నకటితో. ముక్తాప్రవాళహారంతో, జలధవళ వసనంతో, మంద తరంగవళితో, మందానిల నిశ్వసనంతో, మధుకరఝుంకారగానంతో, నీటిదరిని వరుసగావిల్చిన అంచలూ, బెగ్గురు పక్షులూ చేస్తున్న వింతధ్వనులచే మనలను ఆహ్వానిస్తుంది. మెల్లగా క్రిందికి దిగు. ఆమె, నీకిచ్చే ఆతిథ్యం నేనూ పంచుకుంటాను. సూర్యాస్తమయ వేళల చెట్లనీడలు దీర్ఘంకాగా, నదిలో ప్రతిఫలించి కుబేరుని పుష్పవాటి కలోవున్న సర్వసుమసంవాసితమైన సదస్సులాగా కానవస్తుంది. అక్కడ నీరు కొంత కలుషితమైంది. అడవిజంతువులువచ్చి దప్పి తీర్చుకుని వెళ్ళి నట్లున్నది. కాలం తప్పకుండా ఋషికాండం తమ నిత్యానుష్ఠానాలు నెరవేర్చు కునేప్రదేశం అదిగో. వారి పాదచ్ఛాయలు కనుపిస్తున్నై. దారుణతపో నిష్ఠులు ఊర్ధ్వబాహులై, తలపై అంజలి బంధంగావుంచి, సూర్యోపాసన చేస్తున్నారు. వారిశరీరమంతా విస్మయమయం. ఏఆలంబనంలేకుండానే శరీరంతో గగనసంచారం చేస్తారు. చూపుతోనే ఆధివ్యాధులు హరిస్తారు. వారి నిశ్వశ్రీయశ్చింతకు ఆనందించిన వృక్షాలు పుష్పాలరూపంగా అశ్రువులు

రాలున్నాన్నై. మైథిలీ! దమశమ సంపన్నులైన తాపసుల సంస్పర్శతో, శక్తి మంతమైన ఈజలంలో నాతోకూడి స్నానంచేయి. సిగ్గుపడక చెలికత్తెలు, నీవు జలకేళుల తేలినట్లే నాతో జలక్రీడలాడు. ఈచిత్రకూటపర్వతమే మన అయోధ్యగా, ఇందలి మృగాలే పౌరజనంగా, ఈమందాకిని సరయువుగా భావించి వర్తించు. మాతండ్రి నంతానంలో నాకులభించిన ఈమహావకాశా నికి నేనెంతో పొంగిపోతున్నాను.

"కష్టసుఖముల పాల్గొనగలుగు తమ్ముఁ
డర్ధదేహంబురీతి నన్నంటు సతియు,
వాంఛితంబు లొసంగు పర్వతహితుండు,
కలుగుటను కాంత! నాకేమివలయునింక?"

ఒక అయోధ్యేకాదు, మూడులోకాల పాలనం కట్టబెట్టినా ఇంత సంతో షం నాకు కలుగదు. ఈమందాకినీ స్నానం, మధురఫలభక్షణం, మానవతి అనురాగం, మర్మమెరిగిన తమ్ముని ఆలంబనం చాలు. ఈమహాదృష్టం జీవ కోటికి భగవంతుడు సర్వథా చేకూర్చుగాక. ఇది స్వాదువు. ఇది పూతం. ఇది తప్తం. మాంసభేదం తెలుసుకో" అని. ఇంతలో భయంకరంగా కరి ఘీం కారం వినవచ్చింది. ధరాధూళి ప్రశాంతారణ్యం అంతా దట్టంగా క్రమ్ముకుం ది. ఆధ్వానానికి అలజడిపొందిన అరణ్యసత్త్వాలు చెల్లాచెదురుగా పరుగులెత్తు తున్నై. అదికాంచి "లక్ష్మణా! ఈఅకాలతాండవం ఏమైవుంటుంది? సింహాలు చెలరేగినవా? మత్తవారణాలుబరితెగి అడవిపైపడ్డవా? వేటకుక్కలఅరుపులా? కంటిచూపు మేర కల్లోలానికి కారణం కనుపించటంలేదు. ఎవరైనా నరపతి వేటకొరకై వచ్చాదేమో చూడు" అని రాముడు చెప్పాడు.

## సౌమిత్రి భరతుడు సేనతో రావటం సీతాపతికి చెప్పుట

అన్న మాటలు ఆలించిన సౌమిత్రి ఫలపుష్పాలతో నిండిన, వున్నత మైన వృక్షాన్ని ఎక్కి ముందు తూర్పుదిక్కుగా చూచాడు. తర్వాత ఉత్తరంగా చూచాడు. వారి అంతా ఆక్రమించి సముద్రం పొంగినట్లుగా వస్తున్న ఘోరాతిఘోరమైన సైన్యాన్ని చూచాడు. ఆ సైన్యం తమవైపే

వస్తూంది. వెంటనే బిగ్గరగా "అన్నయ్యా! అపాయం దాపురించింది. అగ్నిహోత్రం ఆర్పు, కవచాన్ని ధరించు. శరశరాసనాలు గైకొను. వదినను గుహలోనికిచేర్చు" అని సౌమిత్రి అక్కడవుండే తొందరించాడు. ఆ మాటకు "అది ఎవ్వరిదో సరిగా పరిశీలించమని" రాముడన్నాడు. పరిశీలించిన లక్ష్మణుడు ఆగ్రహోదగ్రుడై, కన్నులు నిప్పుకణాలు వర్షింపగా "అన్నయ్యా! చూచాను. కన్నులు పండగాకన్నాను. అది కైకేయిపుత్రుని సైన్యం. రాజ్యాన్ని పరిగ్రహించి, ఋణశేషం, శత్రుశేషం మిగల్చ రాదన్నట్లు మనపై దండెత్తి వస్తున్నాడు. ఆతని రథంతో పుద్గతప్రకాండం వున్నది. కోవిదారకేతనం ఎగురుతూంది. నీవుకూడా చూడు, నీ సందియం పోతుంది. రౌతులు, మావతీంద్రు ఆయుధపాణులై వున్నారు. మనం కూడా సన్నద్ధులం కావాలె. పర్వతాగ్రంపైన నిల్చి యుద్ధం చేయాలో, ఇక్కడే వుండి సమరం సాగించాలో నిర్ణయించు. నిష్కారణ వైరంతో వచ్చిన భరతుడు నిశ్చయంగా నీ చేతికి చిక్కినట్లే భావించు.

వదినకూ, నీకూ నిష్ఠురమైన కష్టాలు కూర్చాడు. శాశ్వతశ్రీకి మిమ్మల్ని దూరం చేశాడు. అంతతో తృప్తిపడక దుర్భావం తోడు చేసుకున్నాడు. ఇది కూడ మంచిదే. ఆనాడు ఆరిన ఆగ్రహం ఈనాడు భయంకరంగా ప్రజ్వరిల్లింది. ససైన్యంగా కైకేయీ పుత్రుడు కాలుని ఆతిథ్యం కోసంకేలుజాస్తాడు. ఈతని వధించుట పాపం కాదు. దుశ్చరితులను, దుర్ణయులను, దుర్మార్గులను శిక్షించుట క్షత్ర ధర్మమే. ఇతడుత్యక్త సుధర్ముడు. కాన దండనానికి అర్హుడే. వంశమర్యాదకు ఎదురు నడచిన కైక, తన తనయుని మృతదేహాన్ని కౌగిలించుకుని నన్ను దూషిస్తూ ఘోరంగా ఏడ్చుగాక. అనంతరం ఆ ఏడ్పుటకు కూడా తాను మిగలకుండా సబాంధవంగా చచ్చుగాక. ఘాతధాత్రి ఆపాస్తపాపియై అలరు గాక. ఎండి పొదలపై కార్చిచ్చు పడినట్లు, అస్మన్నిర్ముక్తమైన శరకాండం శత్రు కాండాన్ని ఖండించు గాక, ప్రశాంతవాతావరణంతో, తాపసాశ్రమంగా విరాజిల్లుతున్న చిత్రకూటనగరి, సేనాశరీరనిర్గతకవోష్ణ రక్తధారాసిక్తంగా మారు గాక. తెగిపడిన, చచ్చిన మానవకళేబరాలను కాకగృధ్రసృగాలాలు కడుపునిండా మెక్కు గాక. నన్నాశ్రయించిన అస్త్రవిద్యాదేవి ఋణం

దీనితో తీర్చబడు గాక "రామం దశరథం విద్ధి" అని ఉపదేశం చేసి నన్ను పంపిన మాతృదేవి మాట ఫలించుగాక. నా రక్షణకై, నా శక్తికై, నా దీక్షకై, నిరంతర ధ్యాన సమాధి మగ్నమై అర్చిస్తున్న అర్థాంగి తగిన భర్త లభించాడని తలంచి సంతసించు గాక. అన్నా! జాగేల? ఏమాజ్ఞ? నీవు చాపధారివి కానే వలదు. వదినతో ఇక్కడ వినోదించు. రాగల కార్యం నేను చక్కబెట్టుతాను" అని, కంపిత గాత్రంతో, చలితాధరంతో కర్కశ వాక్యాలతో, ఘూర్ణిల్లుతున్న సముద్రంవలె గోచరిస్తున్న లక్ష్మణుని చూచి, పర్వతంవలె అచలుడై,

## భరతునిపై ఆగ్రహంకొన్న సౌమిత్రిని రాముడు శమింపజేయుట

"సోదరా! శాంతించు. ఎందుకింత ఆగ్రహం? ఎవరిపై ఇంత కోపం? శత్రువెవడు? ఆ వస్తున్నది తమ్ముడూ, తమ్ముని సైన్యం అనికదా నీవు చెప్పింది. ఇక విల్లెందుకు? బాణం ఎందుకు? కత్తి ఎందుకు? కవచం ఎందుకు? తనంత తానుగా వస్తున్న తమ్మునిపై అన్నలు చూపాల్సిన అనురాగం ఇదేనా? అతడు సుమతిగాని కుమతిగాడు. నావలెనే పితృవాక్యపాలనంచేసి నన్ను చూడవస్తున్న మనీషిని. మన తమ్ముణ్ణి గత జీవితుణ్ణి చేసి లోకనిందక పాత్రులమై ధరాగ్రహణం చేయవలసినంత అవసరం ఇప్పుడేమంత వచ్చింది? మహామతివైన నీకు రాజ్యభోగాలు ఇంతరుచిమంతాలా? నీవు సమాంఘమంగా భరతుని పరిమారిస్తే, నీ అన్న ఆ సంపదను ఆశపడతాడా? మృతసన్నద్ధస్వాన్ని నే నంగీకరించనని నీకు తెలియదా? అది విషలిప్త భక్ష్యం గాదా? శస్త్రం పట్టి శపథంచేస్తున్నా. నేను అర్థం కోరినా, భూమి కోరినా, రాజ్యం కోరినా, మీ కోసం, మీమేలు కోసంగాని నా కోసం కాదు. నాకై నేనే కోరితే, సప్తజలధిప్రావేష్టితమైన భూమండలంలో నా కసాధ్య మేది? ధర్మమార్గంగా వచ్చే ఇంద్రపదవైనా త్రోసివేస్తాను. సోదర ప్రేమకు ప్రతిమూర్తులైన నీవూ, భరత శత్రుఘ్నులు లేని ఏ సుఖం నే నపేక్షించను. ఆ సుఖాన్ని అగ్నిబూడిద చేయు గాక.

ఆ తమ్ముని రాకచూర్చి నీవు సరిగా ఆలోచించక, అనుమానించి ఆగ్రహాన్ని పొందావు. ఆ రాకలోని పరమార్థం నేనిలా భావిస్తున్నా. "భ్రాతృవత్సలుడైన భరతుడు సంభర్మాన్ని గుర్తించి, అయోధ్యకు రాగానే మన వనవాసం సంగతి విని మనసు చెదరి, భ్రాతలను ప్రాణాధికంగా ప్రేమించేవాడు కావటంచేత, తల్లిని దూషించి, తండ్రి అనుమతికొని నాకు రాజ్యం ఇచ్చుటకే వచ్చా"డని. అతని అంతఃకరణశుద్ధి నాకు తెలుసు. అతడు ఇక్కడికి రావటం ఎంతో యోగ్యమైన కార్యం, అటువంటి అమాయక సోదరునిపై అలక వహించటం నీకు తగదు. ఏనాడైనా నీపట్ల అవిధేయుడుగా గాని, అప్రియుడుగాగాని ప్రవర్తించాడా? అందులో నీవు నాకువలె నీ తమ్ముడు భరతునకు ప్రాణం. నిన్నవమానించి ఆ తమ్ముని బాధపెడరాదా? నన్నవమానించి నీ కాగ్రహం కల్గిస్తాడా? ఏ విధంగా చూచినా భరతుడు దోషరహితుడు, భక్తిసహితుడు. ఇక ఇటువంటి పరుషవాక్యాలు భాషించవద్దు. నే వినలేను. విని సహించలేను. అతనిని ఏమనినా నన్నట్టే. ఇదే నామీద నీకు ఒట్టు.

నేను చెప్పిన మాటలు నీకు అప్రియాలైతే, తమ్ముడు రాగానే నీ చిన్నన్నకు రాజ్యాధికారం దత్తం చేయుమని చెపుతా. తండ్రి ఎంత దుర్మార్గుడైనా కొడుకు చంపరాదా? సొంత తమ్ముని చంపే అన్నవుంటాడా? చీటికిమాటికీ, అయిన దానికీ, కానిదానికీ ఇంత భయపడతావెందుకు? నా వలెనే తమ్మునికి రాజ్యంపై మమకారం లేదు. నిజంగా నీవు కోరితే, మాటమాత్రంగా అధికారం అడనిచేత అప్పగింత పెట్టిస్తా" అని శ్రీరాముడు చెప్పాడు. లక్ష్మణుడు తన త్వరపాటుకు సిగ్గుపడ్డాడు. ధర్మస్వరూపుడైన అన్నకు తనచేత మనస్తాపం కల్గించినందుకు వ్యధలో మునిగాడు. సంబాళించుకుని, "మీకొరకై తండ్రి దశరథుడే వచ్చాడేమో" అన్న లక్ష్మణునితో. "తమ్ముడా! ఎందుకు రాకూడదు?" అన్నదోషానికి వెరచి అడవులకు పంపినా, బిడ్డలపై తండ్రికి ప్రేమ వుండదా? మనలను చూచుటకైనా రావచ్చు. మనం కష్టాలు పొందుతున్నామని భావించి, అయోధ్యకు తోడుకునిపోనైనా రావచ్చు. మనలను వదలినా, తన కోడలిపై వున్న ఆదరణకొద్దీ ఆమె కొరకైనా జనకుడు రావచ్చు. ఇందేమీ అసంభవం

కాదు. సరిగా చూడు. పవనజవాలూ, గోత్రవంతాలూ ఐన అశ్వాలు రెండూ, తండ్రి ఎక్కే "శత్రుంజయం" అనే ఏనుగూ, దండు ముందుగా వస్తున్నై. కాని, తండ్రికి రాజలక్షణమై, ప్రీతిపాత్రమైన శ్వేతచ్ఛత్రం కానరావటం లేదు. అనుమానంగా వుంది. తమ్ముడా! వామనేత్రభుజాలు రెండూ ఒక్కసారే స్పందించినై. ఏమి వార్త వినవలసివస్తుందో. నా మాట పాటించి చెట్టు దిగిరా" అని రాముడు చెప్పగా, సౌమిత్రి వృక్షావతరణం చేసి, సిగ్గుతో అన్న పాదాలకు అంజలించి దూరంగా వెళ్ళినిల్చున్నాడు. భరతుడు వుద్దామంగా వున్న తన సైన్యం రాకతో ఆశ్రమమంతా కల్లోలితమైపోతుందని ఆ ప్రదేశంలోనే ఆగనియమించాడు. ఆ వాహిని సార్థయోజనం వరకు వ్యాపించింది. చల్లచల్లగా పిల్లగాలులు వీచి ఆ యాత్రికులకు హాయి కల్పించినది. వనసుందరి విహంగ మంజులధ్వనులతో స్వాగతం పలికింది.

## శ్రీరాముని ఆశ్రమాన్ని భరతుడు పాదచారియైవెదకుట

భరతుడు సర్వ పరివారాన్ని వినీత వేషధారణం చేయవలసిందిగా ఆజ్ఞ ఇచ్చి, "తమ్ముడా! శత్రుఘ్నా! మనమందరం అన్న ఆశ్రమాన్ని వెదుకుదాం. నీవు పరివారాన్ని తీసుకుని ఒకవైపుపో. మహాబలుడు, పరమ మిత్రుడు, గుహుడు తనబలంతో ఇంకో దిక్కుగా పోతాడు. గురుదేవులూ, మాతలూ, మంత్రులూ, బంధువులూ, పౌరులు నాతో వస్తారు. మనస్సు ఆగటంలేదు. అమిత తేజులు, అసమాన మానవులు. అద్భుతబాహు విక్రములు అగ్రజులు. సతీరూపంకొన్నసతి, శమదమ సంపన్నురాలు, జనపీస్థాపీయ వదిన. చూచేదాకా నేనూరట పడలేను. అన్నిటి కంటే ముందు, ఆ సౌందర్యమూర్తిని, ఆభ్రాతృవత్సలుని, ఆదరహాసవదనుని అన్నను దర్శించి, పాదపద్మాలను స్పర్శించేదాకా నాకు శాంతిలేదు. సకల రాజనతమస్తకాలంకృతమైన అన్న చరణద్వయం, మూర్ధాన్ని సోకగామ్రొక్కిన నన్ను ఆదరించి, ఆశీర్వదించు వరకు నాకు శాంతి ఎక్కడిది? తమ్ముడూ! చిన్నన్నవలె, వదిన వలె నేనూ పుణ్యకర్మలు పూర్వజన్మలో చేసివుంటే, ఎడబాటు సహించని హృదయంతో,

ఆ సుందరముఖారవిందం. ఆ సుధామధురవాక్కులూ, ఆ అనురాగామృత వృష్టీ, వారివలె దర్శించి, ఆలించి, అనుభవించేవాణ్ణి. నందనవనమధ్యంలో సుందరధర్మవేదికపై కూర్చున్న కుబేరునిచందంగా, ఈ గిరికందర బృందంలో నిరంతరం అన్ననివాసాన్ని కల్పించుకుని పుండటానికి చిత్రకూటం ఎంత తపస్సుచేసిందో.

వ్యాఘ్రసాతీసమేతమైన ఈ వనం ఎంతధన్యమైంది? అగ్రజ పాద పద్మపరాగ సంకలితమైనదేది పరమపావనతజెందదు? "అనిచెప్పి, వారలను నియమానుసారం, పుత్తెంచి కాలినడకతో. మిగిలినవారందరు అనుసరించి రాగా. దక్షిణాభిముఖంగా పయనించి, పెద్దవిస్తీర్ణంగల చెట్టును సమీపించారు. అక్కడికి అనతిదూరంలో తాను పూర్వం కాంచిన పొగా. ఆశ్రమాన్నిచూచాడు. చుట్టుప్రక్కల అటువంటి ఆశ్రమాలేవీలేవు. భరద్వాజుల వారుచెప్పిన రెండు కొండలమధ్య మనోహరప్రదేశం ఇదే. సముద్రంలో పడిన ప్రాణిప్రాణంతో తీరంచేరి పొందిన ఆనందంపొంది ఆ దిక్కుగా వుత్సాహంతో, పెద్దపెద్ద అంగలువేస్తూ నడువసాగాడు; అనుసరించివస్తున్న వారందరూ ఆతనిసంతోషాన్ని గురుతించి, రాముడు నివసించే పర్ణశాల కనుపించిందని ఇంకా త్వరితంగా పోసాగారు. మధ్యలో కొందరు మునీశ్వరులు నీవుచూపించే రామాశ్రమం, నీ శ్రమ ఫలించుగాక. నీసాధు దీక్ష త్రిలోకపూజ్యం అవుగాక" అని దీవించి దారిచూపారు. పరమామోదంతో భరతుడు మరికొంతనడిచి అక్కడ ఆగాడు.

## భరతుడు రామాశ్రమాన్ని చూచుట

"మీరంతా ఇక్కడ ఆగండి. గుహుడు నా వెంటవుంటాడు, గురుదేవులు మాతృదేవులు కలిసిరావాలి. గురుదేవా! దయచేసి నా తల్లులను ఇక్కడకుచేర్చండి. వారు వచ్చేవరకూ ఇక్కడవుంటాను, వాహనాలపై వారిని భద్రంగా కొనిరాండి" అని వసిష్ఠులవారిని పంపాడు. భరతుని కంటె ఆత్రపడుతున్న సుమంత్రుడు శత్రుఘ్నుని సరసకుచేరాడు. తన్నెక్కడ వద్దంటాడోయన్న తహతహ ఆతనినట్లాచేసింది. అనుజాదులు వెన్నంటిరాగా నడుస్తూ భరతుడు "సోదరా నాల్గువైపుల మహాతపస్వం

పన్నులై, దీర్ఘదర్శులైన తాపసులు ఆశ్రమాలలోనుండి రక్షిస్తూంటే దిగులువిడిచి, శోకం అటవిమధ్యలో నివసించే అన్నల ఆకుటిల్లు అదుగో. దానివెనుక సాలవృక్షంచూచావా? ఆ చెట్టుకూ, పర్ణశాలకూ మధ్యవున్న ప్రదేశం పూలమొక్కలతో ఎంతో రమ్యంగావుంది. చీకటిరాత్రుల్లో వెలుతురు నిమిత్తం నెగళ్ళువేయటానికి విరిచిపేర్చిన కట్టెలగుట్ట ఎంతఎత్తువున్నదో. దానిప్రక్కగా అడవిదున్నల, మృగాల పేడపెంటికలతో చేసిన పిడకలరాశి అది. హిమవంతంలో చలిగాచుకుంటానికి కాబోలు సంతరించబడినట్లున్నది. ఈ గుర్తులు చూచావా? ఏ వేళల్లోనైనా దారితప్పకుండా ఆశ్రమానికి చేరేలాగు చెట్లకొమ్మలకు నారచీర పీలికలు వ్రేలాడగట్టబడిన్నై, మహర్షి చెప్పినగుర్తులన్నీ ఇక్కడ గోచరిస్తున్నాయి. దగ్గరలోనేమందాకినీనది వుండి వుంటుంది. ఈ చెట్టుచివర నారపీలిక ఎగురుతూంది. ఈ చెట్టు ఫలాలతో నిండివున్నది. ఇక్కడనుండే చిన్నన్నపండ్లుతీసుకుని వెళ్ళుతాడనుకుంటాను. అందుకే దీనికి గుర్తుపెట్టివుంటాడు.

మదదంతావళాలు. దంతాలతో కుమ్ములాడి కోపం తగ్గక ఘీంకరిస్తూ పోతున్నాయేకాని ఆశ్రమంలో అడుగుపెట్టలేదు. సాయంప్రాతర్హోమాలకై ఋషి శ్రేష్ఠులు ఏ అగ్నిహోత్రాలను నిరంతరం రక్షిస్తారో, ఆ యగ్ని ధూమం నిబిడంగా వ్యాపిస్తూంది. పురుషోత్తముడైన నా అన్నను పురుషోత్తముని దేవతల్లాగా నేనిప్పుడు దర్శిస్తాను. జన్మజన్మాంతరాఘపంకం క్షాళితం చేసుకుంటాను", అని తమ్మునితో వచిస్తూ. కొంతదూరం పోయి మందాకినీ నదినిగాంచి, కన్నుల నీరునిండగా మరలతమ్మునితో "శత్రుఘ్నా! ఎంతనిర్భాగ్యుణ్ణి. తండ్రి అలంకరించిన సింహాసనంపై కొలువున్న సమయంలో వింజామర వీస్తూ సేవించవలసిన అన్నను నిర్జనాటవిలో చూడాల్సిన దుర్భాగ్యంగల నేను బ్రదకటం దుర్భరంసుమా. తండ్రిమాట నెపంగా నాకై సర్వస్వం త్యాగంచేసి, నిరాడంబర మునివలె అడవుల్లోవున్న అనురాగపయోధి. రామచంద్రుడు రాజవుతాడన్నవాడు అపవాదుగా లోకంలో నిల్చిపోయింది నా పుట్టుకచేతనేకదా? నాఅన్న నన్ను ఆదరిస్తాడో, లేక నాపై ఆగ్రహిస్తాడో. ఏమైనా అన్నపాదాలపై పడి నాదోషం ఏమీ లేదని చెప్పుకుంటాను. అదే ఈ జన్మకుచాలు" అనిచెప్పి కన్నీరు తుడుచుకుని, చెట్లగుర్తుల బాట వెంటనడిచాడు. నడుస్తూ తనముందు—.

సాల, తాల, అశ్వకర్ణచ్ఛదాలతో ఆవృతమై విరివిగా వున్న దాన్ని, దర్భలవేదిచే అందమైనదాన్ని, ఇంద్రచాప వర్ణాలతో వెల్గులు జిమ్మె శత్రు కందలుందన సమర్థంబులైన ధనుస్సులుగలదాన్ని. సూర్యకాంతులకు సమానమై, చూచినమాత్రి దిగులుకొల్పే తూణీరాల్లో దీప్తవదనా వైశర సంతానం శోభింపగా, భోగులతో ప్రకాశించే భోగవతిలాగా ఒప్పుతున్న దాన్ని. బంగారం ఒరల్లో రత్నాలుదాపిన పిడులుగల ఖడ్గాలుకల్గినదాన్ని, జాతవేదసన్నిభంబైన వెలుగులవంటి వెల్గులు జిమ్మే రత్నాలు పొదిగిన ఫలకాలు కలదాన్ని, శత్రులకు సింహగహ్వరంగా అప్రధృష్యమై వరుగు దాన్ని, ప్రాగుదగ్భాగనిమ్నమై, (తూర్పు పడమరలు పల్లంగా వుంది) ప్రజ్వలద్ధుతాశనమై (మండుతున్న అగ్నికలదైన) పవిత్రమైన వేదిచే ప్రకాశించుచున్న దాన్ని, శ్రీరాముకు వసించే పర్ణశాలను సుజనహితుడు, గుణసహితుడు, వినయరతుడు, భరతుడు కరవుదీర కనుగొన్నాడు.

## భరతుడు శ్రీరాముని సందర్శించుట

అలాకాంచి భక్తిపారవశ్యంతో పరవశించిన భరతుని నయనార విందాలు ప్రఫుల్లాలై, కృష్ణాజినం వుత్తరీయంగా, కాషాయవల్కలాలు కట్టు గుడ్డలుగా, ఈశ్వరునివలె జటాజూటంధరించి, పావకునివలె పవిత్రమైన శరీరంతో, మహాబాహుడు, చతుస్సముద్ర ముద్రిత భూమండలాఖండలుడు, సింహస్కంధుడు, నిత్యధర్మాను రక్తుడు, పీనవక్షుడు, జానకీలక్ష్మణ సహితుడై, వృక్షమూల ప్రదేశంలో, దర్భసంస్తరణంమీద, శాశ్వత బ్రహ్మవై ఖరి ఆసీనుడైన శ్రీరామచంద్రుని దివ్యమంగళ విగ్రహాన్ని దర్శించినై. దర్శించి ఆనందాశ్రులు వర్షించినై. స్మృతివచ్చి భరతుడు అన్నను ఆ స్థితిలో చూడలేక, చూడకతప్పక, దోలాందోళితమానసుడై శోకిస్తూ, పరుగుపరుగున పోయి పాదాలపై పడి ఏడ్చాడు. నోటమాట రాదు. పడిలేడు. చలనంలేదు. ఆ స్థితిలోనే పెకల్చుకొని," అన్నా ! క్షమించు. వచ్చినవాడు నీ తమ్ముడు భరతుడు. ఉన్నత సింహాసనాసీనుడవై ఉర్వీతలం పాలించవలసిన నిన్ను మహాపాపులలో ప్రముఖుడనైన నేను కాననసీమలో కాంచవచ్చాను. వెలకట్టరాని దువ్వలువలుదాల్చుటకు మారుగా ఈ జింక

చర్మం, నారగుడ్డలు ధరించావా? అయోధ్యలో ఆనందించవలసిన నీవు అడవులపాలైనావా? కమ్మని నూనెలతో దువ్వి పూలు ముడిచే కేశబంధం, సంస్కారహీనమై జడలుకట్టిందా? మంచిగంధం, చందనం అలదుటచే గుబాళించే ఈ శరీరం ధూళిధూసరం అయిందా? నా సుఖానికై, అయ్యయ్యో! ఇన్నికష్టాలు కొనితెచ్చుకున్నావా? అన్నా! ఎన్నడైనా నాకిట్టి దుశ్చింతగలదా? ఈ పాపిష్టితమ్మునికోసం ఇంతత్యాగమా? ప్రజారంజకంగా పాలించి, దేవతలను, పితృదేవతలను సవనకర్మలతో సంతోషింపచేసి, పురుషార్థాలు మూడూ పూర్తిచేసికదా మనపెద్దలు నాల్గవ అర్థమైన మోక్షార్థం కొరకై వనవాసం స్వీకరించారు. ఇందేదీ లేకుండా ఈ దీక్షఏమి? ఈ స్థితిలో నిన్ను చూడలేను. ఇకనేను జీవించలేను" అని, ఆక్రందిస్తూ అన్న పాదాలపై భరతుడు "అన్నా, అన్నా!" అంటూ పడి మూర్ఛిల్లాడు. శత్రుఘ్నుడు, సుడిగాలిలోని ఒగుదాకువలె శోకంతో పరిభ్రమించి భరతుని ప్రక్కగా పడ్డాడు.

బహుకాలానికి కనుపించిన తమ్ములు దుఃఖార్తులై పాదాలవ్రాలి స్మృతి హీనులు కావటంతో రామచంద్రుడు గుండెకరిగి కన్నీటిధారాపంగా వెడలుతుండగా బలిష్ఠములైన బాహులతో ఇద్దర్నీలేపి, కన్నీళ్ళుతుడిచి కౌగిలించుకున్నాడు. గుహ సుమంత్రులు సమీపించి నమస్కరించారు. పుత్ర గురు యుక్తులైన సూర్యచంద్రుల్లాగా భరత శత్రుఘ్నులు భాసించారు. అడవిజాతివాళ్ళు ఆ కరుణరసదృశ్యాన్ని చూసి కంపించి రోదించసాగారు.

## శ్రీరాముడు భరతునికుశలం అడుగుట

ఈ హఠాత్సంఘటనకు దిగ్భ్రాంతుడై, క్షణకాలం లక్షించి, జడలుదాల్చి, నారగుడ్డలుగట్టి కల్పకాల భానుడులాగా దుర్దర్శనుడై, దీనుడై, కృశాంగుడై, శోకం మూర్తీభవించినట్లు పాదాలపైపడిన భరతుణ్ణి ఆనవాలు పట్టి, లేవనెత్తి రాముడు అనుజుని హస్తాలు రెండూఎత్తి అక్కున చేర్చుకుని, శిరం మూర్కొని, తనప్రక్క కూర్చోబెట్టుకున్నాడు. కనిష్ఠుని కూడా గౌరవంతో లాలించి రెండవప్రక్కగా ఆసీనునిచేశాడు. కొంతకాలం

ఓదార్పు మాటలతో వాళ్ళను సేదతీర్చాడు. అనంతరం భరతుణ్ణి ప్రేమ పూర్వకంగా చూస్తూ కుశలసంభాషణం కొనసాగించాడు.

"సోదరా! మిమ్మల్నిచూచి ప్రాణంలేచివచ్చింది. ఎన్నాళ్ళకు మళ్ళీ మిమ్మల్నిచూశాను. ఇంతకాలం మామ ఇంటిలోనేవున్నావా? అయోధ్యలో నేనున్నంతకాలం రానేలేదు. అయోధ్యనుంచి వచ్చావా? తండ్రి సజీవుడై వుండగా నీవిక్కడకు రావటం జరుగదేమో. నాకే ఆశ్చర్యం కలిగింది. బొత్తిగా మారిపోయినావు. ఆనవాలు పట్టలేనంత చిక్కావెందుకు? మామయ్యా, తాతయ్యా నీవు వచ్చేటప్పుడు తండ్రిగారికేమి సందేశంపంపాడు నీకేమిచెప్పారు? నా విషయం ఏమైనా ప్రస్తావనకు వచ్చిందా? అయోధ్యలో తల్లులు కుశలంగా వున్నారా? నీరాకకై ఎదురుచూస్తున్న చిన్నమ్మనుసంతోష పెట్టావా? జనకుడు ఆరోగ్యంగావుండి నీ సేవలు అందుకుంటున్నాడా? నీవిక్కడికి రావటం తండ్రికి అంగీకారమేనా? నేను అయోధ్య విడిచి వచ్చాను. నీవప్పటికి రాలేదు. తండ్రి రాజ్యవిముఖుడుగా వున్నాడు. సకాలంలో నిన్ను పిలిపించి రాజ్యాభిషేకం చేయించాడా? ప్రజారంజకంగా పాలన సాగిస్తున్నావా?

## శ్రీరాముడు కుశలప్రశ్నల మిషతో తమ్మునకు ధర్మోపదేశం చేయుట

సత్యసంగరుడూ, సర్వధర్మవిదుడూ, రాజశ్రేష్ఠుడూ, రాజసూయం, అశ్వమేధం మొదలైన అధ్వరాలను చేసిన పుణ్యపురుషుడు తండ్రి క్షేమమేనా? మన వంశానికి గురువులు, బ్రహ్మణ్యులు, మహాతపస్వి, వసిష్ఠుల వారు పూర్వంవలె పూజింపబడుతున్నారా? ఉన్నదున్నట్లుగా వదలివచ్చాను. నా మాతా, సౌమిత్రితల్లీ, ఎలా వున్నారు? నీ తల్లి పరమ పూజ్యురాలు. నా చిన్నమ్మ సుఖసంతోషాలతో వున్నదా? కులం గలవాడూ, వినయవంతుడూ, బహుశ్రుతుడూ, కార్యజ్ఞుడూ, నిర్మలుడూ, అనసూయుడూ, నీముందు అర్చింపబడుతున్నారా? అగ్నిహోత్ర సంరక్షకుడూ, సత్క్రియా దేవీ, లోపల, వెలుపల ఒక్కటిగా మెలసేవాడూ, యజ్ఞాలగూర్చి చేసినవి,

చేయవలసినవి వివరింపగల వివేకవంతుని నీ మంత్రులలో చేర్చుకున్నావా? సకాలంలో దేవ పితృదేవ పూజలు చేస్తున్నావా? మాతలను, గురువులను, వృద్ధులను, వైద్యులను, విప్రులను సత్కారములతో సంతోషపరుస్తున్నావా? మన ఆస్థానంలో అర్థశాస్త్రవేత్త, ఇష్వస్త్రసంపన్నుడు, హితమతి "సుధన్వా" చార్యుల భక్తితో సేవిస్తున్నావా? మంత్రిమండలి మాద్పు పొందలేమికదా? పొందినచో నిర్దుష్టంగా, నిర్దిష్టంగా న్యాయం చెప్పగలవారిని కూర్చుకున్నావా? అధమాధమమైన అధికారంకోసం, అర్థంకోసం నిన్నే అనుసరించే వీరుల కూర్చుకున్నావా?

ప్రభువు, ప్రజాహితంగా పాలనం చేయాలంటే, సంఖ్యాబలంకోసం మూర్ఖుల వేలసంఖ్యలో పోషించటం మాని బుద్ధిమంతుడైన ఒక్కమంత్రిని పోషిస్తే చాలు. ఆ ప్రభువు మూఢుడైనా, భీరుడైనా మంత్రి రక్షింపగలడు. రాజ్యరక్షణకు ప్రధానమైంది ప్రధానుల మంత్రాంగం. అది కార్యరూపం తాల్చేవరకూ సంరక్షించబడాలి. ఆ విధంగా అమాత్యులు చేస్తున్నారని భావించవచ్చా? ప్రజల తగవుల పరిష్కారంలో మేధావులు కల్పించుకుంటే మూర్ఖులు ఎందరున్నా న్యాయాన్ని సమర్థింపలేరు. రాజు చేసిందే న్యాయమని అంటారే కాని, అతని వాదనలోని దోషాన్ని గుర్తించలేరు. నీ కొలువులో ఉత్తములకు ఉత్తమమైన పనులూ, మధ్యములకు సామాన్యమైన పనులూ, అధములకు అధమ కృత్యాలు క్రమంగా లభిస్తున్నాయా? లేక అధములకు ఆధిక్యం, ఉత్తములకు బహిష్కారం జరుగుతున్నదా? ఎంత విశ్వాసంగలవారైనా అధికృతుల కార్యాలు ప్రభువు నిశితంగా పరికట్టాలి. ఉదాసీనంగా వుంటే ఉద్వాసనమే రావచ్చు. నీచేతి ఉగ్రదండానికి మొగమాటంతో కానీ, పొట్టకోసంగానీ భయపడ్డట్టు సిగ్గుమాలి తలలు వూపుతున్నారా? నీచమార్గాల్లో ద్రవ్యార్జనచేసి యజ్ఞాన్ని చేయ సంకల్పించిన యజమానిని యాజకులు తిరస్కరించినట్లూ, ప్రసవస్థితిలో నున్నవనితను వాంఛించే పురుష పశువును వనితలు విసర్జించినట్లూ, రాజశాసనాల్ని దుర్వినియోగం చేసి కోశాన్ని నింపి, సుఖలాలసుడైన క్షోణీపతిని ప్రజలు అసమర్థుడని గ్రహించి త్రోసివేస్తారు. నీ పాలనలో అట్టివి లేవనుకుంటాను.

నీకడ మలీమసచిత్తులు లేరు గదా? దుష్టనీతిబోధకులూ, నయవంచకులూ, ముఖస్తుతికరులూ, సద్భృత్యజనతా పరిహాసకులూ, రాజభయస్థులూ అసూయాపరులూ, చెనటులకూర్చేవారూ, అర్థతృష్ణులై అసత్యాలు పలికేవారూ, అవకాశంరాగానే అమాయకుల హింసించేవారూ, సంఘానికి చీడపురుగులు. అట్టివారిని పట్టి పల్లార్చని ప్రభువు వారిచేతనే చస్తాడు. జనపతి జాగ్రత్తగా మసలుకోవాలి. సేనాపతికి పౌరపాలనతో సంబంధం ఉండరాదు. శూరుడూ, ధృతిమంతుడూ, కులీనుడూ, దక్షుడూ, వ్యూహరచనానిపుణుడూ సమర సమయంలో స్వతంత్రుడూ అయినవాడికే "చమూపతి" అన్న నామం సార్థకమవుతుంది. అల్పకాలంలో భృత్యులకు వేతనం, బత్తెం చెల్లినట్లు చూస్తున్నావా? సకాలంలో అందని సేవకులు రాజాంతఃపురాల్లో అగ్ని రగుల్కొల్పుతారు. మన దేశంలో పుట్టి, విద్వాంసుడై, మన ధర్మకర్మ కార్యకలాపాలపై ప్రీతి కలిగి, ప్రాణార్పణంచేయ సిద్ధపడేవానినే దూతగా ఎన్నుకున్నావా? సూక్ష్మబుద్ధిగల రాజు యంత్రాంగాన్ని రెండు పక్షాలుగా చేయాలి. స్వపక్షమనీ, పరపక్షమనీ. పరపక్షంలో పద్దెనిమిది మంది తీర్థులుంటారు. మంత్రి, పురోహిత, యువరాజ, సేనాని, కారాగృహపతి మొదలైనవారు పరపక్షులు. తన పక్షంలో మొదటిముగ్గురూ తనవారు. తక్కిన పదిహేనుమందినీ చారుల నియమించి పనులు తెలుసుకోకుండ రహస్య చర్యలను ఎప్పటికప్పుడు తెలుసుకుని ప్రతిక్రియలు చేయాలి. ఓడినరాజు గర్వం వీడి ఆశ్రయిస్తే, అవమానం చేయవుకదా? లోకాయతులు విప్రులూ, పండితులు ఐనా, వారు విపరీతబుద్ధులు లోకానర్థకారులు. ప్రభువు వారిని హద్దులలో వుంచాలి.

తమ్ముడూ! నా ప్రశ్నలు అతిదీర్ఘంగా వున్నవని అనుకోకు. "ఇవి కుశల ప్రశ్నలా? హెచ్చరికలా? సందేశాలా? ఆజ్ఞలా?" అని సందేహపడకు. అన్నీ అవును, నీవు చిన్నవాడవు, సింహాసనం చిరకాలార్జిత యశస్సంపన్నం, దానిపై ఎవరున్నా ఆ గౌరవ ప్రతిష్ఠలు కాపాడాలి. అదిగాక, నేను ఎక్కడఉన్నా, మీ క్షేమం, ప్రజాక్షేమం, రాజ్యక్షేమం చూడవలసిన వాడినే కదా! నా సోదరులకు వచ్చిన అపకీర్తి నాదే కదా! అందు

కోసం ఇంత వివరంగా అడుగుతున్నాను. రాజ్యాంగ రహస్యాలు చెప్పుతున్నాను.

దృఢమైన ద్వారాలతో, గజఘోటకరథపదాతిసంకులంగా వుండేదీన్నీ, ఉత్సాహవంతులూ, జితేంద్రియులూ, ఆర్యులూ, ఆత్మకర్మరతులూ ఐన చతుర్వర్ణములవారిచే రాజిల్లేదీన్నీ, బహువిధ ప్రాసాదవీథితోనూ భవగృహాలతోనూ విలసిల్లేదీన్నీ, నిత్య లక్ష్మీప్రసన్నంగా వుండేదీన్నీ, నిరంతర ధర్మదేవతా సంచార సంగతమైనదీన్నీ అయోధ్య నా సహోదరుడు అయోధ్యగానే రక్షిస్తున్నావు కదా?

నీ పరిచారికాజనాన్ని ఆదరంతో చూస్తున్నావా? వారు రహస్యంగా చేరవేసే కొండెములు పరిహరిస్తున్నావా? నీ రహస్యాలు ఏకాంతంగా ఎవరికీ చెప్పలేదు కదా? మన రక్షణలో ముఖ్యమైంది నాగవనం. మదకరులను స్వాధీనం చేసుకునేందుకు అక్కడ అడవి ఏనుగుల పోషిస్తుంటారు. దానిని నీ దృష్టిలో ఉంచుకో.

అర్థంచే ధర్మాన్నీ, ధర్మంచేత అర్థాన్నీ రక్షిస్తూ కామంచేత రెండూ వ్యర్థం కాకుండా చూస్తున్నావా? ధర్మార్థకామసహితమైనదీ, శర్మప్రదమైనదీ, ఆయుష్కరం అయినదీ నా బోధ. తమ్ముడా! అవిఘ్నంగా ఆచరించి, మన వంశ గౌరవాన్ని అధికం చేయి. ధర్మంగా పాలించిన ధరణీపతి సునాయాసంగా స్వర్గసుఖాన్ని చూరగొంటాడు.

## దశరథుడు మరణాన్ని శ్రీరామునకు భరతుడు తెలుపుట

అన్న భాషించటం ఆపగానే, దుఃఖభారంతో విలవిలలాడిపోతూ, భరతుడు "అన్నా! నీవు ఉపదేశించిన రాజనీతి అంతా విన్నాను. ఆ స్థానంలో నేనున్నప్పుడు గదా అవసరం? పితృవాక్యపాలకుడు రాముడే కాని, భరతుడు కాడు. భరతుడు అన్న పాదసేవకుడే కాని పాలకుడు కాడు. బ్రతికివుండగా భరతుడు అగ్రజ సింహాసనం అధిష్ఠించడు. నీవే చెప్పావు గదా? ధర్మాన్ని తప్పరా"దని. మన సంప్రదాయధర్మం జ్యేష్ఠుడు ప్రభువు, కనిష్ఠులు అనుచరులు. ఆ ధర్మాన్ని నెరవేర్చటానికే

వచ్చాను. "న విష్ణుః పృథివీ పతి" అన్న ఆర్యోక్తిని అపహసించేవారే, అమానుషమైన ఈరాజ్యాధిపత్యం" అని చెపుతున్నారు. అటువంటివాన్ని ఈ అప్పుడు భరిస్తానా? ఎవరేవిధంగా భావించినా, నీసోదరుడుగా పుట్టిన నేను, నిన్నుదైవంగానే భావించాను. నిన్నుతీసుకుని పోవటానికే వచ్చాను. నేను తాతగారి గృహంలోవుండగా, సహోదరసహితంగా నీవు కానకురాగానే, నీవియోగదుఃఖంతో మనతండ్రి స్వర్గధామం చేరాడు. గురుదేవులు మంత్రుల పంపి పిలిపిస్తే అయోధ్యకు వచ్చాను. అప్పుడుగాని జరిగినసంగతులు ఎరుకపడలేదు. అపరక్రియలు అనుజునితో కలిపి పూర్తి చేసి, వెంటనే నీదర్శనానికి వచ్చాను. వెంటనే మీరు పిండోదకక్రియలు పూర్తిచేయండి. ప్రేతమునకు ప్రేమపాత్రుడైనవాడిచ్చే నివాపాలే పితృలోకంలో అక్షయ్యంగా అనుభవానికివస్తై, తండ్రి మరణసమయంలో నిన్నే స్మరిస్తూ కన్నుమూశాడట. "అవసానవేళ ఎవరిపై మనస్సు నిల్పుతాడో, ఆతడిచ్చేనీళ్ళూ, పిండాలూ ఆప్యాయంగా స్వీకరిస్తాడని" శ్రుతులు చెప్తున్నై. ముందీకార్యం ముగించండి" అని శోకవినయభారంతో క్రుంగిన హృదయం బ్రద్దలుకాగాపల్కాడు.

## తండ్రిమరణానికి శ్రీరాముడు శోకించుట

ఇంద్రుని వజ్రపాతంవంటి తండ్రి మరణవార్త వినిపించగానే, రాముడు కంద్రగొడ్డలితోనరకబడ్డ ఫలపుష్పభరిత వృక్షంలాగా మూర్ఛిల్లాడు. కూలాన్ని కూలద్రోసి, వ్యథతో నిద్రించేదంతిలాగా భూమిపై వ్రాలిన రామచంద్రుణ్ణి, సీతాలక్ష్మణ భరతశత్రుఘ్నులు, ఇనుమడించిన దుఃఖంతో వేగిరపడి చల్లనినీటితో శరీరాన్ని తడిపి, ఆకుల విసనకర్రతో విసరసాగారు. ఆ ఉపచారాలకు రాముడు తెలివితెచ్చుకుని, కన్నులవెంట అశ్రువులు ధారలు కట్టగా, భరతుణ్ణిచూచి, తమ్ముడా! అయోధ్యలో నాకింకేముంది? ప్రేమమూర్తిఅయిన తండ్రి మరణించినతర్వాత, ఆ అయోధ్యలోని రత్నసింహాసనం ఎక్కేఅర్హత ఎవరికుంది? అనంతునిభారం ఏపన్నగం మోస్తుంది? మరణసమయంలో నన్నుగూర్చిపలవి, పలవిప్రాణాలు విడిచిన జనకునకు, సంస్కారవిధులైనా తీర్చని నన్నుబోలు అయోగ్యుడు ఆయనకుపుట్టి ఏం

ప్రయోజనం సాధించినట్లు? సోదరా! సమంత్రకంగా, తమ్మునితో అగ్నిసంస్కారాది ప్రేతవిధులన్నీ తీర్చిన అదృష్టశాలివి. చివరకు నాకు ఆభాగ్యం కూడా లభ్యలేదు. దిక్కులేక ప్రజలంతా దీనులై, చింతపడుతున్న పట్టణానికి, వనవాసానంతరమైనా రావటానికి మనసురావటంలేదు. ఒకవేళవద్దామనుకున్నా. నన్ను ప్రేమించేవారూ, భాషించేవారూ, అనుసరించేవారూ తప్ప, నాలోని లోపాలనుచూచి సరిదిద్దగలవారేరి? అట్టి అక్కరగల తండ్రి అవసాన దశ పొందాడుకదా! నన్ను తొడపైనిడుకుని, తలనిమురుతూ, చెక్కిళ్ళు పుణుకుతూ, శ్రవణసుఖంగా సర్వధర్మరహస్యాలు చెప్పేవాడు. అటువంటి అనురాగ సముద్రుని వాక్యామృతం త్రావేయోగం ఈజన్మకు ఇకనాకు లేదుకదా?

జానకీ! నీకిక మామలేడుగా? నీవు నారచీరెలు ధరిస్తుంటే, సింహగర్జనంచేసి "నాకోడలు ఇవి ధరించటానికి వీలులేదు. అరణ్యవాస నియమాంతంవరకూ, నా ఇంట్లోవున్నట్టే వుండాలని" పెండ్లికూతురుకువలే పెట్టెలనిండా నగలూ, వస్త్రాలూ ఇచ్చిన కరుణాసముద్రుణ్ణి మళ్ళీ మామగారని పిలువలేవుగా. నాయనా! లక్ష్మణా! నాయనలేని వాడవైనావు. నన్ను చిన్ననాటినుంచీ సేవించినవానికి వుపకారం చేయకపోగా, తండ్రి మరణకాలంలోనైనా దగ్గరలేకుండా చేశాను. నాకై దిగులుతో నాయన మరణించాడు. ప్రజలంతా శరీరక మాత్రావశేషులుగా మిగిలారు. తల్లులు జీవచ్ఛవాలైనారు. తమ్ములుతాపసి వేషధారులైనారు. సవన సంరక్షణం, తాటకసంహారం, శివధనుర్భంగం చేశాడని ప్రజలు ప్రస్తుతించే రాముని జాతకం ఇది. పట్టుమని పదికాలాలపాటు తలిదండ్రుల సేవచేసి పితౄణం తీర్చుకోలేదు. చిన్నవారైన తమ్ముల, మరదళ్ళ కోర్కెలుతీర్చలేదు. అతిథుల, అభ్యాగతుల, అనాథుల, ఆర్తుల ఆదరించలేదు. నాఆశయాలన్నీ అడవిలోకాచిన వెన్నెలగా పేరుకూ. ప్రతిష్ఠకూరాలేదు. ఇంత నిష్ప్రయోజనమైన శరీరం ఇంకా నాకు" అని స్పృహకోల్పోయాడు. మామ మరణవార్త విన్న మైథిలి భర్తపాటుకూడ గమనింపక ఏడ్చిఏడ్చి పడిపోయింది.

అన్న వదినెలస్థితికి తమ్ములు అల్లల్లాడిపోయారు, వదినకు వుపచారం ఎలాచేయాలో తోచక ఉక్కిరిబిక్కిరైనారు. భరతుడు మెల్లిగా అన్నచెవిలో

పడిసస్థితి దాలేదని చెప్పాడు. అప్పట రాముని నిర్వాణమైన నాడిని స్పందింపచేసింది. ఎక్కడలేనిశక్తితో లేచి జానకిని దగ్గరచేర్చి. కన్నీరుదుడిచి. సాంత్వనవాక్యాలతో శోకాన్నిసమయించి, కళ్ళుపచ్చి జోతులవలేకాగా ఏడుస్తున్న లక్ష్మణుని ఓదార్చి "తమ్ముడూ! ముందు తండ్రికి వుదకప్రదానం చేయాలి. మందాకినికి పోదాంపద గారపిండీ, నారచీరే తీసుకో. ముందు నీవూ, మధ్య మీవదినా, వెనుక నేనూవుండి నదికి చేరుదాం" అని హెచ్చరించాడు. సమీపంలోవున్నవారు దుఃఖోపశమనమైనమాటలు చెపుతూ వెంటసాగారు.

దాంతుడూ, శాంతుడూ, సుస్వాంతుడూ, ధీమంతుడూ, అయిన సుమంత్రుడు కాలానుగుణమైనకథలతో, గాథలతో వారిని అనునయిస్తూ అనుసరించాడు. మనోజ్ఞములైన పండ్లతో, పూలతో శోభించే చెట్లున్నతీరంగలవాన్నీ, తీయతీయని జలంచే, తాపసులనూ, మృగాలనూ, కానచరులనూ సంతృప్తిపరిచే హృదయంగలవాన్నీ, మందాకినీనది చేరి, తండ్రిని త్రికరణశుద్ధిగా ధ్యానించి, మనస్సులో మూర్తినిల్పుకుని, "హేజనక! పితృలోకేనిత్య నివాస పిద్ధ్యర్థం తిలోదకపిండప్రదానం తుభ్యమహం సంప్రతతేనమః" అని దక్షిణదిక్కుగా తిరిగి నీళ్ళు రాముడూ, లక్ష్మణుడూ విడిచారు. తర్వాత దర్భ సంస్తరణంమీద, గారపిండీ, రేగుపిండి కలిపి పిండాలుచేసి, వాటిని మంత్రాలతో పూజించి. ఆపిండాలను చూపుతూ, "తండ్రీ! కర్మచేసేవాడికి ఏది అన్నమో, అదే ఆపురుషునిదేవతకు భుక్తి అవుతుంది. ఇప్పుడు మాకీ పదార్థాలే అన్నంకనుక, ప్రేమతోగ్రహించి భుజించు" అని కర్తవ్యక్రియలు ముగించి పర్ణశాలకు పయనించారు.

## శ్రీరాముడున్న పర్ణశాలకు పౌరులుపోవుట

జనకునికి పుత్త్రక్రియలు యథాశక్తి పూర్తిచేసి పర్ణశాలకుచేరగానే, తమ్ములను కౌగిలించుకుని "ఎంత అదృష్టహీనుణ్ణి? కడసారిగానైనా చూచే అవకాశం లేకపోయిందిగా. ఇంకెవరిని 'తండ్రీ' అని నోరార పిలుస్తాను? ఎవరిహృదయంలో అనురాగాభిషేకం పొందుతాను? అరవైవేల సంవత్సరాలు కళంకంలేని చంద్రుడులాగా దశదిశాంచలాలు యశశ్చంద్రి

కలతో వెలిగించిన ఈయనే నాతండ్రి అని ఎవరినిఇంక చూపుతాను? నన్నింతవాణ్ణి తండ్రివిగా నీవు చేశావు. నేను పుత్రుడుగా నీకు చేసిందేముంది? చివరిగడియల్లోనైనా చెంతలేకపోయాను. సవనంవలె నీశ్రాద్ధకర్మ జరపలేకపోయాను. ప్రేమతో, భక్తితో, శ్రద్ధతో సమర్పించిన పిణ్యాకం ఆదరించి అందుకుని నన్ను అనుగ్రహించు" అంటూ పెద్దపెట్టున రోదించసాగాడు. అన్నతోపాటుగా తమ్ములూ, సుమంత్రుడూ, జానకీ దురపిల్లారు. వారితో పాటు వనేచరులుకూడా వాపోయారు. ఆ, హాహారవానికి చిత్రకూటం ప్రతిధ్వనించింది. ఆ వెక్కసమైన శోకారావం దిగవిడిచి వచ్చిన పరివారం శ్రవణ రంధ్రాలను బధిరంచేసింది. "తండ్రి మరణవార్త తమ్ముడు చెప్పగా విని రామాదులు విలపిస్తున్నారు. ఇంక ఇక్కడ మనంఎందుకు? మనం కూడా అక్కడికే పోదాం" అని హెచ్చరించుకుంటూ అందరూ ఆ ధ్వని వచ్చిన దిక్కుకు ప్రవాహంవలె ప్రవహించారు. వృద్ధులు, పిన్నలు, సుకుమారులు వాహనాలపై పోగా, మిగిలినవారంతా కాలినడకతోనే పోసాగారు. ఎన్నో రోజులు కాకున్నా, ఎన్నో ఏండ్లైనట్లు ఏకారుస్తూ (వలవలమంటూ) వేగంగా పోతున్న ఆజన సమ్మర్దధ్వని జలధరగర్జలాగా వినిపించసాగింది. ఆధ్వానానికీ, ఆసైన్యం తొక్కిడికీ, తడబడుతూ, పులులూ, నక్కలూ, తోడేళ్ళు, పందులూ, పిడంగులూ, పాములూ, చెల్లాచెదురై కొంత అరడగా పారిపోవొచ్చినై. మింటిపై పక్షులూ, మంటిపై మనుష్యులూ, మృగాలూ, ఖిన్నవదనులై తమ్ముల మధ్యలోనున్న రామలక్ష్మణులను చూచి హాహాకారాలూ, కలకలారవాలూ చేసినై. కొందరు కైకేయిని దూషిస్తుంటే, కొందరు మంథరను తిట్టసాగారు. దుఃఖం తెలియని ఆ వనవాసుల దుఃఖం చూడలేక పౌరజనం దుఃఖిస్తూ, పాదాలపై పడుతూ, కౌగిలిస్తూవుంటే, దూరంగా వున్న వారంతా చెట్లెక్కి, మిట్టలెక్కి చూచి నమస్కారం చేస్తూ లోలోపల దుఃఖపడ్డారు. తనకై వచ్చిన అశేష ప్రజానీకాన్ని యథా మర్యాదలతో ఆదరించి రాముడు అందరికీ ప్రతినమస్కారం అందించాడు.

## కౌసల్యా సుమిత్రలు కొడుకుల ఏటిరేవు చూపి ఏడ్చుట

ఈ వార్త ఆలస్యంగా విన్న వసిష్ఠులవారు రాజకాంతలను వెంట పెట్టుకుని మందాకిని తీరంవెంట వస్తున్నారు. దుఃఖార్తులైనా, మర్యాదస్థులైనా అంతఃపురకాంతలు అందరూ నడిచే వస్తున్నారు. ఆ దారిలో రామలక్ష్మణుల అడుగుజాడలున్న రేవు దాట తగిలింది. దానిని కౌసల్య సుమిత్రకు చూపిస్తూ: "చెల్లెలా! ఎంత చేటుకాలం దాపురించింది? రాజ్యభ్రష్టులైవిపిన భూములకు వెళ్ళగొట్టబడ్డ మనబిడ్డలు నీళ్ళుతెచ్చుకునే రేవుచూడూ. అవిగో అవి పెద్దవాడి అడుగులు. ఇవి చిన్నవాడి అడుగులు. ఆచిన్నకోమలివి. వాళ్ళరాకపోకలతో దారికొంత నలిగివుంది. నాకొడుకుకోసం నీకొడుకు ఇక్కడనుంచే నీళ్ళుతీసుకునిపోతాడనుకుంటాను. ఇది హీనమైనవాడికి నీచ కర్మే అయినా, నీకొడుకును లోకం గర్హించదు. అన్నసేవ పరమార్థంగా భావించి తను ధనప్రాణమానాలు త్యాగంచేసినకీర్తి నీబిడ్డకేదక్కింది నాబిడ్డ భరతునిప్రార్థన మన్నిస్తే. లక్ష్మయ్యసేవకు ఫలితం దక్కుతుంది. ఇదిగో ఇక్కడచూడూ. దక్షిణాగ్రాలుగా పరచిన దర్భలపై రామయ్యపెట్టిన ఇంగుది పిణ్యాకం. (గారపిండీ రేగుపిండీ కలిపిపెట్టిన పిండాలు) దేవసమానుడూ, రాజశ్రేష్ఠుడూ, శక్రభోగ సంభావితుడూ, పరిభక్షితసాగర వేష్టితక్షముడూ, అయిన మన నాథుడు ఈ గారపిండి ఎలాతింటాడు? లోకాశ్చర్యనిర్వాహణ దక్షుడు నాపుత్రుడు దిక్కులేని నిరుపేదవలే తండ్రికి పిండప్రదానం పిండితోచేస్తే చూచిననేను ఎందుకుబ్రతికినట్లు? ఏమిసాధించినట్లు?

## కౌసల్యాదులు శ్రీరాముని చూచుట

తానేది భుజిస్తున్నాడో తనపితృదేవతలకదే ప్రీతికరమట. బిడ్డలుతినే ఆహారమే పిండాలుగాపెట్టాడు. ఇది ఎంత దుర్విపాకం? అని విలపిస్తూంటే, సవతాండ్రు అందరూ ఆమెను సాంత్వనవాక్యాలతో సమాధానపరుస్తూ పోయి, స్వర్గాన్నిపరిత్యజించి భూలోకానికివచ్చిన సురపుంగవునివలె, త్యక్తభోగుడై, నిర్వికారుడై, పర్ణశాలముందర, గుహసుమంత్రులతో, తమ్ములతో కూర్చున్న రామచంద్రుణ్ణిచూచి భోరుమని ఒక్కసారిగా ఏడ్చారు.

వెంటనే రాముడు లేచివచ్చి తల్లులపాదాలపై తలమోపి కన్నీళ్ళతో కాళ్ళు కడిగాడు. మృదువులైన హస్తాంగుళులతో రామునిపైనున్న ధూళి దులిపారు. అందరు తల్లులూ రాముని ఆలింగనభాగ్యాన్ని అనుభవించారు. అనంతరం లక్ష్మణుడూ, జానకీ అభివాదాలుచేయగా, వారినికూడా, గుండెలకుహత్తుకుని కన్నీళ్ళుతుడిచి లాలించారు. వనవాసకృశురాలూ, దీనురాలూ అయిన కోడలిని దగ్గరకుతీసుకుని కౌసల్య గద్గదకంఠంతో, తల్లీ! నిన్ను ఏమనివోదార్చాలో తెలియటంలేదు. తండ్రి జనకరాజర్షి. మామ సర్వసర్వంసహాసార్వభౌముడు. అయోధ్యాపతి. భర్త, ప్రాజాపత్యపురుషపాయసప్రసాది. కౌశికసవనరక్షకుడు, అపహృతతాటకాసుబాహుప్రాణానిలుడు, శంకరచాపఖండనయశోమండనుడు, పరశురామగర్వాంధకార భాస్కరుడు. "సర్వంనిష్ఫలితం, తద్దైవవిధినా, దైవీబలే దుర్బలే" ఈస్థితికి ఎవరిని నిందించను? ఏమని సమాధాన పడను! సుందర మందహాసకోమలంచే శోభించే నీవదనం, వాడినకలువలాగా, ఎండకు ఎండిన తామరవలే దుమ్ముతోకూడిన బంగారుకీలి, మబ్బుమింగిన చంద్రబింబంపోలికగా కనుపించి నాశరీరాన్ని సమూలంగా శోకాగ్ని కాలుస్తూంది. నేనేంచేసేది తల్లీ? కొండంత భర్తను కోల్పోయి, అమృతభాండంవంటి ఆత్మజుణ్ణి అడవులపాల్జేసి, చావురాక బ్రతికిన నిర్భాగ్యురాలిని. ఈ శుష్కదేహములో జీవమున్నంతవరకు మిమ్ముల తలచుకుంటూ, ఏడుస్తూవుండటానికే దైవం నన్నింకా నిలిపాడు." అంటూ మాటిమాటికి కోడలిని గుండెకు అదుముకుంటూ ఏడుస్తున్న తల్లిని సముదాయించి, రాముడు, ఇంద్రుడు బృహస్పతులవలె వసిష్ఠులకు నమస్కరించి వారిప్రక్కగా ఆసీనుడైనాడు. వచ్చినవారంతా "భరతుడేంపలుకుతాడో, అన్న అందుకు ఏం ప్రత్యుత్తరమిస్తాడో' వినటానికి వుత్కంఠులై వున్నారు. రాముడు సవనాగ్నులమధ్య యజ్వవలె గురుసుమంత్ర గుహసోదరతాపసులమధ్య కూర్చుని పరమాదరభావంతో భరతుణ్ణిచూస్తూ.

## రాముడు భరతునిరాకకు కారణం అడుగుట

"తమ్ముడా! తండ్రి మరణవార్త విని మనసు కలతచెందటంచేత నీవు ఇంతపరివారంతో వచ్చిన విషయం ప్రస్తావించలేదు. ఈనారచీరలేమిటి?

ఈజటాబంధం దేనికిధరించావు? తండ్రి ఇచ్చిపోయినరాజ్యం అరాజకానికి ఎందుకు అప్పగించావు? అసూర్యంపశ్యలైన తల్లుల అతిభయంకరమైన అరణ్యానికి ఎందుకుతీసుకునివచ్చావు? ఆయన మరణించినవిషయం వేగరుల చేత చెప్పి పంపవచ్చుగదా? ఇంతసాహసయాత్ర ఎందుకుచేశావో వూహించలేకుండా వున్నాను" అని అడిగాడు. అన్నయ్యా! ఇదేమిసాహసయాత్ర? విశాలవిశ్వంభర తృణప్రాయంగా విడిచి, కమనీయ రాజభోగాలను కాలదన్ని నారగుడ్డలుకట్టి, నట్టడవులకు నడచిన నీసాహసంముందు ఇది ఏపాటిది? అసలిది సాహస శబ్దానికే తగదు. యుగయుగాలుగా మానవసంఘం పాటిస్తున్న మర్యాదానుసారం నేను ప్రవర్తించాను. తండ్రిమరణవార్త సేవకుల చేత పంపటం నాకు ఔచిత్యంగా కనబడలేదు. తండ్రిఅనంతరం తండ్రి అంతటి అన్నకు, అందులో అకారణంగా అడవిలో అష్టకష్టాలుపడుతున్న అన్నకు, తనసుఖానికై సర్వం త్యాగంచేసిన అన్నకు, తమ్ముడు తండ్రి చావు కబురు పనివాడిచే పంపిస్తాడా? ఆపని భరతుడు చేయలేదు. నాకు జ్ఞానోదయమైనప్పటినుంచీ నిన్ను జనకభావంతో చూచుకున్నానేకాని సోదరభావంతో చూడలేదు. నిన్ననుసరించటం, నీవేదిక్కని భావించటం నాకర్తవ్యంగా నడుచుకున్నాను. అందుచేత, నీవులేనిసుఖం నాకెందుకు? నీవు శాకాహారివీ, జటాధారివీ కావటంచేత,నేనూ అలాగే ప్రవర్తించాను. నారగుడ్డలు నీవుతాలిస్తే, నేనూతాల్చాను. కనీసం మిమ్మల్ని చూడవలసిన అవసరం కూడా నాకులేదంటావా? తండ్రికి తిలోదకాలిచ్చి, త్యాగమూర్తుల మిమ్మల మరచి సింహాసనంఎక్కి నీతమ్ముడు చిందులుత్రొక్కటంలేదని చింతిస్తున్నావా? అంతటినీచుడు నీసోదరుడు కావటం నీకిష్టమేనా?

ఇంతవరకు మనవంశంలో కనిష్ఠుడు గద్దెఎక్కటంలేదు. అట్టిఅవసరం అప్పుడూలేదు. ఇప్పుడూలేదు. నాతోపాటు నిన్నుచూపి, నాకోరిక తీర్చుమని నిన్ను అర్థించటానికికే తల్లులూ, ప్రజలూ వచ్చారు కైరవబాంధవుని చేతశారదరాత్రివలె ఈధారణి నిన్నుపొంది సనాథగా, జనహర్షదాయకంగా వెలుగుతుంది. నేనునీకు తమ్ముణ్ణి, శిష్యుణ్ణి, దాసుణ్ణి, పైగా నీపాలిత పౌరుడను. మంత్రులతో, మాతలతో, మహర్షులతోపౌరులతోకూడి నిన్ను వేడుకుంటున్నాను. పిత్ర్యంఅయిన రాజ్యాన్ని జ్యేష్ఠధర్మాన్ని పాటించి చేపట్టి మా మనస్సుల రంజింపచేయ."

## నీవు నిర్దోషివని భరతునితో శ్రీరాముడు చెప్పుట

అని విన్నవించి పాదాక్రాంతుడై పడివున్న భరతుణ్ణి లేవదీసి, అతిక్రమించి వస్తున్న ఆదరాభిమానాలతో ఆశ్లేషించి కూర్చుండబెట్టుకుని, స్మిత పతి చిత్తశుద్ధితో విను. సత్కులీనుడవు. సాత్వికుడవు. మహాతేజుడవు. అలఘువ్రతరతుడవు. దాశరథివి. నాకు తమ్ముడవు. రాజ్యంకోసం ఇంత పాపానికి ఎలా ఒడిగట్టుతావు? ఈ విషమపర్యవసానంలో నీకు ఈషణ్మాత్రం ప్రమేయంలేదు. నీవు బాల్యచాపల్యంచేత తల్లిని దూషించివుంటావు. పిన్నతల్లి లజ్జాభరంతో క్రుంగిపోయి నన్ను చూడలేకుండా వున్నది. ఆమె ఏమీ విపరీతకార్యం చేయలేదు. తండ్రినిగూర్చి లోకంతోపాటు నీవుకూడ, కామమోహితుడై, "కాని కార్యంచేశా" డని తలంచివుంటావు. వీరిద్దరూ లోకసామాన్యధర్మాన్నే చేశారు. రక్తమాంస భూయిష్ఠమైన శరీరంతాల్చిన ప్రతిజీవీ దారపుత్రాదులపట్ల వ్యామోహపడటం ఎంతో నైజం. అమమకారాలే లేకపోతే రెండువిభిన్న ప్రవృత్తులు, రెండుభిన్నశరీరాలు కలిసి జీవించటం కష్టం. శిశువు వృద్ధిపొందేవరకు తల్లిచేసే కార్యాలు తరువాతచేస్తుందా? అలాగే పరస్పరానుకూల్యంకోసం భార్యాభర్తలుకొన్నిపనులు చేస్తారు. ఎంత ధర్మాత్ములైనా ఇంకొప్రాణికి నష్టంకలిగించకుండా జీవితంగడపలేరు. వైవిధ్యంగల ప్రకృతిగుణాలను పరిశీలించే ఋషులు వేదాన్నిదర్శించి, అవి ఎలా వుంటే అనుకూలించి అభివృద్ధిచెందుతవో, ఏవిధంగావుంటే నాశనకారకులౌతవో, శాస్త్రరూపంగా వెల్లడించి మానవజాతి మనుగడకు మార్గదర్శకులైనారు. వారిసిద్ధాంతాలు ప్రకృతిసహజ పరివర్తనానుశీలమైనవి. తద్వ్యతిరేకంగా మానవమేధతో విశ్లేషించి చేసే సిద్ధాంతాలు, తాత్కాలికాలూ, బలవంతాలూ, కృత్రిమాలు.

కాబట్టి ఆపద్ధర్మపాలనం అవశ్యకర్తవ్యం. ఆమె తల్లులలో వయసుచేతచిన్నది. రాజ్యతంత్ర మర్మజ్ఞురాలు, రణశాస్త్రప్రవీణ, కావటంచేత. తన పుత్రుడు రాజుకావాలని వాంఛించటం తప్పులేదు. అందుకు సంప్రదాయంగా వస్తున్న ఆచారాలూ పెద్దలువిధించిన ధర్మాలూ అడ్డుగావున్నై. అందుకనే తనకు భర్త ఇచ్చిన వరాలద్వారా చింతిత కార్యసిద్ధి పొందింది. కనుక, ధర్మదూరం కాలేదామెకోరిక. అందుచే ఆమెను దూషించటందోషం. ఇక తండ్రి

విషయం. ఇందులో. బాహ్యధర్మాలేకాక సూక్ష్మధర్మాలూ అంతర్ధర్మాలుఎన్నో ఉన్నై. కాబట్టినీవు అవశ్యం తలిదండ్రులకోరిక తీర్చటం న్యాయం. వెంటనే నీవు మన నగరానికిపోయి పట్టాభిషిక్తుడవై ప్రజలను పాలించు" అని చెప్పి ముగించాడు.

## భరతుడు శ్రీరాముని రాజ్యం గ్రహించమని వేడుట

ఆరాత్రి గడిచింది. తెల్లవారగానే అందరూ నిత్యకృత్యాలు పూర్తిచేసి కొలువుదీరారు. కాని, ఒక్కడూ మాట్లాడలేదు. సభ నిశ్శబ్దంగా వుంది. ఆ నిశ్శబ్దాన్ని భంగిస్తూ, భరతుడులేచి సభకూ, అన్నలకూ నమస్కారం చేసి, అగ్రజా! నీఆజ్ఞానంతరం నేను మాట్లాడుతున్నందుకు మన్నించు. ధర్మాధర్మాలవిషయం తర్వాత మనవిచేస్తాను. ముందునే చేసినపని చెపుతాను. అయోధ్యకురాగానే నాతల్లివల్లనే జరిగినసంగతులు తెలుసుకుని నేనొక ఘోర ప్రతిజ్ఞచేశాను. నీసంతోషానికి నేను రాజ్యపరిగ్రహణం చేయననీ, బ్రతికివుండగా ఆసింహాసనం అధిష్ఠించననీ. తండ్రి కర్మాంతరాలుకాగానే ఈరాజ్యం నీకు వప్పగించడానికే వచ్చాను. వానాకాలంలో వరదలకు గట్లు కోసుకుంటూ వచ్చే ప్రవాహంలాగా నీ రాజ్యాధికారాన్ని నిలవరించటం నాకేకాదు, నాకవాసులకు కూడా సాధ్యంకాదు. తురగం నడకనుఖరం, గరుడుని గమనాన్ని కాకం అనుసరించలేనట్లు, నీచేపాలించబడదగిన విశ్వంభరనావంటి అల్పునిచే సహింపబడటం ఎన్నటికీ పొసగదు. నావంటివాడు పరతంత్రుడుగా బ్రతుకవలసిందేకాని, ఇతరులభారాన్ని ఎన్నడూ మోయలేడు. భవితవ్యంతెలిసినవాడు మంచిఫలవృక్షబీజాన్ని నాటిపోతే, అతనివంశంలోని మరుగుజ్జువాడు నీళ్ళుపోసిపెంచి ఫలకాలంరాగానే కొమ్మ వంగక, చెట్టుఎక్కలేక వ్యసనపడినట్లవుతుంది నీసొత్తును నేనాశించటం. ఈరాజ్యంనీది. నీవుపాలకుడవు. మేం పాలితులం. నిన్నర్థించి, నిన్ను రాజుగా చేసి కొనిపోవటానికి వచ్చిన ఈ అశేషపౌరజనం ఆనందించేలాగ అంగీకరించు. అంతేకాని నేనుపాలించను. ఆమాటలు వినను" అనిఆగాడు.

## భరతునకు శ్రీరాముడు ఉపశమనవాక్యాలు చెప్పుట

వెంటనే రాముడులేచి తమ్ముణ్ణి ఆలింగనంచేసుకుని కూర్చుండబెట్టుకుని "తమ్ముడవుగదా. ఇంతకంటే తక్కువగా ఎలామాట్లాడగలవు? ఎంతో సంతోషించాను. మనపై దైవంవుంది "దైవాధీనం జగత్సర్వం" అని పెద్దలు చెప్పారంటే పుబుసుపోకకుకాదు. మానవబుద్ధి ఎంతవూహించినా, కొంతవరకు మాత్రమే. అంతా ఊహించటానికి అధికారంలేదు. ఎందుకంటే. తనలో ఏముందో తనకేతెలియదు. తనచేతజరిగిన కృతక సృష్టినిచూచి తానెంతో గొప్పవాడినని పొంగేమానవుడు, తనలో ఇంత సృష్టికి హేతువైన పదార్థం ఏముందో తెలుసుకోలేక చస్తున్నాడు. ఇందుకు మనగాథే ఉదాహరణగా చెప్పొచ్చు. తండ్రికి వంశాచారంతెలుసు. పినతల్లికి మాటఇచ్చినసంగతి మరువలేదు. అందుకుభిన్నంగా నాకురాజ్యాభిషేకానికి ప్రయత్నించేశాడు. ఆయన సర్వాధికారి కనుక అడ్డంఎవరూ కన్పించలేదు. ఇక పినతల్లి నాకీఅవకాశం కలిగినందుకు ఎంతో సంతోషించింది. చెప్పిన చెలికత్తెకు బహుమానంకూడా ఇచ్చింది. అందుకు వ్యతిరేకబోధ చేసింది దాసి. దాసిమాటలకు ఆమె ఇంతమార్పు ఎలాపొందింది? నలుగురు బిడ్డలున్నా అవసానసమయంలో ఒక్కడైనా ఎందుకులేడు? సర్వాధికారి అయిన తండ్రి నాకు పట్టాభిషేకం చేయలేకపోయాడు. అపవాదుధరించిన పినతల్లి నీకురాజ్యం ఇవ్వలేకపోయింది, దీనికిహేతువు ఏమిచెప్పగలం? నేను నీరాకగూర్చి వూహించలేదు. పౌరజనానుసారంగా నీవు పాలనాధికారం పరిగ్రహించావనుకున్నాను. అందుకు భిన్నంగా జరిగింది. ముందేమిజరుగుతుందో చెప్పలేని మానవులు, ప్రకృతి అనుగ్రహించినప్పుడల్లా తమప్రజ్ఞగాభావించి వ్యతిరేకం కాగానే ఏడుస్తారు. దైవమానుష శక్తుల్లో దైవంగొప్పది. అది తెలియనిది. తెలియరానిది. కాబట్టి. నీవు రాజ్యం గ్రహించటం సర్వథా సమంజసం. మానవనిర్ణయాలుపై తెలియరాని దైవప్రభావం ఎప్పుడూ వుంటుంది. ధనాలు నిధనాంతాలు. వృద్ధిమదర్థాలు విలయాంతాలు. జననాలు మరణాంతాలు. సంయోగాలు వియోగాంతాలు. పండినపండు పడిపోవటం సహజమైనట్లే మానవులకు చావుకూడా. గడిచినరాత్రి సముద్రంలోకలిసిననీళ్ళు

తిరిగిరావు. పవలూ, రాత్రీరూపంగా ప్రాణుల ఆయుః పరిమాణం కాలం ఆహరిస్తూంది. గ్రీష్మకాలంలో సూర్యుడు కిరణాలతో నీటినిగ్రహించినట్లు.

కాబట్టి, ముందు ఏడ్వవలసింది తనకోసం, తరువాత పరులకోసం. "స్వయంతీర్త్వా, పరాంతారయతి" "ఇదిగో సూర్యోదయమైంది. అదుగో సూర్యాస్తమయమైంది" అని లోకం సంతోషిస్తూందేకాని, ఆరూపంగా ఆయువుతరిగిపోతూందని తలంచదు. అలాగే ఋతుక్రమాన్ని చూచి పొంగే మానవులు తమజీవితం అనే ఆదాయంలో అవివ్యయంగా మారుతున్నవని గుర్తించి నడుస్తున్నారా? రెండు వేరువేరునదులు కొనివచ్చిన కట్టెలు ఆ నదులు, కలిసేచోటకలిసి మళ్ళీ విడిపోయినచోట విడిపోయినట్లే, పెళ్ళాం బంధువులూ. బిడ్డలూ కలుస్తారు. పోతారు. దీనికి విచారంఎందుకు? "ఇదం కాష్ఠ మిదంకాష్ఠ నదీతీరే చసంగమం, సంయోగాశ్చ, వియోగాశ్చకాతత్ర తరివేదనం?" బ్రతికివున్నబంధువులంతా ఒకచోట కలసివుండలేకపోతుంటే. చచ్చేవాళ్ళను చావకుండా ఆపటం సాధ్యమవుతుందా! ముందుకుపోతున్న ప్రవాహం, వెనక్కురానట్లు. వయస్సుకూడా తిరిగిరాదు; కనుక అనుభవించదగిన వయస్సులోనే అన్నీ అనుభవించాకే - ఈ ధర్మం యుగ యుగాలుగా భారతదేశంలో నడుస్తూంది. సర్వసౌఖ్యాలు అనుభవించి శాశ్వతమైన పితృలోక స్థానాన్ని పొందిన తండ్రికై విలపించక, ఆయన నీ కిచ్చిన రాజ్యాన్ని అంగీకరించి, తండ్రి కీర్తిని ద్విగుణీకృత ధవళమం చేయి." అని కర్తవ్యం బోధించాడు.

## రామునితో భరతుడు తన దుఃఖకారణం తెలుపుట

అన్నబోధ అంతావిని భరతుడు తృప్తిపడని మనస్సుతో, వినయ గంభీరార్థ బోధకంగా చెప్పసాగాడు, "నేను దుఃఖపడుతున్న మాటనిజం. అది కేవలం తండ్రి మరణాన్ని కూర్చేకాదు. నిన్ను కూర్చికూడ. వయో వృద్ధులు కాలధర్మం చెందటం. తాత్కాలికంగా విలపించటం, తరువాత తమ ధర్మాలను తాము నిర్వర్తించుకోటం లోకంలో పరిపాటిగ జరుగు తున్నదే. కనుక నేనూ దుఃఖించి కర్మాంతరాలు నిర్వర్తించాను. అప్పుడూ ఇప్పుడూ పొందుతున్న దుఃఖం ఆరందీ. తీరందీ. ఏమిటంటే. అటుతండ్రీ,

ఇటువీపూ, నాకు ఇష్టంలేని పనిచేయమంటం అర్థంకాకపోవటంచేతా, నాకు సర్వవిధాలా పితృస్థానీయుడవైన నీవు, అధికారార్హతకల నీవు, అతిలోక సద్గుణసంపన్నుడవైన నీవు అడవుల్లోవుంచే నేను సుఖించటం ఎలాగో బోధపడకుండటంవల్లా, అంతా దైవాధీనమని తెలిసినతర్వాత, ఈ సుఖ దుఃఖాలూ, ధర్మాధర్మాలూ, ఈ పాపపుణ్యాలూ, ఈ సత్యాసత్యాలూ, ఎందు కొరకు చెప్పబడ్డాయి? ఎవరికొరకు చెప్పబడ్డాయి!" అనే శంకలకు సరిఅయిన సమాధానాలు నాకురావా. ధర్మాలెప్పుడూ పరులకు చెప్పటానికే గాని చేయ టానికి కాదేమో యనేభావం. లోకానుభవంవల్ల బలం కావటం కారణంగా పొందుతున్నాను.

నేమలేని సమయంలో తలిదండ్రులు లోకగర్హితమైన పాపకార్యం చేస్తే ఆపాపానికి నేను గురికావటం ఏమిటి అనీ, నా మాటను ఎవరు మన్నించకపోయినా, అందరు చెప్పేమాటలు మాత్రం నేను ఆచరించవలసిన అవసరం ఏమున్నదనీ " ఎవరివారే యమునాతీరే అయితే, " నా అభి ప్రాయాన్నిఅణచుకోవటం ఎందుకనీ. సుఖానికీ దుఃఖానికి మనస్సే కారణం అయినప్పుడు ఆ మనస్సు నడిపిస్తే నడుస్తున్నాం అని సరిపెట్టుకుంటే సరిపో తుందేమోయనీ, ఎటూ తేలక ఏడుస్తున్నా. ఈ ఏడుపంతా నాకోసమే. నా ధర్మాన్ని నేను కాపాడుకొనటంకోసం విన్ను అర్థిస్తున్నాను.

## భరతుడు శ్రీరామునితో వనవాసం ధర్మంకాదని చెప్పుట

క్షత్రియులకు ప్రజాక్షేమం చేయటం దేనివల్ల లభిస్తుందో ఆ పట్టాభి షేకాన్ని నీకు చేయటానికే వచ్చాను. అనుభవించేవయస్సులో అన్నీ అనుభవించాలన్న నీ మాట ప్రకారం ఇప్పుడు నీవే అనుభవించాలి. నేను కాదు, ఆశ్రమాలలో గృహస్థాశ్రమం గొప్పది కనుక ఆ ధర్మాన్ని సుక్షత్రి యుడవైన నీవు పరిత్యజించి వయోధర్మంమీరిన వారు పొందే వానప్రస్థం నీవు స్వీకరించటం ధర్మంకాదు. పెద్దవాడవు నీ వుండగా, పిన్నవాణ్ణి నేను పాలించటం అన్యాయం, అధర్మం. నేను గురువుల శుశ్రూషలో ధర్మా ధర్మాలలోని సూక్ష్మం తెలుసుకున్నాను. నా లక్ష్యభూతమైన నీతో వాదు

లాడటం నా కిష్టంలేదు! తండ్రిమాటపై నీ కెంత గౌరవంవున్నదో, వంశాచారంపై నా కంత నమ్మకంవుంది, నీవు రాజ్యాన్ని గ్రహించకపోతే, నీ తమ్ముడుగా సేవచేస్తూ నీతోపాటు అడవిలోనే వుంటాను. కాని అయోధ్యకు మాత్రం పోను." అని! ఆ మాటలకు వేదమాత ఆనందాశ్రులు రాలుస్తూ." రాముడే ధీరుడనుకుంటే, భరతుడు ధీరాతిధీరుడై నాడనిహర్షం చెందింది. తల్లులు ఇద్దరి సంభాషణయివిని "తమకేదిగతి" అని తలుస్తూ మూర్ఛిల్లారు, అక్కడివారేకాక ఆకాశవాసులు కూడా భరతుని నిగ్రహానికీ, త్యాగానికీ ముగ్ధులైనారు. మహర్షులూ, మంత్రులూ వుభయుల మాటలు వింటున్నారు.

## రాముడు నీవేరాజగుట ధర్మంఅని భరతునితో చెప్పుట

భరతుని ధర్మబద్ధమైన మాటలకు రాముడు మిక్కిలి సంతోషించాడు. వంశగౌరవంపైనా, తనపైనావున్న అచంచల విశ్వాసాన్ని ఎంతో ప్రశంసించాడు. "నాయనా! భరతా! చిన్నవాడవైనా శ్లాఘనీయంగా పల్కావు. పినతల్లి గర్భశుక్తి ముక్తాఫలంగా పుట్టిననీకే ఈ నిగ్రహం చెల్లు. నేను నిన్ను శాసించలేను. నీ ఇష్టాన్ని భంగించి నీవు శోకిస్తుంటే, నేను ధర్మపాలనంచేసి తద్వారావచ్చే కీర్తికి తహతహ పడటం లేదు. నేను జనకుని చివరికోర్కెలు రెండూ తీర్చటం పుత్రులమైన మనకు కనీసధర్మంగా భావించాను. అదిగాక. మీ అమ్మను పరిణయమాడే సందర్భంలో మీతాతకు "మనుమడికి రాజ్యం ఇస్తా"నని శుల్కం ఇచ్చాడు. అంతేకాక. దేవదానవ యుద్ధంలో మన తండ్రిప్రాణం కాపాడిన వేళప్రీతిగా మరిరెండు వరాలు పినతల్లికిచ్చాడు. అందులో ఒకటి నీవు రాజుకావటం. రెండోది నేను వనవాసంచేయటం. నా విధి నేను నిర్వర్తిస్తున్నాను. నీవుకూడా నీ ధర్మం నెరవేరిస్తే పితృదేవుడు పూర్ణకాముడవుతాడు. మనం ధర్మాధర్మాల పేరెత్తక పుత్రధర్మం మాత్రమే పాటిద్దాం. " గయు"డనే పూజ్యుడుపి తరులు వినేట్లు గయలో అన్నమాటలు చెపుతావిను. "పున్నామ్నో నరకత్రాయతీ తిపుత్రః" అని. పున్నామనరకంలో పడకుండ రక్షించేవాడే పుత్రుడు. ఆ ప్రేత హృదయంలో ఏది వాంఛగా నిల్చిపోతుందో అది తీరేవరకు ఆ ప్రేతం

నరకకూపంలో పడిపోతుంది. అందుకనే నిన్ను తండ్రికోరిన ప్రకారం చేయమని చెప్పింది. మానవులు బహుసంతానం కావలెనని కోరుకోటం మూర్ఖం చేశారు. తిండిపెట్టి పోషించలేకారాదు. కలిగిన సంతానమంతా బ్రతుకుతారని నమ్మకంలేదు. బ్రతికినవారంతా మంచివారవుతారనీ, పైతృక కార్యాలు విధిగాచేస్తారనీ చెప్పలేము. అందులో ఏ ఒకడైనా గుణవంతుడై గయాశ్రాద్ధంచేసి పుత్తమలోకాన్ని చేకూర్చగలడేమోయన్న ఆశతోనే. అంతే కాని అతి సంసారులై అల్లాడిపోవాలనే తలంపుతోకాదు. భారతీయులకు ఇహపరాలు రెండింటిలో పరం ముఖ్యం ఇహం దానిసాధనం. పురుషార్థాలైన ధర్మార్థకామ మోక్షాలలో, ధర్మమోక్షాలు ముఖ్యం. అర్థకామాలు సాధనం. అంటే, ధర్మనిర్వహణ కొరకే అర్థం. ధర్మంలేని పశుపక్షి మృగనరులకు స్వభావాలకు అర్థంతో పనేముంది? అధికారంతో పనేముంది? మోక్షం నిమిత్తమే కామం. అంటే, మోక్షం అనగా విముక్తి. కామం అంటే కోరిక. లౌకిక తాపత్రయాలనుండి విశ్రాంతి పొందవలెననే కోరిక ప్రధానంగా శరీరధర్మాలను ఆచరించటం. మామిడిచెట్టును ఎందుకువేస్తాం? పండ్లకోసంగదా? గ్రీష్మంలో ఎండబాధకు దానినీడను ఆశ్రయిస్తాం. అలాగ, సృష్టికార్యమైన స్త్రీపుంసంయోగాది కార్యాలు ఆత్మానంద ప్రసాదక సమర్థమైన విశ్రాంతి నిమిత్తంగా జరగాలి. ఇది సృష్టిరహస్యం. ప్రతి వాక్యం. కాబట్టి పుత్రుడవుగా రాజ్యాన్ని గ్రహించు" అని బుజ్జగించి చెప్పాడు.

ఇంకా ఇలా చెప్పాడు. "రాజులలో శ్రేష్ఠులంతా ఈ విధంగా తలుస్తారు. కనుక మనం ఆ దారినే నడుద్దాం. నీవు నన్ను రాజును చేయుటకే నిశ్చయించావు కనుక, నేను ఈ మృగలోకానికి రాజునవుతాను. ఇప్పుడే దండకారణ్యానికి పోతాను. నీవు పాడుంచు రాజువై పాలించు. నీకు. అలంకార ప్రాయమేకాక, ఆరోహణ పరంపరలచే తల వేడెక్కకుండ శ్వేతచ్ఛత్రం సాయపడుతుంది. నాకు. సూర్యకిరణాలవేడితో శరీరం సంతప్తం కాకుండా వృక్షచ్ఛాయ తోడ్పడుతుంది. నాకు లక్ష్మణుడు అన్ని విధాలతోడుగా వుంటాడు, నీకు శత్రుఘ్నుడు అక్కడ ఆ విధంగానే

వుంటాడు. మనం నలుగురు సోదరులం కలిపి జనకుణ్ణి సత్యమూర్తిగా చేద్దాం. నా కోసమైనా నా మాటవిను" అని.

## జాబాలి రామునికి నాస్తిక వాక్యాలు చెప్పుట

రామభరతుల సంభాషణ వింటున్న మహర్షులూ, మునులూ ఎవరిది ధర్మ వాదమో నిర్ణయించలేక దీర్ఘంగా ఆలోచనలో మునిగారు. సదస్సంతా సాలభంజిక చందమైంది. ఆ సమయంలో జాబాలి మహర్షి లేచి విలచి సభవంక చూశాడు. బలీయమైన భరతుని వాదం, సమయోచిత వచన రచనాధురీణుడైన రాముని వాక్సమ్మోహనాస్త్రానికి మోహితమై కనుపించింది. గడ్డం సవరించుకున్నాడు. వామహస్తంతో కమండలం, చంకలో దర్భాసనం, పాము కుబుసంవంటి యజ్ఞోప వీతం ధరించి అపర మహేశ్వరుడులాగా " రామచంద్రా ! " అని ముందు సంబోధించి, " మీ సంభాషణలమధ్య ప్రవేశించిన నా దుడుకుతనాన్ని మన్నించు " అని వినయంచూపి, మేమంతా భరతుని ఆహ్వానంపై వచ్చిన వాళ్ళంకనుక, అతని క్షేమం విచారించటం మా కర్తవ్యంగా నేను భావించాను కనుక, ధర్మా ధర్మ చర్చ కొంత నడిచింది కనుక, కొన్ని సందేహాత్మకంగానే నిల్చి పోయినవి కనుక, ఆ నిల్చినవి భయ వినయాలతో బాధపడుతున్న భరతునికి సంబంధించినవే కనుక, అతను కోరక పోయినా, లోక శ్రేయస్సు కోసం నేను నీతో ప్రసంగిస్తున్నాను " అని తన ప్రవేశానికి కారణం చూపి ప్రారంభించాడు.

" నీవు భరతునకు తండ్రి ఎలా రాజ్యం సంక్రమింప చేశాడో చెప్పావు. అంతవరకు అది నిజమే. అందరూ ఎరిగినదే. కాని, సామాన్యంగా జరిగిన విషయాలకు నీవు ధర్మాన్ని తెచ్చి అంటగట్టావు. కనుక విమర్శించ వలసి వచ్చింది. దశరథునికి కైకేయి మూడవ భార్య. ఇద్దరుండగా మూడో పెళ్ళి చేసుకోవటంలో ఆయన వుద్దేశం కామ ప్రాధాన్యంగా జరిగిందా ? వంశాభివృద్ధి కోసం జరిగిందా ? అనేది, విచారణీయాంశం. మొదటిదాని ప్రకారం ఆలోచిస్తే, వృద్ధులకు, వయస్సుగల వారిమీదా, అందులో సౌందర్య వతులమీదా ఆసక్తి హెచ్చు

కనుక, ఆరెండూ వున్నవాడు ఏదో లోభ బుద్ధితో తప్పు వివాహం చేసుకోడు కనుక, ఆలోభాన్ని ఎరగాచూపి పెండ్లి చేసుకున్నాడని తెలుతుంది. అంటే తృతీయ వివాహం సంతా నేచ్ఛతో కాదని సారాంశం వచ్చింది. ఇక్కడ ధర్మానికి తావెక్కడ ? ఈ కార్యం వల్ల ఆయన వ్యసనలంపటుడే కాక, తక్కిన భార్యల దుఃఖ భాగినులుగా చేసిన పాపానికి కూడా పాత్రుడైనాడు. ఇక రెండవ పక్షం ఆలోచిస్తే, ఎంతకాలానికీ ఆమె కూడా సంతానవతి కాలేదు. కలిగి నప్పుడు గదా రాజ్యం ఇచ్చేది. ఇక ఈయన పురుష ధర్మం పుత్రుల సంపాదించి పెట్టలేదు. దైవాన్ని అర్థించాడు. యజ్ఞం చేశాడు. పాయసంపొందాడు. అన్న మాటప్రకారం ఆ పాయసం కైకకు ఇవ్వక ముగ్గురికీ ఇచ్చాడు. ఆ ఇవ్వటంలో కూడా సమానంగా ఇవ్వలేదు. అప్పుడుకూడ దక్షిణ నాయక ధర్మం తగుల బెట్టాడు. నలుగురు బిడ్డలకు తండ్రైనాడు.

ఈ పుట్టిన వారిలో పెద్దవాడవు నీవు. ఆయన భార్యలకు పుట్టుక కారణంగా తండ్రి అయినాడేకాని, న్యాయంగా దైవం తండ్రి. ఆ తండ్రి దృష్టిలో రాజ్యంనీది. మరో పక్షం విచారిద్దాం. పుత్రులు కలిగారు. పెద్దవాడైనాడు. ఆయనకు అవసాన సమయం ఆసన్నమైంది. భరతుణ్ణి పిలిపించి రాజ్యాభిషేకం చేయకుండా రామునికెందుకు పట్టం కట్టే ప్రయత్నం చేశాడు ? చేసినవాడు మాటకోసం రాజ్యం ఇచ్చినా అడవికి నిన్ను పంపవలసిన అవసరం ఏమివచ్చింది ? దీనికి ఇష్టపడ మంటే పితృవాక్య పాలనకై అడవులకే వచ్చిన నీవు అంగీకరింపవా ? ఇక్కడ కూడా ధర్మానికి తావులేదు. "తమ్ముని ఆస్తి దానంగా గ్రహిస్తానా ?" అనే భావంకూడా అక్కర్లేదు. అతడు ముందు గ్రహిస్తేనే కదా దానికి యజమాని అవుతాడు. ఆ గ్రహించటం విన్నే గ్రహించమన్నాడు ; కనుక సరాసరి తండ్రి అధికారం తనయులలో జ్యేష్ఠుడవైన నీకే వస్తుంది ?

ఇక వేదాంత పరంగా చూస్తే, ప్రకృతి గుణాన్ని అనుసరించి, ఇనుము అయస్కాంతం వద్దకు చేరినట్లు, స్త్రీ, పురుషరూప భేదంగా జీవులు కలుస్తాయి. ఆ కలయికలో శుక్లశోణిత సంయోగం జరిగి పున

స్పృష్టి వస్తుంది. అదే జీవకోటి లక్షణం. జీవి ఒంటరిగా పుట్టి ఒంటరిగా వెళ్తుంది. ఎందుకో చేస్తారు. ఏమో అవుతుంది. అంత మాత్రమే అయిన దానికి, ఇహమనీ, పరమనీ, ధర్మమనీ, అధర్మమనీ ఇంకా ఏవేవో పేరు పెట్టి ఎందుకో జగద్వంచన చేస్తారు. చచ్చినవానికి శ్రాద్ధమేమిటి? ఆ చచ్చిన దేహం అగ్నిలో కాల్చబడి బూడిదె అవుతుంది. ఆ బూడిదె కొడుకుపెట్టే పిండాన్ని తింటుందా? ఇంట్లో సర్వ పదార్థాలుచేసి "దారినపోయే దానయ్యా! ఇదంతా నీ కోసమే చేశాం. నీకే అర్పిస్తున్నాం" అంటూ ఇక్కడ వీరు పొట్టలుచ్చి తింటుంటే ఆ దానయ్య కడుపునిండి గర్రున త్రేన్పురాదా? ఎక్కడి తండ్రీ? ఎక్కడి తల్లీ? ఎక్కడి బంధువులు? అంతానాస్తి. బ్రదికినంత కాలం సుఖించాలి. అందుకోసం ఆరాటపడాలి. ప్రజా క్షేమం కోసం పాలనాధి కారం చేపట్టుమని భరతునకు చెప్పావు కదా? అతడు ఇష్టపడటం లేదు. ఇద్దరూ పట్టుదలతో రాజ్యాన్ని వదిలివేస్తే అరాజకం వస్తుంది. కాబట్టి నీవు ధర్మాసనాన్ని అధిష్ఠించటం నాకు సమ్మతం" అని ముగించాడు. జాబాలి మాటలు రామ చంద్రుని మేధపైక శాఘాతంగా వర్తించాయి. వెంటనే దెబ్బతిన్న బెబ్బులిలాగా లేచాడు. లేచిన రాముణ్ణిచూసి, "ఏమి వుపద్రవం వస్తుందో" యనే భీతితో సదస్యులంతా కంపించి పోతున్నారు. ఏటికి ఎదురీతలాగా వున్న మహర్షి వాదానికి రాముడు ఏం సమాధానం ఇస్తాడో వూహకందక వుక్కిరిబిక్కిరి అవుతున్నారు.

## శ్రీరామునిచే జాబాలి నాస్తిక వాద ఖండనం

సజల జలధర నిర్ఘోషాన్ని అపహసిస్తూ, "మహర్షులకు అభివాదం. మీరు తీసుకున్న చొరవకూ, ఖండన రూపంగా ఉపదేశం ఇచ్చిన మీ ఉపన్యాసానికీ మనఃపూర్వకంగా అభినందనం తెలుపు కుంటున్నాను. ఇక మీ వాదానికి ప్రత్యుత్తరం ఇస్తున్నాను. ఇది నా కోసం కాక, అజ్ఞాన లోకాన్ని జ్ఞానవంతం చేయటానికీ, దురహంకారుల గర్వ భంజనానికీ, అల్పబుద్ధుల, అసూయా పరుల మేధలోని లోపం

సవరించటానికీ, శ్రుతిధర్మాన్ని ప్రతిష్ఠించటానికీ. ఎన్ని వంకలతో నడిచినా పాము పుట్టలోకి సమగతిలో పోయినట్లు, ఎన్ని విపరీత ధర్మాలు తలెత్తినా, సనాతనమైన, సత్యమైన ఆర్ష ధర్మంలోనే అంతం అవుతవని శంఖారావం చేసి చెప్పటానికీ, మీ వాదం మూర్ఖుల వద్దకే కాని, బుద్ధిమంతుల వద్దకు, చెడిపోయిన ద్రవ్యంవలె చెలామణికి రాదని చెప్పటానికే పూనుకున్నా.

మీ ఖండనోపన్యాసాన్ని మూడు భాగాలు చేసి ఖండిస్తున్నాను. మొదటిది. నా తండ్రిని భ్రష్టకాముకుడుగా చేయటానికి చెప్పింది. రెండోది ధర్మనిరూపణం. మూడోది విపరీత వేదాంత దృష్టి.

నేను నా తమ్మునికి రాజ్యం ఎలా సంక్రమించిందో చెప్పటం, మీరు నా తండ్రి కాముకుడుగా ప్రవర్తించాడని చెప్పటం రెండూ లోక సామాన్య ధర్మాలే. అంతవరకు అందరూ ఒప్పుకుంటారు. నేనూ ఒప్పుకుంటాను. ఇందులో ధర్మానికి తావెక్కడ ? అన్న మీ ప్రశ్న మిగిలింది. ధర్మం అంటే మీ భావనలో ఏమనుకున్నారు ? కొందరు సత్యాన్వేషకులు చర్చించి, భిన్న ప్రకృతులూ, భిన్న ప్రవృత్తులూ కలిసి మనుగడ సాగించటానికి ప్రకృతి గుణానికి వ్యతిరేకం కాకుండా కొన్ని నియమ నిబంధనలు శ్రుతి ప్రమాణంగా నిర్ణయించారు. ఆధర్మాలు మారేవి కొన్నీ, మారనివి కొన్నీ, ఆపద్ధర్మాలు కొన్నీ. దేశకాల పాత్రాదుల ననుసరించిన ధర్మాలు మారేవి. రాజ్యార్హత పెద్దకుమారునికే అని చెప్పబడిన ధర్మం, మూగవాడైనా, అంగహీనుడైనా, కుష్ఠరోగి అయినా విశేషం చెప్పబడింది కనుక మారుతుంది. నీటిగమనం పల్లానికీ, అగ్నిగమనం పూర్ధ్వానికీ, అన్న ధర్మం ఎప్పుడూ మారదు. " పర పురుష స్పర్శ తరుణులకు తగదు " అన్న ధర్మం, దిక్కులేని ఒక కాంత అగ్నిహోత్ర మధ్యంలో చిక్కినప్పుడు వెలికి తీసుకుని రావటం జరుగుతుంది. ఆ పురుష స్పర్శ ధర్మ దూషితంకాక ఆపద్ధర్మమవుతుంది. ఎప్పుడూ నిర్ణయం కార్య పర్యవసానం మీద జరుగుతుంది. ఇక నా తండ్రి నా పినతల్లి వివాహవేళ ఇచ్చిన రాజ్యశుల్కం ఆమెకే బిడ్డలు కల్గారనీ, మొదటి భార్యలకు కల్గరనీ విశ్వసించి ఇచ్చింది. తరువాత దైవానుగ్రహం వల్ల కలిగిన సర్గలో నేనే పెద్దవాడను. అందుకే

రాజ్యం నాకీయ దలచాడు. అందుకు తన భార్య అంగీకరిస్తుందన్న విశ్వాసంకారణం. ఆమె తనకు పుత్రుడు కలిగాడు కనుక పూర్వం నాకిచ్చిన వాగ్దానం చెల్లించమన్నది, అందుకు తండ్రి అంగీకరించాడు. ఈ కార్యంలో పర్యవసానం అన్నమాట చొప్పున ఆచరించటం. కనుక ఆయన సత్యవ్రతుడు. సంతానం కోరేవాడు కాముక భావంతో కాక సన్యాసి భావంతో కోరురాదా స్వామీ ? ఆయన చేసిన రెండు నిర్ణయాల్లో నాకు సంబంధించింతనవరకు నేనాచరిస్తాను. భరతునికి సంబంధించినది అతని ఇష్టంమీద ఆధారపడివుంది. ఈ ధర్మాలు బహుముఖీనంగా వున్నై. అన్నీ కలిపి నాల్గు పద్ధతుల్లో ఇమిడివున్నై. "బాహ్యం, అభ్యంతరం, వ్యక్తం, అవ్యక్తం," అని. జ్ఞానివున్నాడు. అతని నడవడిక మన నడకలాగే వుంటుంది. మనం మరణించిన వారికోసం ఏడుస్తాం. చావంటే భయపడుతాం. ఆతడు ఏడువడు. భయపడడు. మన దృష్టిలో అతను సామాన్యుడు. సూక్ష్మదర్శనుల దృష్టిలో అతడు జ్ఞాని.

వ్యక్తధర్మం మానవులది, అవ్యక్తధర్మం మానవేతర జీవకోటిది. మానవులకై నిర్ణయించిన వ్యక్త ధర్మంలో మార్పులూ, చేర్పులూ, కూర్పులూ, వస్తుంటై. కాని, అవి అభ్యంతర ధర్మానికి ఆటంకంకారాదు. మూలచ్ఛేదమైన రీతిగా సంస్కరిస్తే. ఆశించిన ఫలానికి వ్యతిరేకఫలం వస్తుంది. క్రమంగా జగత్పరిణామం కుంటుబడి నశించి పోతుంది. అభ్యంతర ధర్మంలో ఒకజీవి ఒకచోట నుండి ఇంకొక చోటికి పోవటానికి స్పందనం ( కదలిక ) అనే గుణం వుంది. దాన్ని ఆధారం అంటారు. ఆ స్పందన గుణానికి ఆధేయంగా కాళ్ళు బాహ్యంగా ఏర్పడినై. ఆ కాళ్ళకు గమనం అనే బాహ్య ధర్మం నిర్ణయించ బడింది. అంటే ; బాహ్యాభ్యంతర ధర్మాలు రెండూ ప్రకృతి సిద్ధమైనవే కనుక పరస్పర వైషమ్యంలేక చేసిన సిద్ధాంతఫలం సిద్ధించింది. ఈ ధర్మాన్ని విధిగా చెప్పినప్పుడు " జీవి కాళ్ళతో మాత్రమే నడవాలి " అని అంటుంది. దానిని అల్పబుద్ధులు చేతులతో గాని, తలతోగానీ ఎందుకు నడవరాదని సంస్కరిస్తే. ఏమవుతుందో చెప్పండి. కాబట్టి నా తండ్రి చేసినపని, బాహ్య ధర్మాలు కొన్నింటికి వ్యతిరేకమైనా, అభ్యంతర ధర్మమైన సత్యం

పర్యవసానంగా ముగిసింది. అందువల్ల ఆయన సత్యవ్రతుడు. నా భావనలో ఇది మొదటిభాగం. రెండవ భాగం ప్రస్తావిస్తాను.

## శ్రీరాముడు జాబాలికి సత్యం అవశ్యం అనుష్ఠేయం అని చెప్పుట

మీ వాదనలో "సుఖం" అనే మాట ధర్మస్థానంలో నిల్చింది. ఏ కార్యమైనా వ్యక్తి సుఖంకోసం చేయవచ్చు. విధినిషేధాలకు తావు లేదు. ఇది నేను ముందు చెప్పిన నాల్గుధర్మాలలో అవ్యక్తధర్మంలో అంతర్గతమై వుంది. ఎలాగంటే: మానవేతర ప్రాణిసంచయానికి నియమనిషేధాలు లేవు. ధర్మాధర్మాలూ, పాపపుణ్యాలూ మొదలైన మానవ ధర్మాలను అవి పాటించటంలేదు. కాబట్టి ఆవిధంగా మానవుడు సంచరిస్తే సరిపోతుందని మీ భావం. శాంతం పాపమ్. అవి స్వాభావికంగా బ్రతికి పోగలవేగాని, ఇండ్లు కట్టలేవు. రాజ్యాలు పాలించలేవు. అతీంద్రియశక్తులు ప్రదర్శింపలేవు. తిమ్మిని బమ్మినీ, బమ్మిని తిమ్మినీ చేయలేవు. ఇవన్నీ చేయగల మానవుడు వాటిలాగా ఎలా సంచరిస్తాడూ? తనలోని శక్తి ఆ విధంగా చేయనిస్తుందా? నిప్పు ఇంకోదాన్ని కాలుస్తుంది. ఏదీ లేకపోతే తన్ను తానే కాల్చుకుని బూడిద అవుతుంది. అలాగా జరిగితే మానవ జాతే సృష్టిలో మాయమైపోతుంది. కనుక, మానవులకు అవ్యక్త ధర్మం నిషేధం. వ్యక్తధర్మం విధి అవుతుంది. మీరు మా పూర్వులకాలం నుంచి గురుదేవులతోపాటు పూజ్యస్థానంలో వుండి పూజింపబడుతున్నారు. మా తండ్రి చేసిన తప్పును మీరు గర్హించలేదు, ఖండించలేదు. కారణం ఇప్పటివరకు అప్పుడు లోకశ్రేయస్సు కాలేకపోయిందా? ఎవరైనా పరోక్ష విషయంపై అపవాదులు గుప్పించి, అపకర్షింపగలరుగాని, ఆ విషయమే ప్రత్యక్షంగా జరుగుతున్నప్పుడు జీవన్మృతులవలె ఉంటారు. అందుకు వేరే హేతువేమి లేదు. ఏది ఎలా పోయినా తాను బ్రతికితే చాలుననే స్వార్థభావమే.

మానవునిలో నేను ముందు చెప్పిన నాల్గు ధర్మాలూ ఉన్నై. అందు చేత మానవేతరమైన అవ్యక్తంకంటే. మానవ నిర్దిష్టమైన వ్యక్తం శ్రేష్ఠం.

దానికన్న బాహ్యం. దానికంటే అభ్యంతరం, శ్రేష్ఠతరం, శ్రేష్ఠతమం. కాబట్టి నా తండ్రి శ్రేష్ఠతమమైన అభ్యంతర ధర్మం సత్యాన్ని పాలించాడు కనుక సత్యవ్రతుడు.

"నా విష్ణుః పృథివీపతిః" అని ఎందుకన్నారు? రాజధర్మమంతా సత్యాన్ని ఆశ్రయించి ఉంది. మీరు చెప్పినట్లు రాజే సంచరిస్తే ప్రజలే మసలుతారు? రాజుకంటే ఆరాచలు అధికంగా చదువుతారు. సత్యం వేరు, ధర్మం వేరు. ధర్మం మారినట్లు సత్యం మారదు. ధర్మంభావనా బలం గలది. సత్యం సహజమైంది. ఈ సర్వసృష్టి సత్యంపై ఆధారపడి ఉంది. మన కోరికలపై దివారాత్రులూ, ఋతువత్సరాలూ, సుఖదుఃఖాలూ రావు. ఈ అనంతకోటి గోళాలు మనచే కల్పింపబడలేదు. మనకు తెలిసిన గోళాన్నే మనం శాసించలేం. క్రమబద్ధంగా ఈ అనంత విశ్వగోళాలు పరిభ్రమిస్తున్నవంటే మూలం, సత్యం. ఆ సత్యం నా తండ్రికి ఇష్టం. ఆయన ఇష్టం నా కిష్టం. అనంత జ్ఞానాన్ని ప్రసాదించిన వేదమాత సత్యం వరకు చెప్పి, "ఆ సత్యం వాక్కాయ కర్మలకు తెలియబడదు. అనుభవమాత్రంగా అగుతుం"దని చెప్పింది. ఆ అనుభవాన్ని పొందిన మహర్షులు చెప్పిన ధర్మాలే ధర్మాలు. స్వార్థచింతనులై చేసే శాసనాలూ, సిద్ధాంతాలూ ప్రమోదానికి బదులు ప్రమాదం కల్గిస్తై.

ఇక మిగిలింది మూడవ భాగమైన విపరీత వేదాంత ఖండనం. ఎవరికివారే యని చెప్పిన మీరు ఎవరికి చెప్పినట్లు? ఎందుకు చెప్పినట్లు? "నేనూ, నీవూ, వాడూ" అనే భేదం ఉన్నంతవరకు మీ సిద్ధాంతం "అవ్యాప్తి, అతివ్యాప్తి" అనే రెండు దోషాలకు గురి అవుతుంది. ఆ భేదం నశిస్తే "జ్ఞాని" అవుతాడని సనాతనధర్మం చెప్పింది. జ్ఞానికి చెప్పవలసిందీ లేదు. చేయవలసిందీ లేదు. ఇక మీ సిద్ధాంతం ఎక్కడ నిలుస్తుంది? దేనికి అన్వయిస్తుంది? జ్ఞానాజ్ఞాన మధ్యస్థమైన మానవకోటి సంక్షేమ సంరక్షణోపాయంకోసమే, తల్లిబిడ్డకు స్తన్యంవలె శ్రుతిరూపంగా సత్యం మహర్షులద్వారా ఆవిష్కారం పొందింది. లోకవ్యవహారంలో ఒకరితో ఒకరు చెప్పటం అంటే వినిమయరూపంగా జరిగే పని. అలా కాక, ఒక ఉన్నతుడు "అది తప్పు, ఇది ఒప్పు" అని చెప్పడంలో

సామాన్య వినిమయ ధర్మం పోయి అధికారిక ధర్మం అవతరిస్తుంది. అప్పుడే ఘర్షణ వస్తుంది. ఆ చెప్పే ఉన్నతుడు వినేవాళ్ళను మీరు మూఢవిశ్వాసం కలవా"రని మాటిమాటికీ అంటుంటాడు. ఎందుకంటే "యద్భావంతద్భవతి" తాను మూఢుడే కనుక ఆసంగతి అతనికితెలియదు. ఒకవేళ చెప్పినా వినడు. హేతువుందే చెప్పానుగా. అదే పెద్ద మూర్ఖుడని.

ఇక్కడ తర్కదృష్టి వదలి సమన్వయ దృష్టితో చూద్దాం. అంతకు ముందున్న లోకధర్మం అతనికి గిట్టుబాటు కాలేదు. తనకు గిట్టుబాటైన ధర్మం లోకంలో రావాలి. ఆతని ధర్మం నోటిలోనే ఉంది. ఇంకా బయటికి రాలేదు. ఖండించే ధర్మం సనాతనమైంది. బలం గలది. సహేతుక ధర్మాన్ని హేతుబలం లేనివానితో ఎదిరించాలి కనుక, దానిని దూషించటం, మూఢవిశ్వాసం అనే ముసుగు కప్పటం చేయక తప్పదు. దీన్నే గతిలేని కప్పదాటువాదమంటారు. ఒకడు, పరంపరగా వచ్చినదాన్ని మంచిగా భావిస్తే, అది మూఢవిశ్వాసం అయింది. తాను చెప్పబోయేది ఆచరణలో లేదు. అనుభవానికి అందలేదు. అది కేవలం చెప్పేవాడి మనోగతం. మరి మనోగతంపై ఉన్నది ఉన్నట్లు జరుగుతుందని అనుకోటం మూఢవిశ్వాసం కాక ఏమవుతుంది? అసలు మీది వాదమూ కాదు. సిద్ధాంతానికీ కాదు. ఒక మహర్షి "ఋణం కృత్వా, ఘృతం పీత్వా" అని ఒక ధర్మం సంఘానికి చెప్పాడు. "అప్పుచేసి, నేయి తాగూ" అని కదా అర్థం. అప్పు చేస్తాడూ, ఆహార సుఖం అనుభవిస్తాడూ, బాగానే ఉంది. అప్పు అంటే: తనకు లేందీ, మరొకనికి ఉందీ. అయిన పదార్థం తాను గ్రహించి మరల దాన్ని అతని కీయటం అనికదా లోకవ్యవహారం. అసలు అది తనకెందుకు లేదూ, వాని కెందుకు ఉందీ" అని ఏమైనా ఆలోచించాడా? అందుకు కారణం చెప్పాడా? ఇప్పటికే చాలా మాట్లాడాను.

## శ్రీరాముడు కర్మం అవశ్య కర్తవ్యం అని జాబాలికి చెప్పుట

నా తండ్రి సత్యవ్రతపాలకుడు. నా పినతల్లి ధర్మమార్గైకరత. వీరిద్దరి చేతలు లోకవ్యవహార విరుద్ధంగా పరిణమించినవంటే: దీనికి

కారణం దైవం. దైవనిష్ఠంగా జరిగింది ధర్మంకాక అధర్మం ఎప్పుడూ కాదు. కనుక ఆ ధర్మాన్నే నేను నమ్ముతాను, ఆచరిస్తాను. ఆ సత్యాన్నే పాలిస్తాను. స్వామీ! ఇంకొక్క విషయం మనవి చేస్తాను. నా సమక్షంలో మీరింతవరకు ప్రవచిస్తున్నారంటే: జీవుల ధర్మ కర్మ మర్మ వెలింగిచేసిన సనాతన సిద్ధాంతమే కారణం. ఆ సిద్ధాంతాలన్నీ, దయా, దాక్షిణ్యం, శమం, దమం, విచక్షణా మొదలైన దివ్య గుణాలు ఆధారంగాచేయబడినై. మీ ధర్మాన్ని పాటిస్తే, మీరు జీవించి వుండటం నా మనస్సుకు సంకటం కల్పిస్తున్నది. అందులో నేను క్షత్రియుణ్ణి, ధనుర్ధారిని. ధర్మవ్యతిరేకత సహించనివాణ్ణి. బలవంతుణ్ణి. కాబట్టి మిమ్మల్ని సంహరించాలి, కాని నేను చేయలేను. చేయను కూడ. ఎందుకంటే: నేను క్షత్రియుడనేకాని. రాజును గాను. రాజు దండం చేతలేక రక్షించరాదని మీరు ఆక్షేపించిన ధర్మాలే అడ్డు నిల్చినై. పౌరులుగా మనకున్న హక్కుల ప్రకారం మీ ఇష్టం మీరు వెల్లడించవచ్చు. నా ఇష్టం నేను చెప్పవచ్చు. విన్నలోకం వాని కిష్టమైన దానిని అవి పోవచ్చు. ఏది ఏమైనా మీరు బ్రహ్మణ్యులు. నాకు పూజ్యులు. సత్యవాక్కు కత్తివాదం వంటిది. ఏదైనా పొరపాటున పరుషవాక్యం వస్తే క్షమించండని మనవి చేస్తున్నాను. మీరేదైనా ఖండన ఖండనానికి ఉపపత్తులు చూపిస్తే చూపించవచ్చు. "వజ్రం వజ్రేణ భిద్యతే" అన్నారు. వ్యక్తికి ఇంత అనుమానంలేదు సన్మానం లేదు" అని ముగించి కూర్చున్నాడు. ముసురు వెలిసినట్లయింది. అంధకారంలో మెరుపు మెరిసినట్లైంది. బరువెక్కిన అందరి హృదయాలూ తేలికపడినై. ఏదో అనిర్వాచ్యమైన ఆనందం అందరూ అనుభవించారు. సభ్యులంతా వికసితముఖు లయ్యారు.

## జాబాలి శ్రీముని క్షమించుమని వేడుట

"రామచంద్రా! నన్ను అపార్థంచేసికోకు. మీ తన్నాదమ్ముల మధ్య వచ్చిన ధర్మసంకటం పరిహరించాలనే సంకల్పంతో అప్రమాణవాదాన్ని చేయసాహసించాను. ఆర్షధర్మం పరమపవిత్రమైనది. "సర్వం ఖల్విదం బ్రహ్మ" అన్నట్లు, "ఆకాశాత్ పతితంతోయం, యథాగచ్ఛతి సాగరం"

అన్నట్లు అన్ని మతాలూ, అన్ని వాదాలూ సనాతన భారతీయ ధర్మంలోనే సమపిస్తై. సమన్వయం పొందుతవి. దర్శనవస్తు తరంగరూపాలు. సనాతన ధర్మం సాగరం. మేం ఋషులమైనా, సిద్ధాంతకర్తలమైనా లోకంచేత ఆచరింప చేయలేం. అది రాజు చేయవలసినపని. రాజు ననుసరించి ప్రజలు నడుస్తారు కనుక, మా శక్తితో. రాజు ధర్మపాలకుడైతే రక్షిస్తాం. అధర్మపాలకుడైతే శిక్షిస్తాం. అందువల్లనే మా ధర్మం. సామాన్య అసామాన్యధర్మాలకు సంఘర్షణ వచ్చినప్పుడు రాజు ఏవైపు మొగ్గుతాడో పరీక్షిస్తాం. అందుకే మార్గంతరంగా నిన్ను పరీక్షించాను. మేం ఏ ధర్మాలు విశ్వశ్రేయస్కరాలు కారకాలవుతవని నమ్మి చెప్పామో ఆ ధర్మాలే నీనోటివెంట రావటానికే ఘర్షించాను. అందుకే నిన్ను రాజ్యాన్ని గ్రహించమని చెప్పాను. భరతుడు అన్నివిధాలా యోగ్యుడే. అయినా ధర్మం తెలిసినవాడు కనుక రాజ్యార్హత నీకేకాని తనకులేదని నిశ్చయించుకున్నాడు. మనసా, వాచా, కర్మణా నిన్ను నమ్మినవాడు కనుక అతనిపట్ల అనుగ్రహం చూపించమని చెప్పటానికే, నేనీ వితండవాదం చేశాను. కాని, నేను నాస్తికుడను కాను. బుద్ధుడను కాను. నీసత్యధర్మనిష్ఠను నేనేకాదు. యీసభేకాదు మహర్షులేకాదు దేవతలే తృప్తులైనారు. నేనుచేసిన సాహసవాదం కాలోచితమైందేకాని. కాంక్షించాను. కనుక నన్ను క్షమించు. నేను క్షమించమని కోరింది నిన్నుకాక నీలోవున్న సత్యస్వరూపాన్ని. "నీచరిత్ర జగత్త్రయంలో అజరామరంగా వెలుగాక" అని ఆశీర్వదిస్తున్నాను. అని వాదం అనంతరం ఉపసంహారవాక్యాలు చెప్పి జనస్థానంలో జాబాలి ఆసీనుడయ్యాడు.

## వసిష్ఠుడు జ్యేష్ఠుడే రాజ్యార్హతకలవాడని పూర్వరాజుల చరిత్ర రామునికి తెల్పుట

అనంతరం వసిష్ఠులవారు కల్పించుకుని "వత్సా! జాబాలి నామమాత్రఋషి కాడు. ఆగతానాగతాలు తెలిసిన బ్రహ్మర్షి, ఆయనచెప్పినది సత్యం. ధర్మ సంకటవేళ ఆపద్ధర్మం అనుసరించవచ్చు. సంకటపరిహారం జరగ్గానే యథాతథ ధర్మం జరిగితీరాలి. ఆభావంతో చెప్పాడేకాని అన్యథాభావం ఆయనకులేదు. ఇప్పుడు నేనుగూడ కొన్నిమాటలు చెప్పదలిచాను. విని నీఇష్టానుసారం

నీవుచేయి. ఈజగదుత్పత్తి అంతా ఏకార్ణవం (జలమయం)గా వున్నప్పుడు ముందు భూమిపుట్టింది. పిదప స్వయంభువు బ్రహ్మదేవతాగణంతో పుట్టాడు. నీటిలో భూమి మునిగిపోతుంటే ఆదివిష్ణువు పుత్రునికోరికపై వరాహరూపంతో వుద్ధరించి నిల్పాడు. అనంతరం బ్రహ్మజగత్తును సృష్టించాడు. తర్వాత తనసంకల్పంతో "మరీచి" ని సృజించాడు. ఆయనకు "కశ్యపుడు" కలిగాడు. ఆయనకు "భాస్కరుడూ," భాస్కరునికి "ఘనుడూ," ఘనునికి "మనువూ," క్రమంగా వారివారికి పుత్రులుగా, "ఇక్ష్వాకు," కుక్షీ, "వికుక్షీ" "బాణుడూ" బాణునక "సరణ్యుడూ," "పృథుడూ", "త్రిశంకుడూ," "ధుంధుమారుడూ," "యువనాశ్వుడూ," "మాంధాతా," "సంధి" "ధ్రువసంధీ," "భరతుడూ," "అసితుడూ," "సగరుడూ," "అసమంజుడూ," "అంశుమంతుడూ," "దిలీపుడూ," "భగీరథుడూ," "కకుత్స్థుడూ," "రఘువూ," "కల్మాషపాదుడూ," "శంఖణుడూ," "సుదర్శనుడూ," "అగ్నివర్ణుడూ," "శీఘ్రగుడూ," "మరుడూ," "ప్రశుశ్రుకుడూ," "అంబరీషుడూ," "నహుషుడూ," "నాభాగుడూ," "అజుడూ," "దశరథేశ్వరుడూ" కలిగారు. ఇంతదీర్ఘమైన సూర్యవంశములో ఇంతవరకు జ్యేష్ఠుడే రాజ్యపాలనకు వచ్చాడు. ఆ ఆచారం నీవుకూడా పాటించు. అయోధ్య సార్వభౌమాధికారంకలది. ఇక్కడ ఆచారం తప్పితే సామంతమండలంగానీ, స్వతంత్రరాజమండలంగానీ, మర్యాదలను మన్నించవు. దురాచారం ఆచారంగా మారే దోషం వస్తుంది ఆదోషం నీకు సంక్రమించటం యుక్తం కాదు. నీవు మచ్చలేని చంద్రుడవు. క్షారంలేని సముద్రుడవు. కంటకనిమ్నోన్నత దోషంలేని పర్వతమవు. సత్యపాలనకోసం, ధర్మరక్షణకోసం నీవు ఆచారాన్ని భంగించినా దోషంలేదు. పైగా అది ఆనందకరమైన ఆదర్శం అవుతుంది. మరిలోకం అంతా అలాచేయలేదు. "రాముడుచేయగా, మేంఎందుకుచేయకూడదు?" అని అంటుంది. "అతనివంటి స్థితిలో మీరూ చేయండి" అంటే వినదు. ఆచారంపేరుతో దేవతార్చనమూని, పిల్లిని అన్నం తినేవేళ కట్టివేసిన కథవలె మూలకారణం నశించి, అవసర, అభిరుచులే ఆచారంగావస్తై. రామా! నేను నీకుచెప్పవలసిన పనిలేదు, అన్నిధర్మాలూ నీకుఅవగతాలే.

## వసిష్ఠుడు శ్రీరాముని రాజ్యం గ్రహించమని చెప్పుట

భరతుడు ప్రార్థించినా, జాబాలి సంభాషించినా, నేనుచెప్పినా, నీప్రజలు ఇంకెవరుచెప్పినా, నిన్ను "నియమపాలనం భంగించి నిర్ణయానికిపొమ్మ"ని కోరరాదు. తమ్ముడు భరతుడు చెప్పేది ధర్మంకాదనలేం. భరతుని పక్షంలో బలంవుంది. కనిష్ఠుడు కావటం ఒకటి. ఆచారం రెండు. సార్వభౌమాధికారం మూడు. నీతండ్రి కోర్కె చెల్లించింది నీపినతల్లి. అవినాల్గు. ఆ యనసమక్షంలో నీవనవాసం అంగీకరింపబడింది. భరతుని పట్టాభిషేకం భరతుని సమక్షంలో అంగీకరింపబడలేదు. అది బలవతి. అడుగకుండా ఇచ్చే దానాన్ని గ్రహించటం, మానటం, ఆవ్యక్తిఇష్టానిష్టాలపై ఆధారపడి వుంటుంది కనుక అదిఅప. కోసలరాజ్యానికివలెనే, రాజగృహరాజ్యాన్నికూడా తనఏలుబడిలోకి తీసుకోవాలని నీతండ్రికోరిక. అందుకు యుద్ధంకాక అనుబంధం సాధనం. యుధాజిత్తు అనంతరం శ్రీవుడవ వారసులెవరూలేరు. అందుకే దావపరిచి ఇంటికి భరతుని పంపటంలోని ఆంతర్యం ఇదివిడు. పురుషునకు ముగ్గురుగురువులు. తల్లీ. తండ్రీ, గురువూ. జన్మంఇచ్చి తల్లీ తండ్రీ. జ్ఞానం ప్రసాదించిన గురువూ. గురువునైనాను. ఈముగ్గురిలో, జ్ఞానదానంచేసిన ఆచార్యుడు శ్రేష్ఠుడని ఆర్షధర్మంచెప్పింది. నేను నీకేకాక నీ గురువునకు గురువును. మంత్రులలో నాస్థానం నీకుతెలుసు. నేనామోదించని మంత్రం ఆచరణకురాదు. ఆదర్శప్రాయమైన అయోధ్యపీఠం అరాజకం కారాదు. అరాజకం సర్వానర్థాలకుస్థానం. చివరకు జగత్సంక్షోభానికి కారణం. నేను నిన్నురాజువుకమ్మని చెప్పటం ఎనిమిది. శ్రుతి, ముందు "మాతృదేవోభవ" అంది. స్మృతికారులు "నమాతుః పరదైవతం" అనిచెప్పారు. ఆమెకోరికకూడ నీవు రాజ్యం గ్రహించమని. ఇది తొమ్మిది. నావాక్యానుసారం నీవురాజ్యాన్ని గ్రహిస్తే, నీపితృవాక్యపాలన భంగంవల్ల వచ్చే అరిష్టాలన్నీ నా బ్రహ్మదండం భరిస్తుంది. భక్తుడైన భరతునిప్రార్థన మన్నించు. ఇక్కడే అభిషేకించి ఆనందంతో ఆ అయోధ్యకు తరలిపోదాం. నీతమ్ముని వైపు ఇంత ధర్మబలం వున్నందున నేను నీకీ సందేశం ఇస్తున్నాను" అని చెబుతుంటే దేవతలు దిగులుపడి ఇంద్రునివద్దకు పోగా, ఇంద్రుడు బ్రహ్మవద్దకు పోయాడు. బ్రహ్మ వారి అభిమతం తెలుసుకుని "అయ్యో! ఇందులో

నాకొరకు ప్రవేశించాదా?ప్రమాదమే వచ్చింది. రాముడు వినకపోతే అవ మానం పొందినవసిష్ఠుడు ఆగ్రహిస్తే. రాక్షససంహారం సంగతిటాడు, పున స్సృష్టి ఎలా అని భయపడుతున్నాను. సరే. మీరుపొండి. విషయం విషమిం చకుండా నేను చూస్తాను" అని చెప్పి ఆసనంనుండి అంతర్హితుడైనాడు- సురలంతా సంతోషంతో స్వస్థలాలకు పోయారు.

## ఆచార్యునికంటె తలిదండ్రులు శ్రేష్ఠులని గురువుతో రాముడు చెప్పుట

గురుదేవుని మాటలువిన్న రాముడు కంఠీభూతుడై క్షణకాలం మౌ నం వహించాడు. "తనపాలనకై లోకం ఎంత తహతహ పడుతున్నదో అర్థంచేసుకున్నాడు" గురువుల వుపదేశం తర్కంతో దాటరానిది. స్వతం త్రించి అహంకరిస్తే అజాతశత్రుడైన మహత్తు అణుగుతాడు. భరతునిపట్ల ధర్మబలం వున్నమాట సత్యం. అవైపునుంచిచూస్తే పితృవాక్యపాలనం చాలా అల్పంగానూ, నెపంగానూ కనుపించి, స్వప్రయోజనార్థం మొండిగా వాది స్తున్నట్లు కనబడుతుంది' గురుతిరస్కారం కూడనిపని. ఆయన ఆశీర్వాదం లేకపోతే అడవిరామునిచరిత్ర అడవిలోనే అంతమౌతుంది. నా ప్రతిన దక్కించుమని ఆయననే ప్రార్థిస్తాను. అని నిశ్చయించుకున్నరాముడు లేచి వంగి, గురుదేవునిపాదాలు స్పృశించి కళ్ళకద్దుకుని "గురుదేవులు కారణం లేకకార్యరంగంలో దిగరు. ధర్మసత్య స్వరూపాలు మీరేకనుక మీఆజ్ఞ శిష్యు నికి శిరోధార్యమే. సృష్టికి ప్రతిసృష్టిచేసిన విశ్వామిత్రులవారిని" (పాహి, పాహి అనిపించిన మీరేపనికైనా సమర్థులు. మీరుచెప్పిందే ధర్మం. అవశ్యం ఆచరణీయంకూడ. నేను వినయంతో చెప్పేమాట వినండి. గోటితోకాగల కార్యానికి గొడ్డలి ఎందుకు? తామార్జించిన దివ్యతపశ్శక్తి నాకై వెచ్చించటం సమ్మతంకాదు. పురుషులకు ముగ్గురు గురువులు. అందులో తృతీయస్థానం గురువులది. ప్రథమస్థానం మాతృదేవిది. ఇది శ్రుతిహితవచనం. పుత్రుని కై తలిదండ్రులు పడేపాట్లు తమరెరుగుదురు. ఇందుకు మీసన్నిధిలో నా తండ్రి ఎంత శ్రమించాడో అది సాక్ష్యమేకదా. పిండస్థితి నుంచి ప్రసవ స్థితిదాకా తల్లిపడేబాధ తల్లులకేగాని మానవుల కగోచ

రించదా. ఆపై ఆశపసంరక్షణ నిమిత్తం ఆమెవాళ్ళయ కర్మ లచేసే త్యాగం వాళ్ళురంచేదేనా? అందుకే వేదమాత తల్లిని ప్రథమగురువుగా పేర్కొన్నది. ఆమె ఆరోగ్యవతిగా వుండటంకోసం భర్త ఎంతపాటుపడరాదు? ఆయన దోహదం లేకపోతే కులస్త్రీబిడ్డను పెంచ గలదా? అంతశక్తి సంపన్నురాలైనా ఆమెకు భర్తకంటే పరదైవతంలేదని ఆవేదమాతే చెప్పించికదా? సత్యానికి వీరుఇద్దరు గురువులుకాక ఒక్కరే. "ఏకమేవా ద్వితీయం బ్రహ్మ" అన్నట్లు జ్ఞానార్జనకు వేరేగురువు అక్కర లేదు. "సత్యం మాతా, పితాజ్ఞానం" అన్నారుకనుక. లోకంలోని తండ్రు లంతాజ్ఞానసంపన్నులు కారు. తల్లులంతా కులస్త్రీలక్షణాలన్నీ కూలంకషంగా ఆచరించేవారుకారు. కాబట్టి పుత్రధర్మం చెప్పేటప్పుడు తల్లిదండ్రులను వేరువేరుగా వ్యవహారధర్మంలో చెప్పి, ఆచార్యుని అధికంగా పేర్కొ న్నారు. పుత్రవ్యామోహంలో పడ్డ జననీజనకులు వానిని తీర్చి దిద్దలేరు. ఆ పని ఆచార్యుడు చేయగలడు. తలిదండ్రులు పుత్రుడనే బంగారం ఇస్తే ఆచా ర్యుడనే అగసాలి ఆభరణం చేయగలడు. గురుదేవా! తమ చరణ సన్ని ధిలో శిష్యుడు అధిక ప్రసంగం చేశాడు. తమకు నాభావం తెలుసును గనుక ఆగ్రహించక అనుగ్రహిస్తారని ఆశిస్తూ ముగిస్తాను. నేను సల్పే వనవాస కాలం అల్పం. నా అల్పకాల పితృవాక్యపాలనం వల్ల పితృ లోకంలో తండ్రి వుండేకాలం అనంతం" అన్నాడు.

రామునిమాటలు విన్నగురుదేవులు "రామా! నీలో వేదమూర్తివైన నా తండ్రిని దర్శించాను. నీ రూపంగా ఆయనే సంభాషించాడు. దైవసం కల్పం వేరుగావుంది. నా వుపదేశం నీవు తిరస్కరించలేవు. నా అనుమతి అర్థించావు. తల్లి. ఆచార్యులమధ్యగదా తండ్రిగురువుగా చెప్పబడింది, నీవేచెప్పావు లోకంలో తండ్రులంతా జ్ఞానవంతులు కాదనీ, అందుకే ఆచార్యులు అవసరమనీ. నీ ఇప్పటిజ్ఞానం నీ తండ్రి దత్తమని నీవూ చెప్ప లేవు. నీవు చివరచెప్పిన మాటఎంతో అర్థవంతంగావుంది. అల్పకాల వ్యవధిలో అనంతఫలం వస్తుందని, ఇది ముమ్మాటికీ సత్యం, కాబట్టి విజయం నీకేవదిలేస్తున్నాను" అనిచెప్పాడు.

గురుదేవులు ఆ విధంగా అనగానే, భరతుడు "సారథీ! నాకోసం దర్భలతో ఆసనంకల్పించు. అప్పిచ్చినవాడు. పుచ్చుకున్నవాడు ఈయక ఇబ్బందులు పెడుతుంటే విసిగి ఇచ్చేదాకా కదలనని వాకిటముందు అన్నం నీళ్ళూ ముట్టకుండా ప్రాయోపవేశం చేసినరీతిగా, అన్నకు దయకల్గేవరకూ అనుసరణీయమైన ప్రాయోపవేశంచేస్తాను." అని చెప్పగానే, సుమంత్రుడు రామునివంక చూశాడు. వెంటనే భరతుడు తానే తెచ్చుకుని కుశలు నేలపై పరిచాడు. రాముడు తమ్మునివంకచూస్తూ." సోదరా! ఎంతసాహసం చేస్తున్నావు? ఇది విప్రుడు ఇచ్చినసొమ్మును మరల పుచ్చుకునేందుకు చేసే పని. నేను నీకేం అపకారంచేశాను? నీ విత్తం ఏం అపహరించాను. తల పై కిరీటం ధాల్చవలసిన నీవు ఈ పనిచేయటం ఏమీబాగాలేదు, ఈ వ్రతాన్ని మాను" మన్నాడు. భరతుడు బిగ్గరగా కేకేస్తూ పౌరులారా! మీరైనా చెప్పండి, మీకు రామచంద్రుడే రాజు, భరతుడెన్నటికీ కాడు." అని కోరాడు. వారంతా." రాజకుమారా! కన్నాము రామయ్యమదిలోవున్న నిశ్చయం. విన్నాము, ఆయనచెప్పిన వివేకవంతమైన మాటలు. అంతటి పెద్దలే ఆయనను మరలింపలేకపోతే మేమా మరలించేది." అని బదులు పలికారు. అప్పుడు రాముడు" సోదరా! విచారించకు. అందరు హర్షించిన పనికై నీవు ఆరాటంపడటం దేనికి? క్షేమంగా సపరివారుడవై వెళ్ళి తల్లి దండ్రుల మనస్సులకు శాంతికల్పించు. నీ విప్పుడు చేసినదోషానికి పరి హారంగా నన్నూ, జలాన్నీ స్పృశించు"మని చెప్పాడు. వెంటనే భరతుడు అన్న చెప్పినవిధంగా ఆచరించి మహాజనులారా! తండ్రిని నేనెప్పుడూ రాజ్యం కావాలనికోరలేదు, మార్గాంతరంగా రాజ్యం సంక్రమింపచేయుమని తల్లికి చెప్పలేదు. మా అన్న వనవాససంగతి అసలే ఎరుగను. మాఅన్నకు తండ్రివాక్యమే ప్రమాణమైతే ఆయనకు మారుగాఅరణ్యవాసం నేనుచేస్తాను. జాబాలిమహర్షులవారు చెప్పినట్లు పర్యవసానం "ఎవరికి వారే". స్వార్థప్రయోజనంతో అనేక భావాలతో బంధాలు కల్పించుకుని ఆయువు క్షీణించగానే ఎవరివారివారు కాలగర్భంలో కలుస్తారు, ఆయనకు తండ్రి లక్ష్యమైతే, ఆయన నాకులక్ష్యం. ఆయన తనతో వుండవద్దంటే మారుమూల ఎక్కడో ఒకచోట జీవితశేషం గడుపుతాను. నేను ప్రజలకు

రాజును తెస్తానని మాట ఇచ్చాను. నా మాట భంగించుకుని నేను మాత్రం నరకానికి ఎందుకు పోవాలి? అన్నమాట ప్రకారం ఆచరించటం సత్యవ్రతపాలనమై, తద్వారా ఉత్తమలోకప్రాప్తి కలిగేటప్పుడు ఆ నవవ రాజ్యాన్ని ఈ దాశరథి మాత్రం ఎందుకు విడిచిపెడతాడు? మహాజనులారా! నా ప్రయత్నం భగ్నమైంది, నేనిక అయోధ్యకు రాను. మీరు పొండి. అనంతరం ఏమి జరుగుతుందో అదే జరుగుతుంది. యజ్ఞ పురుషుడిచ్చిన దివ్యపాయసభాగం భరతుడని అన్న గ్రహించు గాక. తల్లులారా! నాకు సెలవింపు. పౌరులారా! భరతుడు మీకు ప్రణామం చేసి అనుమతి వేడు కున్నాడు. గురుదేవా! ఆశీర్వదించు మహర్షులారా! వినత శిరస్కుడనై మీ అనుగ్రహాన్ని వేడుకొంటున్నాను. అగ్రజులారా! భరతుడు కడసారి పాదాభివందనం చేస్తున్నాడు. కరుణాపూరిత హృదయంతో గైకొనండి. వదినా! తల్లివంటి నీఅనురాగానికి ఈనిర్భాగ్యుడు నోచుకోలేదు. నీఅనురాగా మృతవృష్టితో ఆత్మజసదృశుడైన భరతుణ్ణి స్నాతుణ్ణిచేసి సర్వపాప పంక క్షాళనంచేయి. తండ్రి విధించిన శిక్ష తనయునికొక్కనికే. మీకై మీరు ఎవరి కోసం శిక్షలు విధించుకుని ఇక్కడికివచ్చి సేవలు చేస్తున్నారో, ఆయనకొరకై నాకై నేను ఈ వ్రతాన్ని విధించుకుంటున్నాను. ఒకటే మాట, ఒకటే బాణం, ఒకటే భార్యగా అన్నకీర్తికి, "ఒకే లక్ష్యంగల ఒకటే కుటుంబం" అన్న నాల్గవ ప్రథ చేర్చి అమృతత్వాన్ని పొందిస్తాను. "రామం శరణం గచ్ఛామి, సత్యం శరణం గచ్ఛామి, ధర్మం శరణం గచ్ఛామి" అని సీతా రామలక్ష్మణులకు ప్రదక్షిణం చేస్తుంటే త్రిమూర్తుల సింహాసనాలు దిగిపో జొచ్చినై. అకాలంలో సూర్యగోళంకాలమేఘావృతమైంది. సముద్రాలు ఘూర్ణిల్లసాగినై. ప్రళయ సమయ పుష్కలావర్తక మేఘాలు నియమాతి క్రమణానికి శక్తి పుంజుకుంటున్నై. త్రిలోకపతికి దిక్కు తెలియటంలేదు. చతుర్ముఖుడు ఈశ్వరధ్యానం చేశాడు. మనోగోచరమైన పరమేశ్వరునితో "మహాదేవా! వైష్ణవం భిన్నరూపంగా ప్రవర్తిస్తున్నది. భరతుని బలం అధిక మవుతూంది. లోకవ్యవహారం నిమిత్తం వేదం విధించిన నియమ నిషేధాస్త్రా లన్నీ వాడబడినై. భరతుడిప్పుడు మూలపదార్థమైన రామాంశలో లుప్తం కాబోతున్నాడు. అది జరిగితే అవతారాంతం ఇప్పుడే జరుగుతుంది. ఇక

నా శక్తి చాలదు. భరతునివైపు రాముని దృష్టి మరలించాలె. అందుకు నీవే పూనుకోవాలె."

## శ్రీరాముడు వనవాసానంతరం రాజ్యం స్వీకరిస్తానని భరతునితో చెప్పుట

అని చెప్పంగానే సమాధినిష్ఠుడైన శంకరుడు జరుగుతున్న స్థితి సంభావించాడు. వైష్ణవశక్తిని స్మరించి "నీవు రాముడిలో ప్రవేశించి రాజ్య స్వీకారానికి బీజం వేయి. ఓయి చతుర్ముఖా! నీవు ఇంతవరకు రాముణ్ణి రాజ్యవిముఖుడుగా చేశావు. నీ తేజస్సు ఉపసంహరించుకో" అని ఆదేశించాడు. రామచంద్రుడు తనను ప్రదక్షిణిస్తున్న తమ్ముణ్ణి చూశాడు. కోటిసూర్యప్రకాశంతో కొట్టవచ్చినట్లు కనిపిస్తున్న భరతుని వైష్ణవరూపం గోచరించింది. నిమీలితనేత్రుడైనాడు. పద్మాక్షులవిప్పి భరతుని పలికిస్తూ, "దాశరథీ! ఆగు. నేను రాజ్యపరిగ్రహణం చేస్తాను. తండ్రి విధించిన పద్నాల్గేండ్లు అరణ్యవాసం ముగించి అయోధ్యకు వస్తాను. తండ్రి కోరింది నన్నుగాని నిన్ను కాదు. అవసానసమయంలో నన్నే భావిస్తూ మరణించాడని కదా చెప్పావు. ఆ స్మరణకు అర్థం ఏమిటో చెపుతా విను. "తన వాక్యానుసారం తనయుడు నడిచి తనకు ఉత్తమ లోకాలు కల్పిస్తాడా? లేదా?" అని. అందుచేత నీ వనవాసం అన్నగా నేను నిషేధిస్తున్నాను. అంతవరకు రాజ్యరక్షణం చేసి, ఇద్దరం పితృవాక్య పరిరక్షణం చేశామన్న తృప్తి మరణించిన తండ్రికీ, జీవించివున్న తల్లికీ కల్గిద్దాం" అన్నాడు.

శ్రీరాముడు అన్నమాటకు సిద్ధసాధ్యమరుద్గణం ఆనందించింది. వారి వారి మిత్రబాంధవులతో "ఆహా! దశరథుడు ఎంత ధన్యజీవి. బ్రతికినంతకాలం సాటిలేని ప్రభువుగా కీర్తి గాంచి, మరణానంతరం, క్షీణపుణ్యుడు కాకుండా చిరకాలం పితృలోకంలో నివసించే అర్హత పొందాడు. అందరూ పుత్రులకంటారు. కాని ఏమి ప్రయోజనం? బిడ్డల వృద్ధికోసం పాటుపడటం చేసి, వారివల్ల సౌఖ్యం లేకా, చచ్చినతర్వాత పిండోదకాలు లేకా నరకంలో యాతనలు పొందుతారు. కల్గిన సద్గుణా, సద్గువేదాలా,

నాల్గు సముద్రాలు, దశరథునివంటి ధరణీపతి ధరణికి దొరకటం ధరణి అదృష్టం" అని పొగడారు. రాక్షసబాధతో రాయిడి పడుతున్న మునులు రామాజ్ఞను చెల్లించమని భరతుని కోరారు. తండ్రికి ఉత్తమ లోకప్రాప్తి కలగాలంటే అన్నమాటను పాటించమనిచెప్పి దేవగణం నిష్క్రమించింది. తాపసుల వచనాలకు సంతసించిన సీతేశుడు వారినందర్నీ ఉచితరీతిని సత్కరించాడు. మానవులే కాక దేవతలు సయితం అన్నమాట పాటించమని చెప్పటం భరతునకు శిరోనిర్ఘాతపాతమైంది. కంఠార్పితమైన కాలపాశంగా పరిణమించింది. ఆత్మహత్యాకారాగత మృత్యుదేవతగా గోచరించింది. కింకర్తవ్యతా మూఢుడైనాడు.

మరల తేరుకున్నాడు. మనసు కుదుటపరచుకున్నాడు. అగ్రజా! తుది నిర్ణయమేనా?" అని ప్రశ్నించాడు. "ఇదే నా నిర్ణయం. లక్ష్మి సుధాకర మండలాన్ని విడిచిపోవు గాక, హిమవత్పర్వతాన్ని హిమం వదలి వేయును గాక, సముద్రం చెలియలికట్టను అతిక్రమించు గాక, తండ్రి విధించిన విధిని రాముడు తప్పడు" అని ప్రత్యుత్తరం ఇచ్చాడు. తత్క్షణం భరతుడు "అన్నా! నా నిర్ణయం విను. సూర్యచంద్రులు గతులు తప్పినా, సప్తసాగరాలు ఏకమైనా, కులపర్వతాలు కూలినా, ధరణీభ్రమణం తారుమారైనా, ముగ్గురు భార్యలకు సమానంగా పాయసం పంచక అర్ధాంశం పెద్ద భార్య కిచ్చి, అర్ధంలో అర్ధం రెండవ భార్య కిచ్చి శేషించిన అర్ధం కూడా ఈయక అందులో అర్ధం నా తల్లి కిచ్చాడు తండ్రి. అంటే మొత్తంలో ఎనిమిదవవంతువాణ్ణి. నీలో నాల్గవవంతువాణ్ణి, కనిష్ఠుణ్ణి. అయోధ్య సింహాసనం ఇంతవరకు జ్యేష్ఠార్హతను భంగించలేదు. నాతో వంశమర్యాద భంగింపబడటం నేను వాంఛించను. ఎవరిది ఎంత ధర్మమైనా నా ధర్మం నాది. నేను అయోధ్యకు పోను. ఆసింహాసనాన్ని స్పృశించను. వనవాసానంతరం నీవు వచ్చి పరిగ్రహించవలసిందే. అంతదాకా అది పరదేశవాసి అయిన పతికోసం సతి చూస్తున్నట్లు చూడవలసిందే. నాకు జ్ఞానోదయమైనప్పటినుంచీ, తల్లీ, తండ్రీ, అన్నీ నీవే అని ఆకాంక్షించాను. కనుక నీ కోరిక తిరస్కరించను. దానికిముందు, నియమిత కాలానంతరం

నీవు రాజ్యాన్ని గ్రహిస్తానన్నావు కాబట్టి, అంతవరకు అపవిత్రం కాకుండా గద్దెను కాపాడుతాను.

కాని, దానికి నీ ప్రతిరూపంగా నాకు ఏదైనా ఇవ్వాలి నీవు. ఇదీ కాదంటే, నీవు అయోధ్యకు రావలసిన అవసరం కూడా లేదు. పరమ ధర్మాన్ని పాడుచేసిన భరతుడు గద్దె ఎందుకు దిగుతాడు? దిగి నీ కెందుకు ధారాదత్తం చేస్తాడు? పద్నాల్గు సంవత్సరాలకే పరిమితం, ఆపైన "రాజ్యార్హత నాదే యని చెప్పే అవకాశం లోకవ్యవహార ధర్మంగా వుండదు. ఆ కాల పరిమితికి, హక్కే నశిస్తుంది. నీ మాట నిలబెట్టుకోవాలంటే నీ విప్పుడు ఎవడిని తండ్రి పుణ్యలోక ప్రాప్తికి పట్టం కట్టుకోమన్నావో వాడినే నీ దివ్యాస్త్రాలకు బలిచేయాలి. నా తల్లి నీవన్నట్లు రాజ్య తంత్రం తెలిసింది కనుకనే పద్నాల్గేండ్లు వనవాసం కోరింది" అని చెప్పాడు. సంతోషంతో తమ్ముణ్ణి తనివితీర కౌగిలించుకున్నాడు రాముడు.

## శ్రీరాముడు భరతుని సమాధానపరచి తన పాదుకలొసంగుట

"తమ్ముడా! ధర్మరక్షణం, సత్యవ్రతపాలనం, వంశాచారోద్ధరణం, రఘువులకు వెన్నతో పెట్టిన విద్య. పుటంపెట్టిన బంగారంవలె నా పరీక్షలో నిల్చి ప్రకాశించావు. నానించి నీవేమి కాంక్షిస్తావో చెప్పు. నేనిప్పుడు అరణ్యవాసిని కదా" అన్నాడు. ఆ మాట విన్న భరతుడు అన్నపాదాలపై పడి కళ్ళ కద్దుకుంటూ, "అన్నా! నా జన్మ ధన్యమైంది. నా ఆశయం నూటికి మూరుపాళ్ళు ఫలించింది. నేను కోరేది చెపుతా" నంటూ, తండ్రి ధరించే రత్నఖచిత ధర్మపాదుకలు తెచ్చి పాదాల ముందుంచి, "సీతాపతీ! నీ శ్రీచరణాలు వీటిపై మోపుమన్నాడు." అదృశ్యాన్ని చూస్తున్న అక్కడి వారే కాక అంతరిక్షంలో ఉండి తిలకిస్తున్న దేవతలుకూడ అమందానంద కందళిత హృదయులైనారు. రామచంద్రుడు ఆ పాదుకలపై చరణము లుంచి దిగాడు. భరతుడు రెండు చేతులతో రెండు పాదుకలు సంధించి పట్టుకుని శిరస్సుంచి, కన్నుల కద్దుకుని, "రామా! రఘుజలధిసోమా! దశరథ పరిపూర్ణకామా! సర్వసద్గుణస్తోమా! నతభార్గవరామా! సంతృప్తి

జనఘోష! ఈ పవిత్ర పాదుకలలో ఆవేశించుము. ఓ మహాజనులారా! మీకు మాటఇచ్చిన ప్రకారం రాజును తెస్తున్నాను. ఇప్పటినుంచి అయోధ్య సింహాసనానికి రామచంద్ర ప్రతినిధిగా రామపాదుకలు రాజుగా వుంటై. తమ్ముడు ఎక్కినగద్దెపై అన్న అధివసించటం ఆచారవిరుద్ధం, ధర్మవిరుద్ధం ఆ దురాచారం అన్న అనుగ్రహంతో పరిహరించబడింది. నా అన్నవలె నేనూ జటాజినధారినై, ఫర్ణఫలభక్షణుడనై, భూశయనుడనై, పాదుకలకు నివేదిస్తూ పరిపాలనం చేస్తాను. పద్నాల్గేండ్లు నిండిన మధ్యాహ్నానికి అన్న దర్శనం అయితీరాలి. అరగడియ అతిక్రమించినా, అగ్నికి భరతుడు ఆహుతి అవుతాడు. అన్నా! విన్నావా? అని అడిగాడు. విన్నాను తమ్ముడూ! విన్నాను. నీ కోరిన ప్రకారం ఆ వేళకు వస్తానని మాట ఇస్తు న్నాను. నా తమ్ములవంటి ఉత్తమ పురుషులను తరచుగా సృష్టించమని ధాతను అర్థిస్తున్నాను. పరమభక్తులలో నీవు ప్రథమ స్థానాన్ని పొందవలె నని ఆశీర్వదిస్తున్నాను. నీవు నీ తల్లిని ఎన్నడైనా దూషిస్తే మీ వదిన ఆగ్రహానికి గురి అవుతావు. సోదరా! నీ యాత్ర మాతాపితరులకు సంతోష పాత్రమైంది. పోయిరా" అంటూ పునరాలింగనం చేసుకున్నాడు రాముడు. భరతుడు రామపాదుకలు శిరస్సుపై పెట్టుకున్నాడు. దేవదుందుభులు మ్రోగినై. అప్సరఃకాంతా చరణ మంజీరకరకంకణకింకిణీక్వాణాలు, బహువిధ వాద్యరావాలు మొరసినై, దేవతాతరువులు పాదుకలపై పరిమళ మిళిత పారిజాత ప్రసూనాలు అర్పించి పూజించినై. కామధేనువు క్షీరం వర్షించి నివేదనం చేకూర్చింది. రామభరతులు అభిన్నమూర్తులని ఆకాశ వాణి ఘోషించింది. ఆ మహానందవేళ ఒంటొడలు విడిచిపోలేక చేస్తున్న హాహాకారాలు అంతరిక్షంలో ప్రతిధ్వనిస్తున్నాయి

## భరతుడు తిరుగు ప్రయాణంలో భరద్వాజాశ్రమానికి వచ్చుట

మండిమండి శమించిన ప్రొయ్యిలో మళ్ళీ కట్టెలు పెట్టినట్లు, తగ్గి పోయిన దుఃఖం బంధు దర్శనంతో విజృంభించింది. కలసివున్నంతకాలం ఉపశమనం పొందింది. విడిచివెళ్ళే వేళ యథాస్థితికి చేరుకుంది. ఎట్టకేలకు అతికష్టంమీద అందరూ ప్రయాణోన్ముఖులైనారు. సోదరులు పరస్పరా

లింగనాలూ, హెచ్చరికలూ చేసుకున్నారు. భరతశత్రుఘ్నులు జానకీ పాదారవింద పరాగ పవిత్రీభూత శిరస్కులై సెలవుతీసుకున్నారు. భరతుడు రామపాదుకలు జటాభారమూర్ధాలంకారప్రాయంగా ధరించి, పట్టపు ఏనుగుపై అమర్చిన అంబారీలో స్వర్ణపీఠంపై ప్రతిష్ఠించి, సంకల్పించినయాత్ర సర్వలోక సంక్షేమకరంగా పరిసమాప్తం అయినందుకు లోలోపల నిండారా సంతసించాడు. హృదయభారంలో వచ్చిన పౌరులూ, రాణులూ, సంతోష సాగరంలో తేలిపోతూ, తమ తమ వాహనాలను ఎక్కారు. భరత శత్రుఘ్నులు రాజగజం వెనుక రథంపై ఆసీనులయ్యారు. వీడలేక వీడలేక వీడిపోతున్న శతాధిక మాతృదేవులకు రామచంద్రుడు దండవదభివాదనం చేసి పెల్లుబికిన కన్నీళ్ళతో కుటీరంలోనికి వచ్చి, అనుజుని, భార్యను చేర్చుకుని ఆక్రోశించాడు.

ప్రయాణ భేరి మ్రోగింది. మంగళతూర్యరవాలు మార్మ్రోగంగా పరివారం ప్రఫుల్లముఖపద్మంతో ముందుకు సాగింది. భూతధాత్రి శోకాంధ కారావృతకాలరాత్రి రేగింది. రథగజతురగపదాతి పదఘట్టన సంజాతధరణీ పరాగం రేగింది. మధుపానంతో ఒడలు మరచి చెలరేగి మధురనాదమేదు రంగా మధుపసంతానం మోదం విరియిస్తూ మూగింది. వసిష్ఠ వామదేవ జాబాలి ప్రముఖ మహర్షులు ముందుగా ప్రాఙ్ముఖులై పయనించారు. మంత్రి యుక్తంగా, మందాకినీనదినివీక్షిస్తూ, తూర్పు దిశగా చాలా దూరం పోయి, చిత్రకూట పర్వతానికి ప్రదక్షిణంగా పోయే మార్గం చేరాడు భరతుడు. పర్వతధాతువుల ప్రకాశం, వృక్షలతాగుల్మాలశోభా, స్వచ్ఛమైన ప్రకృతీ చూస్తూ, సైన్యం వెంటరాగా భరద్వాజాశ్రమం చూపు మేరకందే చోటికి చేరుకున్నాడు. అక్కడ అందర్నీ ఆగమని మంత్రి పురోహిత మహర్షి సమేతుడై పాదచారిగా భరద్వాజుల ఆశ్రమం ప్రవేశించాడు. భరతుని రాక నెరింగిన భరద్వాజుడు ఆనందంతో ఆహ్వానించాడు. పాద నమస్కారానంతరం భరతుణ్ణి మహర్షి ఆశీర్వదించి లేవదీసి, "నాయనా! భరతా! అన్నలనూ, మీ వదిననూ చూశావా? వచ్చిన పనులన్నీ నిర్విఘ్నంగానూ, విందుతనంగానూ నెరవేరినవా? ఈప్రయాణం అయోధ్య కేనా?" అని సాదరంగా ప్రశ్నించాడు. "మహర్షిచంద్రా! మీ అమోఘ

మైన ఆశీర్వాదఫలం సిద్ధించింది. అన్నవు నీవన్నాను. వృథాగా ఆరడి పాలైనా నన్నాను, నన్ను మన్నించమన్నాను. వీరంతా నీ అనుగ్రహాన్ని అర్థించవచ్చారన్నాను. నీవు రాక నే నయోధ్యకు పోనన్నాను. భరతుడు బ్రతికివుండగా సింహాసనం ఎక్కనన్నాను. ఏమన్నా. అన్నవిన నన్నాడు. తండ్రి మాట తప్పనన్నాడు. గురుదేవులు కోరగా, ప్రతినిధిగా పాదుకలు ఇచ్చాడు. వనవాసానంతరం వచ్చి రాజ్యాన్ని పరిగ్రహిస్తానని బాస చేశాడు. నేనా పాదుకలనే రామచంద్రమూర్తిగా భావించి అయోధ్యకు కొనిపోతున్నాను. ఇకనుంచీ అన్న పాదుకలే అయోధ్యా రాజ్యపాలనం చేస్తై" అని భరతుడు విన్నవించాడు. "వత్సా! భరతా! సాధుశీలవృత్తంచే సన్నుతుడవు, ధన్యచరిత్రుడవు. త్రిమూర్తులచే కలవరపాటు కూర్చిన దృఢచిత్తుడవు, నీ త్యాగం అసదృశమైంది. "నభూతో నభవిష్యతి" నీవు సాధించిన కార్యంవల్ల. నీ తండ్రి మరణించికూడా జీవించినవాడైనాడు. పితృలోకంలో శాశ్వత స్థానం సంపాదించుకున్నాడు. అన్న అడవిలో వున్నాడని ఖేదపడకు. ఆయన వనవాసం అవనికి ఇప్పు డెంతో ఆవశ్యకం. నీవు రామభక్తాగ్రగణ్యుడవై రాజింతువు గాక. శుభంగా పోయిరా" అని మునిచంద్రశేఖరుడు అనుమతి ఇచ్చాడు. ఆశీస్సులందిన భరతుడు తనవారిని చేరవచ్చి, కతిపయదినాలకు "కళిందజా" నది ఉత్తరించి గంగానదిని చేరుకున్నాడు. వెంటనే గుహుని ఆజ్ఞానుసారం ముందే ఏర్పాటైన పడవలపై దాటి తీరస్థ నగరమైన శృంగి బేరం చేరుకున్నాడు. మిత్రుని అభ్యర్థనతో ఆతిథ్యం స్వీకరించి, సెలవు తీసుకుని అయోధ్యా నగర పరిసరాలకు చేరుకున్నాడు, రథం తోలుతున్న సుమంత్రునితో.

## అయోధ్యా నగర వర్ణనం

పతి పరిత్యక్త సతివలె నిరానందగా, నిశ్శబ్దగా, నీరవగా, నిరాహారగా వున్న అయోధ్యా సీమంతినిని చూపిస్తూ, "మంత్రీ! ఇక్ష్వాకులకాలం నుంచీ ఎప్పుడైనా ఈ మహానగరం ఇప్పటి దుఃస్థితి పొందినట్లు కన్నావా? విన్నావా? సంస్కారం లేక హర్మ్యాలన్నీ ఎలుకలు తోడిపోసిన మట్టిరాసులతో నిండివున్నై. ఆ ఎలుకల గుంపులపై పిల్లులు దాడిచేస్తున్నై. ఆ

పిల్లలపై సహజ విరోధంతో కుక్కలు దూకుతున్నై. చెట్లకొమ్మల్లో, కొండసందుల్లో గూళ్ళు కట్టుకుని వుండే గూబలు స్వేచ్ఛగా గూళ్ళు కట్టుకున్నై. ఎండకాలంలో సూర్యుని వేడికి జలం ఇంకిపోగా, చావగా మిగిలిన చేపలతో, పీతలతో, ఇక్కటిక్కిన పక్షులతో ఉన్న చెరువులాగా, పౌర జన సంచార శూన్యమై పాడుబడివున్నై. మణిమయుద్యానాలన్నీ ఎండివున్నై. బాటలన్నీ పలు రకాలైన పల్లేరు, నేలతుమ్మ, బలుసుమొక్కలతో నిండివున్నై. దేవాలయాలు, ధూప దీప నైవేద్యాలు లేక ధూళి ధూసరితమైవున్నై, సవనంలో బంగారు రంగుతో ప్రకాశించే అగ్ని, హవనంతో ఆరిపోయినట్లు గృహాలన్నీ గోడు గుడుస్తున్నై. ఏనుగులు ఆలానం (కట్టుకొయ్య) పెకలించి అడవుల్లో తిరిగినట్లు తిరుగుతున్నై. ఆలనా, పాలనా లేని గుర్రాలు వన్నె మాసివున్నై. రథాలు ఓటలు వారినై, చక్రాలు విరిగినై. దొంగలు దోచిన కొంపలాగా, కటక సమయంలో వదిలివేసి పౌరులు ప్రవాసం పోయిన గ్రామంవలే, రత్నాలు రాలిన హారం రీతి, గ్రహగ్రస్త రవి శశి మండలం చందాన, యుద్ధానంతరం రణభూమి పోలికగా మన పట్టణం కనిపిస్తూ మనోవ్యథ కలిగిస్తూంది. హృద్యంగా వినిపించే వాద్యధ్వనులేమయినై? చందన గంధ మాలాబృంద సుగంధ బంధుర సమీరం వీచదేమి? మహారాజు మరణించాడు, అన్న అడవులు పట్టాడు. ఎవరికోసం ఇంక పల్లకీల మ్రోతలు? గజబృంహితాలూ, హయ హేషలూ, రథనేమిధ్వానాలూ, కాలసూచిఘంటానాదాలూ, భేరీ కాహళని స్వనాలూ ఆ ఇద్దరితోనే అదృశ్యమైనై" అంటూ అయోధ్యలో ప్రవేశించి, మహారాజమందిరానికి పోయాడు. సింహంలేని గుహలాగా, రవిలేని దినంలాగా, శశి లేని నిశలాగా, దైవంలేని ఆలయంలాగా, జలంలేని నీరధిలాగా వున్న ఆహర్మ్యాన్ని చూచి ఆక్రందించి, తల్లుల అందర్నీ అందులో దిగవిడిచి, "గురుదేవా! నే నిక్కడ బ్రదుకలేను. అన్న వచ్చువరకు నేను జీవించాలంటే; నేను నందిగ్రామంలో ఉంటాను. నా కక్కడ పర్ణశాల నిర్మింపండి. రామచంద్రుడే రాజని పురమంతా చాటించండి. స్వతంత్ర రాజమిత్రులకూ, సామంతరాజ సంతతికీ, బంధువులకూ అయోధ్యాపతి రఘువంశమండనుడు రామభద్రుడే అని వార్తల పంపండి. ఆయన అనుశాసనం అనుల్లంఘనీయం అని అందులో లిఖించండి. పట్టణ

ప్రాముఖ్యాన్ని చూడండి. ధనధాన్యాగారాలు తెరిపించి పౌరుల స్వీయ కర్మలకు స్థితి చేకూర్చండి. సిద్ధపరచండి.

సస్యక్షేత్రాలకు జలమార్గాలు బాగుచేయించండి. పశువులకు గ్రాసం తెప్పించండి. ఆరుదినాలలో అయోధ్య అయోధ్యగా రూపొందించండి. రాజాస్థానంలో భద్రాసనం అలంకరించండి. శాలను వైభవోపేతం చేయండి. ముందేగి మీరీ పని పూర్తిగావించండి, నేను వెనుక వస్తాను" అని చెప్పాడు. గురుదేవులు సిద్ధార్థాది మంత్రులవంక చూచాడు. ఎవరి పనులకు వారు వెంటనే తరలి వెళ్ళారు. వసిష్ఠ వామదేవాది మహర్షులు ముందు నడువగా, పురోహితులు స్వస్తివాచనం పఠించగా, ముత్తైదువలు మంగళ నీరాజనాలీయగా, వెలయాండ్రు తమవారితో కూడి గానాభినయములతో నర్తించగా, పౌరదండనాథామాత్యులు పరివేష్టించగా, పట్టపుటేనుగుపై నుంచి భరతుడు పాదుకలు గ్రహించాడు.

## శ్రీరామచంద్ర పాదుకా పట్టాభిషేకం

శ్రీరామచంద్ర చరణారవింద సంస్పర్శచే పరమపావనమైన పాదుకలు భరతుడు రెండుచేతులతో శిరస్సుపై ధరించి శత్రుఘ్నుడు అనుసరించి రాగా, నిమీలితనేత్రుడై, రామధ్యానైకచిత్తుడై కొలువుకూటానికి నడువ జొచ్చాడు. ఆయుధపాణులై సైనికులూ, తురగారూఢులై అశ్వికులూ, లయానుకూల విన్యాసంతో సాగిపోతున్నారు. శతఘ్నులు ప్రేల్చబడినై. బాణాసంచాలు కాల్చబడినై. అప్పటికప్పుడు అయోధ్యవాసులంతా అలంకృతులై ఆనందోత్సాహాలతో, ఆడుతూ పాడుతూ పోసాగారు. వందిమాగధులు "జయ జయ శ్రీరామ, కకుత్స్థవంశ కలశార్ణవసోమ, పితృవాక్య పాలన రామ, భరత హృదయానందధామ" అని స్తుతి చేస్తుండగా, ముప్పై మూడుకోట్ల దేవతలు అంతరిక్షంలో రథారూఢులై అవలోకిస్తున్నారు. కల్పకం కుసుమవృష్టి కురుస్తూంది. అనిమేషుల కోలాహలం చెప్ప శక్యం గాకుండావుంది. క్రమంగా దాశరథి సింహాసనం చేరుకున్నాడు. సరయూజలాలతో అభిషేకించాడు. రాజోపచారాలన్నీ జరిపించాడు. పాదుకలు సమంత్రంగా ధర్మపీఠంపై ప్రతిష్ఠించాడు. భరతుడు సింహాసనాభి

ముఖంగా నిల్పి, పాదుకల నుద్దేశించి, "ఓ పాదుకలారా! మీరు నా అగ్రజ ప్రతిమూర్తులు, నేటినుండి మీ ప్రతినిధిగా భరతుడు రాజకార్యాలు నిర్వహిస్తాడు. నా కందిన విషయాలూ, మంత్రాంగం చేసిన శాసనాలూ. నిర్ణయాలూ మీకు వినిపించుతాను. మీ సన్నిధిలో ధర్మఘంట నిల్పుతున్నాను. నా తల్లిదండ్రులు చేసిన కార్యం ధర్మబద్ధమైతే, నా అన్న సత్యధర్మ స్వరూపుడైతే, ఆయన సత్యనిష్ఠ మీలో అంతర్లీనంగా వుంటే, ఆనిర్ణయాలు ఆ శాసనాలు, ఆ దండనలు ఆచరించదగినవైతే ఈ ఘంటిక తనంత ముమ్మారు మ్రోగునట్లు చేయ ప్రార్థిస్తున్నాను. దశరథుల పాలనంలో ధర్మభంగం జరుగరాదు. శ్రుతిహిత ధర్మకర్మాచరణం పుష్టిగా, సంతుష్టిగా సాగిపోవాలె" అని రామచంద్రుని మనశ్శక్తిని ఆహ్వానించి ఆ పాదుకలలో ప్రాణప్రతిష్ఠ చేశాడు. "భరతుడు కోరిన కోర్కెలన్నీ పాటించబడతై" అన్నట్లు అంగీకారసూచకంగా ఆ ధర్మఘంటిక ఆగకుండా మ్రోగింది.

అమరులు నాసికలపై వ్రేళ్ళుంచుకుని ఆశ్చర్యం పొందారు. " ఇది కృతయుగమా, త్రేతాయుగమా ? " అని సందేహించారు. " మానవులెంత శక్తి సంపన్నులు ? వారి తపస్సంపదకూ, ధర్మనిష్ఠకూ, త్యాగదీక్షకూ, మనం దాసులం కావలసిందే కదా ? " అని అసూయ పడ్డారు. పాదుకలకు పట్టాభిషేకం కాగానే పౌరులంతా సంతోష దేవతకు స్థానం తామేయని నిరూపించుకుంటూ గృహోన్ముఖులైనారు. భరతుడు పౌరమంత్రి వర్గమధ్యంలో " రాజమర్యాదలన్నీ ఈ పాదుకలకే చెల్లుతుంటై. నేను నిత్యం తొమ్మిది గడియల కాలానికే కొలువులోనికి వస్తాను. నా రాకపోకలకు రాజలక్షణాలు ఏవీ ఏర్పాటు చేయవద్దు. ఆ వేళకు మంత్రి సేనాపతి ధర్మాసనులు రాగోరుతున్నాను. అభియోగములకుగాని, అవసరములకుగాని, పౌరులు ప్రభు దర్శనం వాంఛిస్తే నిర్బంధాలు సడలించి వెంటనే రాజదర్శనం కలిగేటట్లు కట్టడి చేయండి. ప్రజలకు అటువంటి అవసరాలు కలుగకుండా ముందు ముందే వార చక్షువులతో చేయండి. గురుదేవా ! అప్పుడప్పుడు, తమ నియమ నిష్ఠలకు అంతరాయం లేకుండా శిష్యుల యోగక్షేమాలు విచారిస్తుండండి. నాకు సెలవు దయసేయండి. నే నిప్పుడే నంది గ్రామం చేరుకుంటాను. సారథీ ! రథం తీసుకురా " అని చెప్పి, రాగానే ఆరోహించి అందరి వీడ్కోలు

అంటుకుంటూ వెళ్ళాడు. దినాల్లో ముగించాల్సిన పనులు క్షణాల్లో ముగిస్తూ అయోధ్యా వాసులు అనుకున్న కాలం కంటే ముందుగానే ఆ నగరాన్ని ఆనంద ధామంగా చేశాడు. నిన్నటి స్థితి మున్నెన్నడూ, ఎలాలేదో, ఈనాటి స్థితి మునుపెన్నడూ రానన్నంత శోభాయ మానంగా తీర్చి దిద్దబడింది. భరత శత్రుఘ్నులు నంది గ్రామంలో నిర్మించిన పర్ణశాలకు వెళ్ళారు. అక్కడవారు ఉషఃకాలానికి ముందేలేచి కాలోచిత కృత్యాలు ముగించుకుని జపతపస్తర్పణాలన్నీ విధి విహితంగా ఆచరించి. పాలూ, పండ్లూ స్వీకరించి ఎనిమిది ఘడియల వేళకు, రాజప్రాసాదానికి వచ్చి. మాతృ దేవతలనందర్నీ దర్శించి. యోగక్షేమాలు విచారించి. తొమ్మిది గడియలు అయ్యేసరికి సభా భవనంచేరి. పన్నెండు ఘడియల వరకూ కొలువు కూటంలోని పనులు నిర్వహించి. తర్వాత పర్ణశాలకుచేరి, ఫలాక్షీరోదకాలతో క్షుదాపూర్తిచేసుకుని, నాలుగు ఘడియలకల్లా, విద్వత్సభలతో, పండిత గోష్ఠులతో పాలుపంచుకునేందుకు పట్టణ ప్రవేశంచేసి, సూర్యాస్తమయ సమయానికి సరయూ కూలం దరకు పోయి, స్నానం, సాయంకాలాహ్నికాలు నవరించుకుని, శ్రీరంగ నాథుని సేవించి. భూతపతిని పూజించి తొమ్మిది ఘడియలకు ఆశ్రమంచేరి. కేవలం జలపానం మాత్రంచేసి శయనార్థంకుశాస్తరణాన్ని ఆశ్రయించటం దినచర్యగా నిర్ణయించుకున్నారు. కాలచక్ర పరిభ్రమణంలో, క్షణాలు, నిమిషాలు, గంటలు, అహోరాత్రాలు, వారాలు, పక్షాలు, మాసాలు, అయనాలు, ఋతువులు వత్సరాలు గడుస్తున్నై. సీతారామలక్ష్మణుల వనవాసంక్షేమంగా పూర్తికావాలని ప్రతిహృదయం దైవప్రార్థన చేస్తోంది. అప్పుడూ, అప్పుడూ, భరతుడు వేగిరావులను శృంగి బేరపురం పంపి గుహునిద్వారా అన్నల క్షేమాన్ని తెలుసుకుంటున్నాడు. గుహుడు తనవార్ని చిత్ర కూటంలోనే వుంచాడు.

## ఋషులు చిత్ర కూటం విడిచి పోవుట

భరతుడు తిరిగి వెళ్ళింతర్వాత రామ లక్ష్మణుల దినచర్యలు సరిగా సాగలేదు. మామగారి మరణవార్త విన్నప్పటి నుంచీ మైథిలి చిక్కి సగమైంది.

లక్ష్మణునికంటే రామచంద్రుడు తండ్రి మరణించినందుకూ, తానా సమయంలో సన్నిధిలో లేనందుకూ ఎంతో దుఃఖించాడు. తమ్మునితో ఆ విషయం మాటిమాటికీ చెప్పి తల్లడిల్లి పోయేవాడు. కాలం బరువుగా గడిచే వేళల్లో సౌమిత్రితో భరతుని గుణగణాలు ప్రశంసించేవాడు. "తమ్ముణ్ణి గురించి నీవు పడ్డ అపోహ తప్పుగదా" అని చెప్పేవాడు. అటువంటి సోదరుడు అనితరలభ్యం అనేవాడు. అన్నింటికి సౌమిత్రి హర్షించేవాడు ఈ రీతిగా కొన్ని రోజులు గడిచినై. ఒకనాడు ఉదయకాలంలో చిత్రకూట పర్వత ప్రాంతంలో తపస్సు చేసుకొనుచున్న తాపసులంతా రాముని పర్ణశాలకు అనతిదూరంలో చేరి వారిలో వారేదో గుసగుసలు పోతున్నారు. మాటిమాటికీ, పర్ణశాలవైపూ, రామునివైపూ చూస్తున్నారు. చేసైగలు చేసుకుంటున్నారు. ఏదేదో చెప్ప దలచుకుని, భయంతో వెనుకంజ వేస్తున్నారు. "పూర్వం వీరంతా స్వేచ్ఛగా వచ్చి, మధుర సంభాషణలుచేసి, ఆతిథ్యం గ్రహించి మర్యాద చూపేవారు. ఈనాడు ఎందుకో వీరి ప్రవర్తనం కొత్తగా వుంది, " అని అనుకుంటూ రాముడు లేచి వారున్న చోటికి వెళ్ళాడు, ఆ మునులంతా కలవరపడ్డారు.

"తాపస పుంగవులారా! రాముడు అభివాదం చేస్తున్నాడు. వచ్చినవారు కుటీరానికి రాక ఇక్కడే వున్నారు. కారణం గ్రహింపలేకుండా వున్నాను. తమ పట్లమేం అపచారం ఏమైనా చేశామా? మీ కోరికలు తిరస్కరించామా? నా సేవలో జానకి మీ పట్ల వుదాసీనత చూపిందా? నా తమ్ముడు భరతుడు వచ్చినప్పుడు పరివార జనంవల్ల మీ కార్యక్రమాలకు అంతరాయం కలిగిందా? అట్టివి ఏమైనా జరిగితే క్షమించి దయతో సెలవీయండి. ఇకముందు అట్టివి రాకుండా జాగ్రత్త పడతాను" అని వినయ విధేయతలతో రాముడు వారిని ప్రశ్నించాడు. ఆ పలుకులు విన్న తాపసులు మరీ వణికి పోతున్నారు. రాముడు వారిలో వృద్ధుడైన మునిని కనుగొని, "స్వామీ! మీ కలవరానికి కారణం ఏమిటి? ఎందుకు సంకోచిస్తున్నారు?" అని గట్టిగా అడిగాడు. ఆ వృద్ధతాపసి, "రామచంద్రా! నీవు ప్రశ్నించిన వేవీకావు మా భయానికి కారణాలు. లోకోత్తర పురుషులైన మీవల్ల అపచారం జరిగితే

సూర్యచంద్రులు గనుకే తప్పరారు. మహాసాధ్వి మైథిలి. ఆమె మా సేవల్లో ప్రవాసినత చూపటం మహాకరమని విషయం. ఇక్కడి మా పరిస్థితిని నీకు ఎలా తెలియచేయటం ?" అని భయపడుతున్నాం. మీవల్ల చిత్రకూటం సేవ్యమానమైంది. మీరిక్కడికి వచ్చి స్థిరనివాసం ఏర్పరుచుకోవటం, భరతాదులు చతురంగ బలసమేతంగా వచ్చి పోవటం, నీవు తాటకా సుబాహులను, అసురదులను వధించటం, పురస్కరించుకుని, మీరు రాక్షస ద్వేషులుగా భావించి, మీకుమేం అనుకూలంగా వుంటున్నామని, రావణుని తమ్ముడు ఖరుడనే రాక్షసరాజు, తనవాళ్ళను పంపించి మమ్ముల నానాహింసలు పెట్టుతున్నాడు. హోమాగ్నుల్లో అప్రశస్త పదార్థాలు తెచ్చి పడవేయటం. చెట్ల చాటున దాగి హఠాత్తుగా పైనబడి కొట్టటం, తిట్టటం, ఒక్కొక్కప్పుడు పదిమందిని కలిపి బంధించి మోకాళ్ళపై దేకించటం, చంపటం చేస్తున్నారు. మేం ఈ బాధలు పడలేం. దూరమైనా, నిర్భరపత్ర పుష్ప సంపచ్ఛతురమై భాసించే "ప్రతనాశ్ర" మానికి ప్రయాణిస్తున్నాం. నిర్మలుడవైన నీకీ సంగతి చెప్పలేకా, మేం వాళ్ళు పెట్టే హింసలు భరించలేకా, నిన్ను విడిచి పోలేకా, ఏం చేయాలో తోచకా, మాలో మేమే సంకట పడుతున్నాం. అంతేకాని మిమ్ముల శంకించికాదు, ఆ దుష్టుడు, నిర్దయుడు, మానవ భక్షుడు, బలవంతుడు, మహాగర్వి. నీ విక్కడ వుండటం క్షేమంకాదు. వాణ్ణి నమ్మరాదు. ఏక్షణంలో ఏంచేస్తాడో చెప్పలేం. నీవు కూడా శ్రమ అనుకోకపోతే మా వెంటరా. ఆ క్రూరుడితో వైరం అపేక్షణీయంకాదు" అని చెప్పాడు.

ఆ వృద్ధుని మాటలకు "మునిచంద్రా! ఇంతకాలం ఈ సంగతి నాకెందుకు చెప్పలేదు? ఈ పాటికి వారి చరిత్ర ముగిసేది. మేం ముని వేషధారులమైనా, ఫలాహారులమైనా క్షత్రియులం. ధర్మస్థాపకులం. దుష్టశిక్షణం, శిష్టరక్షణం మాకు కర్తవ్యం. మాకై మేం హింసకులంకాం. అన్యాయాన్నీ, సాధుహింసనూ సహించం. ఇక మీకుగానీ, మీ ఆశ్రమాలకుగానీ ఎట్టి ప్రమాదంరాదు. చిరకాలార్జితమైన మీ తపశ్శక్తి, వారికై వ్యర్థపరచనక్కరలేదు. మీరు భయం, సందేహం వదలి

యథారీతి ఆశ్రమ ధర్మాలల్లో వుండండి" అని రాముడు ధైర్యం చెప్పాడు. కాని, వారు ముందు అనుకున్న ప్రకారం చిత్ర కూటపర్వతంవదలి వ్రతనాశ్రమానికి ప్రయాణమై పోయారు. కొంతదూరం వారితో వెళ్ళి రాముడు స్వస్థానం చేరాడు.

## సీతారామలక్ష్మణులు అత్రిముని ఆశ్రమానికి పోవుట

పతి పర్ణశాలకు రాగానే జానకి తొందరగా ఎదురుపోయి "స్వామీ! చాలా ఆలస్యం జరిగింది. ఆ తాపసు చంద్రులు ఎందుకు వచ్చారు? వచ్చినవారు మన కుటీరానికి రాకుండా వెళ్ళారెందుకు? వారేవో భీతావహులైనట్లు కన్పించింది. మీరంతగా అంతభయం వారికేం వచ్చింది?" అని ప్రశ్నల పరంపర వర్షించింది. "జానకీ! ఎంత తాపసులైనా, వారికి శరీరంపై ఆసక్తి వుంటుంది. "శరీరమాద్యంఖలు ధర్మసాధనం" అని కదా సూక్తి, ఖరుడనే రాక్షసునిచే వారికి కష్టాలు ప్రాప్తించినై. వచ్చిన కష్టాలుకూడా మనవల్ల వచ్చినవే. ఆ ఖరుడు రావణుని సోదరుడట. మనం రాక్షసులకు వ్యతిరేకులమట. వారి బంధువుల్ని నేను చంపానట. నాకీ మునీశ్వరులు ఆశ్రయం ఇచ్చారట. వారిని హింసిస్తే నేను కల్పించుకుంటాననీ, దానితో పగసాధిద్దామనీ వారివూహ. అందుకే వీరిని నానాహింసలపాలు చేస్తున్నారు. నేనెంత ధైర్యం చెప్పినా, వారు దూరమైనా వ్రతనాశ్రమానికి పోతున్నామని చెప్పలేక చెప్పి పోయారు. నన్నుకూడా రమ్మన్నారు. కాని, నేనందుకు అంగీకరించలేదు" అని బదులు పల్కుతుండే, సౌమిత్రి ఫలజలాలతో పర్ణశాలకు వచ్చాడు. ముగ్గురూ ఆహారం స్వీకరించి, జలపానం సలిపి, ఇంచుక విశ్రాంతి తీసుకుని, తమ్ముడా! ఇక్కడ మన వునికి అంత మంచిది కాదు. అందుకు కారణాలు రెండున్నై.

పరివారంతో భరతుడు వచ్చి మనం వున్న ప్రదేశం చూచి వెళ్ళాడు. ముందు ముందు మనకోసం భరతుడుగానీ, పౌరులుగానీ తరచు రావటం జరుగుతుంది. ఇది మొదటి కారణం. స్కంధావారం విడిదిచేసిన ప్రదేశమంతా అపరిశుద్ధంగా మారిపోయి దుర్వాసనాపూరితమైంది. మౌనిజన సంరక్షణం, దుష్టరాక్షస భక్షణం జరుగవలసి వుంది.

అందుకు ఈ స్థలం అక్షమైందిరాము. కనుక మనం దీని విడిచి పోవటం నాకు సమ్మతం, ఇది రెండవ కారణం" అని పలికి "ప్రయాణ ప్రయత్నం చేయి" అన్నాడు రాముడు. లక్ష్మణుడు ఆ వాక్యాలు ముగియక మునుపే, వెంటరాని పోదగినవన్నీ చేర్చి తాను కొన్ని అన్నకు కొన్ని భాగించి సిద్ధమైనాడు. పూర్వం వలెనే సీత మధ్య నడువగా లక్ష్మణుడు ముందూ, రాముడు వెనకా నడువసాగారు. మధ్యాహ్న వేళకు అత్రి మహర్షి ఆశ్రమం చేరుకున్నారు. ఆ మహా మూర్తి దర్శనంతో అన్ని విచారాలూ అదృశ్యమైనై. అందరూ ఆయనకు ప్రణమిల్లారు. వారిని పుత్రనిర్విశేషంగా ఆదరించి, ఆతిథ్యం ఇచ్చి ఆశీసుల కావించాడు. ఇంతలో ఆది దంపతులైన పార్వతీ పరమేశ్వర కల్యాణ సమయంలో హారతి పట్టిన ముసలి ముత్తైదువ అనసూయ వచ్చింది. ఆమె రాగానే సీతను చూపిస్తూ, "ఈ సాధ్వి జనక రాజర్షి పుత్రిక. పేరు జానకి. ఈమెను యథోచితంగా సత్కరించు" అని అర్ధాంగితో చెప్పి, "రామా! ఈమె నా ఇల్లాలు. అనసూయ్య కోప సంత్యక్త. విరచితనిజకర్మ కోటిచే ఈ హోదా పొందింది. ఒక్క వానచినుకైనా లేక నరజీవ సంతానం దగ్ధమై పోతుంటే తన తపశ్శక్తిచే కందమూల ఫలజలాలు కల్పించి పది సంవత్సరాలు జీవరక్షణం చేసింది. పదివేల వత్సరాలు గంగా తీరంలో నిరంతరాయంగా మహా తపస్సు చేసింది, దేవతల ప్రార్థనపై పది రాత్రిళ్ళను సూర్యోదయం కాకుండా ఏక రాత్రంగా చేసింది. త్రిమూర్తులను దత్తత తనయుల్నిగా చేసుకుంది. ఈమె సర్వభూత నమస్కారార్హ. సాధుశీల. నీ అర్ధాంగిని ఆమెకు మొక్కించు" అని చెప్పాడు. వెనువెంటనే రాముడు "జానకీ! విన్నావుకదా మహర్షి మాటలు? సిగ్గుపడక అపరమ సాధ్వీలలామ పాదాభి వందనంచేసి, ఆశీస్సులు అందుకో" అన్నాడు. పతివాక్యం ఆలకించిన సీత, సతీత్వం రూపుగొన్న అనసూయాదేవిని కాంచి పరమభక్తితో ప్రణామాంజలి సమర్పించింది.

## అనసూయ సీతకు హితోపదేశం చేయుట

ముడుతలుపడిన శరీరంతో, పండిన ముదిమితో, పాండురవర్ణంతో, గాలికి కదలే కదళీ వృక్షంవలె వణకుతున్న కాయంతో, ముగ్గుబుట్టవలె

నున్న తలవెంట్రుకలతో. పతివ్రతాత్వం ప్రత్యక్షమైనట్లు మైథిలి కన్నులకు అనసూయ గోచరించింది. ఆప్రశాంతవదనమూ. అనురాగం కురిసే అక్షులూ, అమృతం చిందే ఆవాక్కులూ, మహిళాలోక మాణిక్యంవలె ఆమె సీతను అలరించింది. మృదువైన జానకి పాణిపల్లవస్పర్శతో పరమానందభరితురాలైన అనసూయ సీతను గాటంగా కౌగిలించుకుని, తల్లిబిడ్డనువలె ముద్దాడి చెంపలుపుణికి, తలవెంట్రుకల చక్కచేసి " తల్లీ! ఎంత పుణ్యశీలవే. కఠిన కర్మకు పక్రమించి, కానలకువచ్చిన కాంతునితో, కలుములకాలద్రోచి, పరమమైన సుఖాలను భంగించి, ఎండసోకని కోర్వని మేనినికూడా లెక్కచేయకుండా, కలిసివచ్చిన నీవంటి కాంతాలలామలు ఇంతవరకు కనుపించలేదు. సావిత్రీ, చంద్రమతీ, సుమతులను మరపించావు. అరుంధతీ, శాంతలకు అచ్చెరువుకొలిపావు. పట్టణవాసివైనా, వనవాసివైనా, గుణియైనా, నిర్గుణుడైనా, ధనివైనా, ధనహీనుడైనా, కోపియైనా, పాపియైనా, మగనాలికి మగడే సుగతికిమూలం. అతడేదైవం.

సర్వవిధాలా సంరక్షించే భర్తకంటే బంధువులేడు. కడుపులో నీరు కదలకుండా కాంత, పతిసుకృత ఫలంలో అర్ధం కరగత బదరీ ఫలంవలె అనవరోధంగా అనుభవిస్తుంది. మగనాలులైనా రాగలు మగనిసేవలోగల మహత్తు గ్రహించక, పరుషవాక్యాలతో బాధిస్తారు. స్వల్పవాంఛలకై సాధిస్తారు. నెరవేర్చేదాకా వేధిస్తారు. అసత్యాలను అర్ధవంతంగా బోధిస్తారు. పతిని నిర్లక్ష్యంచేసి, నితాంత లతాంతశరార్తితో ఇచ్ఛవచ్చినట్లు విహరించేవారూ, భర్తను శాపించేవారూ, చీటికీ మాటికీ, జీవితేశ్వరుణ్ణి చెడ్డవాక్యాలతో చిత్రహింస చేసేవారూ,ఏగతిపొందుతారో. ఎంతెంత బాధలు పడతారో తెలుసుకోలేరు. కన్నులకు పొరలుకమ్మే యౌవనకాలంలో మతిచెడి తిరిగి. గతిచెడి కొంపచేరి, అపనిందలతో. అపహాస్యాలతో ఆరడిపాలవుతున్నప్పుడు, చేసినపనులకు సిగ్గుపడి. "చేతులుకాలినతర్వాత ఆకులు పట్టుకు"న్నట్లు చెంపలువేసుకుంటారు. పాసినకూడు పక్వానికిరానట్లు, చెడినజీవితాలు శ్రేయస్సును పొందలేవు. భారతనారీధర్మం పవిత్రమైంది. క్షణికమైన సుఖాలకోసం కాక, శాశ్వతమైన కీర్తిప్రతిష్ఠలకోసం, విశుద్ధ సంతానార్థం, వైవాహికధర్మం ప్రభవించింది. ఇహ పరసాధనమైన ఈ పవిత్రానుబంధం

ఇదువరకే చెప్పబడింది. కొన్ని అనివార్యకారణాలవల్ల పురుషునకు బహుభార్యాత్వం చెప్పినా, శాస్త్రం ప్రధానంగా భావించిన భారతవర్షం స్త్రీని పతిశుద్ధంగా వుంచింది. గ్రామంలో పానార్హమైన తటాకంవుంది. దానికి జలసమృద్ధి గూర్చేవారి అపరిశుద్ధమైతే ఆజలంకూడా అపరిశుద్ధంగానే చెరువులో చేరుతుంది. ఆచెరువు పానయోగ్యం కాకుండా పోతుంది. అవిధంగానే ధరించేస్త్రీ పవిత్రంగా వుండాలని వేదమాత భావించింది. అమ్మా! పెద్దదాన్ని కనుక ఏమేమో చెబుతున్నాను. కస్తూరినిచ్చే మృగానికి అన్యమృగాల ఆశ్రయం పనిలేదు అసలేఅయోనిజవు. జనకుని దత్తపుత్రికవు. దశరథునికోడలవు రాముని పత్నివి. నాకు తెలియకకాదు. నీకు తెలియదనికాదు. నేను ఇంతకంటే ఏంచెప్పలేనుకనుక లోకాచారంగా చెప్పాను. నీవేమి అనుకోవద్దు. ముసలివాళ్ళకు బుద్ధిభ్రంశం వుంటుంది" అని చెప్పింది.

## అవనిజ అనసూయ వాక్యాలకు ఆనందించుట

ఆప్యాయంగా చెప్పిన అనసూయ మాటలకు అవనిజ ఎంతో ఆనందించింది. "అమ్మా! నన్నెంత పెద్దచేశావు? మీకు అంతకంటే మించి ఎలా చెప్పలేరో. నేనూ. అంతకుమించి ఆలించలేను. నీవంటి మహాతపస్వివి, భర్తచే ప్రశంసలు పొందుతున్న పరమసాధ్వి, పాతివ్రత్య ధర్మానికి ప్రాణం పోసిన శీలవతి? త్రిదేవులచే, పతిభిక్ష అర్థింపచేసిన పరమపావని, భర్త దైవం అని చెప్పక ఏం చెబుతుంది? ఆమాట ఎవరుచెప్పినా, ఎన్నిసార్లు చెప్పినా. మానవతికి మనోహరమైందీ, మంగళప్రదం అయిందీ. భర్త గుణహీనుడూ దుష్టుడూ అయినప్పుడు సహచరించేదేమిటి. నాభర్త త్రిలోక పూజనీయసద్గుణసంపన్నుడు. ఏకపత్నీవ్రతుడు. రూపంలో.. (పుంసాం మోహన రూపాయ") "సిగ్గుపడకావెందుకే తల్లీ! నాకుతెలుసు. మదనవిజయ మన్మధుడు కాదటే" అని వృద్ధ అనగానే, సీత తలవంచుకుని. ఔనన్నట్లు తలవూపి, అనుకూలుడైనవానిని ప్రేమించటం, అనుసరించటం, ఆరాధించటం ఏమంత చెప్పుకోదగింది. దుష్టరోగి, క్రూరకర్ముడూ, నీచకాముకుడూ, నిర్లజ్జుడూ అయిన పతిని జగత్పూజ్యునిచేసిన సుమతిదేవిని, భ సుందర పాదాంకస్థ

డైన పతిని, ప్రేతపతినుండి పొందిన సావిత్రీదేవినీ, గంగా కల్మష పరిహారం, కమలా సతీ వాడీ ధర్మ ప్రదానం చేసిన అనసూయాదేవినీ ఆరాధ్య దేవతలగా, అరిషడ్వర్గ విజేతలగా భారతనారి భావించి తరిస్తూంది. అటువంటి ఇల్లాండ్ర కథ ఆదర్శప్రాయమైందీ, చెప్పుకోతగింది. "తల్లీ ! ఎంత మధురంగా మాట్లాడావే. ఇకముందు నీవు పేర్కొన్నవాళ్ళ పేర్లల్లో నీ పేరుకూడా చేరుతుంది. ఆ విధంగా జరిగితీరాలని ఆశీర్వదిస్తాను" అని నొసట కుంకుమబొట్టు పెట్టి "అనవృశ భర్తృప్రణమైక ప్రాప్తిరస్తు. దీర్ఘ సుమంగళీ భవ. త్వచ్చరిత్రం జగదా దర్శకం భవతు" అన్నది. సీతకు నేత్రాంచలాల్లో ఆనందాశ్రులు చిందినై. "అమ్మా ! నీ అపార ప్రేమకు పాత్రురాల నైనందుకు ఆనందిస్తున్నాను. నీ కృపవల్ల నా జన్మ చరితార్థ మైంది. ఎప్పుడూ పూజ్యుల దర్శనం వ్యర్థం కాదు. మీ దంపతుల దర్శనం చేసూర్చి నా భర్త ఎంతో మేలు చేకూర్చాడు. ఈ ఉత్తమధర్మాన్ని వివాహసమయంలో తల్లీ, విడిన ప్రయాణ సమయంలో అత్త నొక్కి చెప్పారు. నీవిప్పుడు బలం చేశావు. తారాపతిని రోహిణి ఎడబాయనట్లూ, జగద్బాంధవుణ్ణి ఛాయ వీడనట్లూ, నేనూ నా భర్తను ఎదలను. అన్ని సమయాలల్లో అనుకూలవతిగా నడుచుకుంటాను. నీ ఉపదేశం శిరసా వహిస్తాను" అని వినయవినమితోత్తమాంగయై విన్నవించింది.

## అంగరాగా లిచ్చిన అనసూయకు సీత తన స్వయంవర గాథ చెప్పుట

ఆ మాటలకు ఆనందించిన అనసూయ, జానకిని దగ్గర చేర్చుకుని, "తల్లీ! నీ మనోభీష్టం ఏదైనా చెప్పు, తప్పక నీకు ప్రసాదిస్తాను" అంది. "అమ్మా ! నీ అనుగ్రహబలంవల్ల ఆత్మేశుడు స్వస్థుడై వున్నంతకాలం నాకేం కొదువలేదు. కోరతగిన కోర్కెలూ లేవు. మీ ఆదరణ వుంటే అంతే చాలు" అని సీత అన్నది. "బాగున్నది తల్లీ, బాగున్నది. నీవు కోరకపోయినా, నా ఆశీస్సు ఫలించేలాగా నేనే ఇస్తాను. ఇవి మాల్యాలు, ఇవి వస్త్రాలు, ఇవి ఆభరణాలు, ఇవి అంగరాగాలు, ఇవి విలేపనాలు.

తీసుకో. ఎన్నటికీ ఇవి వాడిపోవు, నలిగి మాసిపోవు. అపహరణకు అందవు, వాసనలు వట్టిపోవు. దేవతాసంబంధమైనవి, నీకు తగి వుంటై. ఇవి నీవు ధరిస్తే, శోభాలలితదేహవై, మంగళదేవత మహావిష్ణువునువలె అనురాగపాత్రమవై నీ పతిని అలరిస్తావు" అని ఇచ్చింది. సీత ప్రదక్షిణ పూర్వకంగా నమస్కరించి గ్రహించింది. తర్వాత వృద్ధతాపసి, రామ పత్నితో, అమ్మా! నీ స్వయంవరాన్ని కూర్చి మీ తాతయ్య చెప్పారుకాని వివరంగా వివిపించలేదమ్మా" అంది.

"అలాగా అవ్వా! అయితే చెపుతా విను. నా తండ్రి జనకభూపతి యజ్ఞం నిమిత్తం నేల చదును చేయటానికీ, అందులోని దోషాన్ని పరిహరించటానికీ దున్నిస్తున్నాడట. నాగటికర్రు నేల పగులకొట్టుకుంటూ పోతుంటే నేను విరిగిపడినమట్టిపెళ్ళవెంటబయటపడినానట. అప్పుడు తండ్రి నా శరీరంమీద వున్న దుమ్ము దులిపి, ఆశ్చర్యానందాలు పొంది ఒడిలోకి చేర్చి "ఈ శిశువు నా పుత్రిక" అని అన్నాడట. ఆకాశవాణి "ఈమె నీకు నిజమైన బిడ్డే" అని అన్నదట. ఆ పలుకుల ఆలకించి "సీత" అని నామకరణం చేసి జ్యేష్ఠ పత్నికి ఇచ్చారట. ఆమె అప్పటికప్పుడు మాతృదేవతగా మారి నన్నుంచుకుని స్తన్యం ఇచ్చిందట. కాలక్రమంగా భర్తృయోగ సులభమైన ప్రాయం రాగానే, నిర్ధనుడు ధనసంపాదనకై చింత చేసినట్లు, వరునికోసం నా తండ్రి తపిస్తూ వుండేవాడు. "వియ్యం అందిన చోటినుంచి ఏవేవో వంకలూ, శంకలూ, ఆవేశాలూ, కావేశాలూ వస్తుంటై. ఈ బిడ్డను ఎవరి చేతుల్లో వుంచాలా?" అని సముద్రతరణానికి ప్లవహీనుని విధంగా విచారిస్తూ, స్వయంవరం ప్రకటించాడు.

ఆ ప్రకటన వార్త నలుదిక్కులకూ వ్యాపించి రాజలోకం మిథిలా నగరం చేరింది. ఆ మహాసభలో నా తండ్రి తమకు అధ్వరవేళ ప్రచేతసు డిచ్చిన ధనువునూ, అక్షయాశుగ సమూహం చూపించి "ఈ విల్లు ఎక్కు పెట్టిన వీరుడే నా పుత్రికకు నాధుడు అవుతాడు" అని చెప్పారు. వచ్చిన వారంతా ప్రయత్నం చేసీ, చేయకుండా స్వీయదేశాలకు చేరుకున్నారు. కాలం గడుస్తున్నది, మళ్ళీ నా తండ్రి యాగం తలపెట్టాడు. దానికి, దేశ దేశాలనుంచి ఎందరో మహానుభావులు దర్శనార్థమై వచ్చారు. సకల

శోభాయమానంగా క్రతువు సాగిపోతూంది. దైవవశాత్తు తాపసశ్రేష్ఠుడైన గాధేయుడు దాశరధులతో చనుదెంచాడు. నా తండ్రిచే సత్కృతుండై, "జనకభూపతీ! లోకప్రసిద్ధంగా జరుగుతున్న అధ్వరం చూశాం. చాలా సంతోషించాం. ప్రభువులైనవారు తరచు యజ్ఞాలు చేస్తుండటంవల్లనే జగతి ఈతిబాధలు లేకుండా సస్య సమృద్ధి కల్పిస్తూంది. మా వంటి జడదారులు సంకల్పిస్తే ఎన్నో అవాంతరాలు ఆక్రమిస్తై. నేను తలపెట్టిన క్రతువు ఎన్నోసార్లు విఘ్నమైందంటే ఇక చెప్పవలసిందేమిటి? ఈ రాజపుత్రుల సహాయంతో ఇప్పటికి పూర్తిచేయగలిగాను. ఆ యాగానికి వచ్చినవారంతా ఇక్కడికి వస్తూ నన్నుకూడా రమ్మని కోరారు. మా శిష్యులకు వీర్యశుల్కంగానిర్ణయించి శివధనువును చూపించవచ్చుననీ, పూజ్యుణ్ణి విన్నా, నీ క్రతువును చూడవచ్చుననీ వచ్చాం. అభ్యంతరం లేకపోతే మా శిష్యులకు చూపించు"మని అడిగాడు. అతికష్టంమీద చాపంక్రతుశాలకు తెప్పించగానే, మహర్షి "రామా! లేచి చూడు" మనగా, మదకరి వలె వెళ్ళి వామహస్తంతో ధనువు ఎత్తి గుణం సంధించబోతుంటే అశనిపాత ఘోషణంతో పెళ్ళున రెండుగా విరిగింది. అంతట నా జనకుడు అన్నమాట ప్రకారం నన్ను ఆయనకు ధారాదత్తం చేయటానికి జలకుండిక గ్రహించాడు. తండ్రి అంగీకారం తర్వాత గ్రహిస్తానని జలగ్రహణం చేయలేదు.

ఆయన కోరికప్రకారం అయోధ్యకు శుభలేఖ పంపించి మామగారిని ఆహ్వానించాడు. ఆమహారాజు సబాంధవంగా తరలిరాగా, ఆయనసమక్షంలో నన్ను జ్యేష్ఠునకూ, నాచెల్లెలు ఊర్మిళను ద్వితీయునకు ఇచ్చి వివాహం జరిపించాడు. ఆవిధంగా వారికి ధర్మపత్నినైనాను" అని చెప్పింది.

## అనసూయ సీతకు సాయంకాలం వర్ణించి చెప్పుట

జానకి తనస్వయంవర వృత్తాంతం చెపుతుంటే అనసూయ ఆశ్చర్యంతో ఆలకించింది. ఎంతో సంతసించింది. సంచిట గవించి ఒడలంతానిమిరింది "తల్లీ! నీమాటలు ముద్దువస్తున్నై. నీ స్వయంవరగాథ చాలా చిత్రంగా వుంది. నీవు కారణజన్మురాలవు. నీగాథ వింటుంటే కాలాతిక్రమణం

కనుపించలేదు. సంధ్యాసమయమైంది. చీకట్లు క్రమ్ముకున్నై. మేతకుపోయి
న పులుగులు కలకలధ్వనులు చేస్తూ గూళ్ళకు చేరుకుంటున్నై. పిల్లలు తల్లు
లరాకకు సందడి చేస్తున్నై. అభిషేకం నిమిత్తం, మునులు స్నానంచేసి
తడినారగుడ్డలతో కమండలాల్లో జలంతీసుకుని వస్తున్నారు. హవిస్సులు
విధివిహితంగా ఋషులగ్నిహోత్రాలలో హుతం చేస్తున్నారు. ఆజ్యాహుతితో
ధూమం అగ్నికుండల్లోంచి లేస్తోంది. ఆధూమం మారుత సంచారంతో
దిక్కులకు చెదిరిపోతున్నది. తొగరెక్కమెదల జిగితో పావురాళ్ళు గుడు
గుడు కంఠస్వరాలతో అటుఇటు తిరుగుతున్నై. దూరంగా వున్నప్పటికీ,
పలచగావున్న ఆకులతో కూడిన చెట్లు ఈచీకట్లకు దట్టంగా ఆకులు వున్నట్లు
కనిపిస్తున్నై. దిక్కులన్నీ మాసిపోయినై. రాత్రిళ్ళు తిరిగేమృగాలు స్వే
చ్ఛాసంచారం చేస్తున్నై. తాపసుల పెంపుడు లేళ్ళు వేదికలకు ప్రక్కగా
పడుకున్నై.

రాత్రి చాలా గడిచింది. ఆకాశం నక్షత్రాలతో వెలుగుతూంది. చంద్రికా
ధవళవస్త్రధారిణియై నిశాంగనా గృహప్రవేశం చేశాడు సుధానిధి. ఇకనీభర్త
సన్నిధానానికి వెళ్ళు. నిన్నుచూస్తూ, నీతో ముచ్చటలాడుతూ తృప్తిగా కాలం
గడిపాను. నేనుమీతాతయ్యకు కావలసిన వుపచారాలు కల్పించేనిమిత్తం పోతా
మ ఓక్కా! నేనిచ్చినవస్త్రాలు ఇక్కడే కట్టుకో. ఆభరణాలు పెట్టుకో. గంధమా
ల్యాదులు ధరించు. కన్నారా చూస్తూ నిన్ను సాగనంపుతాను అని చెప్పింది."
ధరణీజాత సంతృప్తినంది అన్నీ అక్కడే ధరించి నమస్కరించింది. అనం
తరం ఆత్మేశుని సన్నిధిని అరిగింది. అలంకార సహితంగా వచ్చిన
ఆత్మసతిని చూచిరాముడు మిక్కిలి సంతోషించాడు. జానకి జరిగిన సం
గతులన్నీ చెప్పి. ఆమె ఇచ్చిన అలంకారాల ప్రాశస్త్యాన్ని తెలిపి, ఆమె
చేసిన ఆశీర్వాదం వివరించి ఆలరించింది. మానవ దుర్లభం అయిన
మానిత సత్కారాన్ని చూచి రామ లక్ష్మణులు సీత అదృష్టానికి పొంగి
పోయారు. అత్రి మహర్షి కూర్చిన ఆతిథ్యం స్వీకరించి ఆ రాత్రి గడిపారు.

వేకువ కాగానే కల్య విధులన్నీ ముగించి ముని తల్లజాలకు
మ్రొక్కి, "మాకు ముందరిగే మార్గం చెప్పుడని కోరారు. వారు "రామ
చంద్రా! ఇక ముందంతా దండకారణ్యం. రాత్రించరుల కాటపట్టు.

వాళ్ళంతా దుర్మార్గ చరిష్ణువులు. భయంకర రూప సంపన్నులు. మానవాశనులు మీరు పోవద్దు. మీ రాకచూచి వాళ్ళు మమ్మల్ని మైలపరచి, చిత్రహింసలు చేస్తారు. నీవు ధర్మ కర్మ రక్షకుడవు. నిన్నేం చేయలేరు. నీవు దండకకు పోవ నిశ్చయించుకున్నావు కనుక, మమ్మల్ని ఈ వుపద్రవం నుంచి కాపాడు పండ్లకూ, పర్ణాలకూ, సమిధలకూ మేం పోయి వచ్చే మార్గం ఇదే. మీకు కూడా ఇదే మార్గం: పోయిరండి. మీకు సర్వ శుభములు కలుగుగాక." అని అంజలి బంధంగా ఆశీర్వదించారు. వారి మంగళాశాసనాలను గైకొని, మౌనులు నిర్దేశించిన మార్గంగుండా దండకారణ్యానికి సీతా రామలక్ష్మణులు తరలి వెళ్ళారు.

## శ్రీరాముడు దండకారణ్యం ప్రవేశించుట

ఆప్రవాసులు, దారికిరువైపుల దట్టంగా వున్న చెట్లనూ, పొదలనూ చూస్తూ, మధ్య మధ్య మార్గాయాసం తీర్చుకుంటూ, మధ్యాహ్నం వేళకు తాపసాశ్రమ ప్రదేశం సమీపించారు. హోమధూమం కనిపిస్తూంది. ఆజ్య ధారా సంబంధమైన వాయువు ఘ్రాణ తర్పణం చేస్తూంది. వేదపఠనం శ్రవణేంద్రియాలకు సార్థక్యంగలిపిస్తూంది. చూడవచ్చిన సురకాంతల ఆటల పాటలతో, అర్చావిధానాలతో హర్షం కలిగిస్తూంది. అగ్నితో ప్రకాశించే వేదికలూ, స్రుక్స్రువాలూ. జలకుండికలూ, దర్భాసనాలూ, నారవననాలూ, దర్భలూ, సమిధలూ. కందమూల ఫలాలూ, క్రమబద్ధంగా వున్న ఆకుటిళ్ళూ. హరిణమయూర కీరశారికాది సాధు జంతువులూ, ఫల పుష్ప భరితమైన పాదపాలూ కలిగి నేత్రోత్సవం. మనోల్లాసం కలిగించే ఋషి వాటిక ప్రవేశించారు. ఫలమూలాశనులూ. దాంతులూ, కాషాయ కౌపీనాంబరధారులూ, సూర్యాగ్ని తేజులూ. నిష్కాములూ. శ్రుతిదర్శనులూ. ఉపనిషద్రష్టలూ, విరాగులూ పరివేష్టించియున్న ఆశ్రమవాసులంతా వీరి ఆగమనానికి హర్షం వెలిబుచ్చుతూ, ఎదురేగి తోడ్కొనివచ్చి ఆతిథ్యం ఇచ్చారు. అనంతరం వారి ఆగమనాన్ని గూర్చి అడిగారు. వివరంగా విన్న తర్వాత వారి వృత్తాంతం వినిపించారు, వారి జగన్మోహనాకారాలు ఆపోవని

చూపులతో త్రాగారు. అందులో శ్రీరామచంద్రుని మూర్తి వారికి చెప్పలేని ముదం చేకూర్చింది. అందరూ ఆదరంతో వారి వారి పర్ణకుటీరాలకు ఆహ్వానించి యథాశక్తి సత్కరించి వారికి గల ఆదరం ప్రకటించుకున్నారు. అంతటి సౌహార్దం, అంతటి అభిమానం రామచంద్రుణ్ణి విస్మితుణ్ణి చేసింది. లక్ష్మణా! అల్పమాత్ర పరిజ్ఞానం గల మానవులు, అసూయాహంకారాలతో సర్వజ్ఞులమనీ, సాటిలేని వారమనీ భావించి లోకానికి ఎంతో హాని కల్పిస్తారు. ఈ మహానుభావులు సంసార సుఖాలు పరిత్యజించి, కామ క్రోధాదుల నిర్జించి, శరీరధారణ మాత్ర పర్ణ ఫల వాయు జల భక్షకులై. వేల వేల వత్సరాలు. గృహారామాలు, సిరిసంపదలు. అధికార భోగాలు అన్నీ వదలి అడవుల్లో, క్రూర మృగాల మధ్య. రాత్రిందివాల నడుమ, శీతవాతాతపాలను గణింపక తపస్సు చేస్తున్నారు. యజ్ఞాలు చేస్తున్నారు. అతిథులను ఆదరిస్తున్నారు. వీరిలో ఎంతెంత శక్తిమంతులున్నారు? వీరంతా ఏం కోరి ఈ విధంగా చేస్తున్నట్లు? వీరివల్ల, వీరి కర్మలచేత లోకానికి వచ్చే మేలేమిటి?" అని అజ్ఞులు కొందరనుకుంటూ వుంటారు. వారివల్ల కలిగే ప్రయోజనం ఏమిటో వారికే అర్థం కాదు. సంఘాభివృద్ధి జరుగుతున్నది వారివల్లనే యని అనుకుంటారు. కలసి జీవించటం చేతకాని వారికీ, మనసులో ఒకటీ, మాటలో ఒకటీ, చేతలో ఒకటిగా బ్రతికే ఆక్షేపకులకూ, ఈ సర్వసంగ పరిత్యాగులకూ సంబంధం ఎక్కడ? కేవలం కలసి బ్రతకటమే ఘనకార్యం అయితే పశుపక్షి మృగాలు జీవించటం లేదా?

మనం ఏదైనా ఒక కార్యం సాధించాలంటే ఎంతోకాలం పడుతుంది. ఎందరో ఎదుర్కొంటారు. ఎన్నో విఘ్నాలు వస్తై. ఇంత చేసినా ఫలితం అనుకూలంగా వస్తుందో, ప్రతికూలంగా వస్తుందో తెలియదు. ఈ పరమ పూజ్యులు సంకల్పమాత్రంగా సాధిస్తారు. మాట మాత్రంగా అనుగ్రహిస్తారు. నిజంగా వీరిచేతనే సృష్టి పరిపుష్టమై. క్రమబద్ధమై నడుస్తోంది." అని రాముడు తమ్మునితో అన్నాడు. అందుకు సౌమిత్రి. "ఔనన్నయ్యా" అన్నాడు, ఈ విధంగా సీతారామలక్ష్మణులు ఆ ఋషి వాటికలో ఆ రాత్రి ఆనందంగా గడిపారు. అనేక ధర్మ సూక్ష్మాలు తెలుసుకున్నారు, కైకేయీ దశరథులు చేసిన కార్యం సాపేక్షం కాకపోయినా సకారణంగానే జరిగింది.

దానికి విచారించటం తగదనీ, దైవనిర్దిష్టం కాబట్టి ధర్మమేననీ వారివల్ల గ్రహించారు.

## మునులు శ్రీరాముని తమ్మురక్షింపుమని ప్రార్థించుట

సూర్యభగవానుడు నిద్రా ముద్రితమైన లోకాన్ని, తేజస్వంతమూ, చైతన్యవంతమూ, శక్తివంతమూ అయిన తన అనంతకిరణ హస్తాలతో తట్టి లేపాడు. ఆ సుఖస్పర్శతో మత్తూ, మైకం వదలి ప్రాణికోటి నిత్యకర్మలలో నిమగ్నం అయింది. మహర్షులతోపాటు మేల్కొని, జరుపవలసిన విధులన్నీ జరిపి వారిని చేరి అభివాదంచేసి పోవుటకు అనుజ్ఞవేడారు. అందరూ ఆశీర్వదించారు. కలిసి కట్టుగా "రామచంద్రా! నీకు మేం నమస్కరించటం మేలుకాదు. నీరాక దేవతలకు ఎంతో ఇష్టం, వారి కోరికలు తీర్చుకుంటానికి నిన్ను సర్వశక్తి సంపన్నుణ్ణిచేశారు. నీవికదండకారణ్యంలో ప్రవేశిస్తున్నావు. ఇప్పటినుంచి నీకార్యక్రమాలు విస్తృతరూపంలో వుంటాయి. ఈమహారణ్యం ఖరదూషణ రాక్షసరక్షితం. వాళ్ళు బలవిక్రమాల్లో సాటిలేని మేటులు. మోసం వాళ్ళకు ముఖ్యం. క్రౌర్యం వాళ్ళసుకార్యం. మాయవాళ్ళకు మనుగడ. ఎప్పుడుఏరూపంధరిస్తారో, ఎందుకుధరిస్తారోఎవరికీ తెలియదు. మేంనిరంతరం వాళ్ళబాధలకు గురిఅవుతున్నా సహిస్తున్నాం. మేం లోకహితకార్యచరణకు కంకణంకట్టుకుని కామక్రోధాదుల నిగ్రహించికానల్లో వుండి దైవదర్శనానికి తపస్సు చేస్తున్నాం. కనుక, శక్తివున్నా దండనీతి మాకు తగదు. ఆగ్రహం అంతకుముందే పనికిరాదు. ఎంతో శ్రమపడి సంపాదించినశక్తులు మాటిమాటికీ వ్యర్థంచేయకూడదు. అందుకు మీగురువులు విశ్వామిత్ర మహర్షులే సాక్ష్యం. మేం రాజును రక్షిస్తాం. రాజు, సాధుహింస జరగకుండా చూడటం ధర్మం. బలహీనులనూ, బలవంతులనూ, పేదలనూ, ధనవంతులనూ, పండితులనూ, పామరులనూ సమంగా, సామరస్యంగా సంఘంలో జీవించేలాగా చేయటంకోసమే క్షాత్రం ప్రధానంగా ప్రభువులను ఏర్పరిచాం. మేం మీపాలనలో నున్నవాళ్ళం. అడవుల్లోవున్నా అంతఃపురాల్లోవున్నా, ముందుగా మునికోటిని రక్షించటం రాజునకు కర్తవ్యం. ఇంద్రునిశక్తిలో నాల్గోవంతు ప్రభువునకు సంక్రమింపచేశాం. అందు

కు తగిన నియమ నిబంధనాలనే స్మరించాం. వాటి ఆధారంగా ప్రభువు ప్రవర్తించి ప్రజలను పాలించాలి. దాశరథీ! నీకు ధర్మం చెప్పవలసిన పనిలేదు. నీరాక ఆగమనంతో అన్ని అరిష్టాలూ పోయి లోకక్షేమం కలుగుతుందని ఆశిస్తున్నాం" అని విన్నవించుకున్నారు. రాముడు వినయ విధేయతలతో "మీ ఆదేశం శిరసావహించి ఆచరిస్తాను రాక్షసోపద్రవం రాకుండా చూస్తాను. అట్టివేదైనా ఎక్కడ జరిగినా, నాకు తెలియచేస్తే వెంటనే నివారణ చేసి ఆశ్రమాలను రక్షిస్తానని మాట ఇస్తున్నాను."

## దండకారణ్య వర్ణనం

అని వారివద్ద సెలవు తీసుకున్నాడు. సౌమిత్రి చాపధరుడై ముందు నడుస్తున్నాడు. నడుమ జానకి నడుస్తున్నది. వెనుక కోదండ మండితుడై రాముడు నడుస్తున్నాడు. నాల్గు గడియల కాలం గడిచేసరికి, మేఘ గర్భంలో ప్రవేశించిన భానుమంతుడులాగా, దారుణ దానవ వదన గహ్వరం అయిన దండకారణ్య ప్రదేశంలో ప్రవేశించారు. ఆకసం అంటపెరిగిన వెదురు పొదళ్ళనుండి పండివాలిన ఒయ్యారపు రాసులపై దండుగట్టి పోతున్న ఎలుకల గునగునలకూ, కిచకిచలకూ, డెందం ఆనందంతో నిండిన పిల్లులు, ఆ రాసులకు రక్షగా కాపుంచిన భటుల్లాగా పొంచిపొంచి దూకుతూ, తగ్గుతూ హింసిస్తుంటే, ఆ అడవి మార్గాలను చూచి దూరంగా చెంగనాలు తీస్తూ, గుంపులై కొలువుసారిస్తూ, పెద్దగాలికి భూమిపై రాలుతున్న పూవులవలె మనోహర నేత్రాలు త్రిప్పుతూ, శృంగాగ్రాలతో ఒకదానితో మరి ఒకటి ఒరుస్తూ, కన్నుల పండగ చేస్తున్న లేడి కొదమ మందల తరుమటం మాని సహజ శత్రుత్వం సార్థకంగా వెన్నంటుతూన్న వేటకుక్కలూ, ఆ కుక్కల పిక్కబలం అడుగంట నడుమమారి, పెక్కు చిక్కులు పెట్టుతూ, దక్కినట్లుగా అగపడి, దక్కక, చిక్కినట్లగపడి చిక్కక, దారి తప్పించి దూరంలాగి పిల్లల ప్రాణం కాపాడి కనుప్రామి, బొరియల్లో దూరుతున్న టక్కరి నక్కలతో చిక్కనైన ప్రదేశాలు ఒక ప్రక్కనూ, పర్వత గర్భాల నుంచి బయలు వెడలి భూమికి దిగు వెలయేళ్ళు, అంచంచు అంతర్వాహాలై ప్రవహించి, మళ్ళీ

మిఱ్ఱుగానున్న చోట్ల పైకుఱికి ఒక్కసారి హఠాత్తుగా పాతాళందాకా క్రిందికి దిగుతున్న కారణంచేత వచ్చే ధ్వనులు సజల జలధర సంఘర్షణంలో వచ్చే ఉరుమువలె చెవులకు బధిరత్వం కల్పిస్తుండే, ఆ గంభీర ధ్వానం మేఘాలదేయని భ్రమపడి పురులు విప్పుకుని మురుపు విరియిస్తూ, నర్తనంతో వర్తిస్తున్న కేకులు చేసే క్రీంకారరవానికి, సోకినమైకంవీడి, చావు బ్రతుకులనక, ఏచిన భయంతో శక్తికొలది పారిపోతున్న చెఱ్ఱిపోతులూ, ఆ చెఱ్ఱిపోతుల సంస్పర్శతో ఒడళ్ళు జలదరింప, అల్లారి రొమ్ముత్రావుతున్న మాతృస్తన్యం వదలి దిక్కులకు పరతెంచే మృగార్భకాలపాద సంహతులచే కలగి ఎగిరిపడి లేచి, మహాద్భుతమహాకంపనాయత్త చిత్తంతో వర్తించే కోతి పిల్లల కూడికతో గాఢమైన చోట్లు ఇంకో ప్రక్కనూ. స్వేచ్ఛాహార విహార వ్యవహారాలు కలిగి వుండటంచేత, వంగినా, నిలుచుండినా, నడిచినా, ఎడతెగని మదజల ప్రవాహాలకు స్థానభూతంబైన మదోన్మత్త శరీరాల భారంచేత, బలిష్ఠాలూ, శాఖోపశాఖ భరితాలూ అయిన ఉన్నతోర్వీ జాతాల దండకేగి తొండాలుసాచి, రెంపారుపువియత్తై ధరణి పతనవము వేదండకాండాలూ, ఆ వేదండాలు కలగుండుపడ. పక్ష విక్షేపాలతో, దిక్కుహరాలు పూర్ణం అయిపోయేట్లు చూస్తూ, మింటినుంచి మంటికి ఒక్క లంఘనం పెట్టి, నిజపద నఖాలతో గ్రుచ్చి. ఏన్గులతోనే చప్పున వుప్పరం అంటి అప్పళించి, పర్వతసానువుల్లో దిగి. కడుపునిండ మదువగమకింపుగండభేరుండాలూ, ఆ గండభేరుండాలను చెండి, మాతంగ శల్యాలను సేకరించు కోరికతో, నీడజాలపై మాటువెట్టి ఘనష్వానులై కాలనిరీక్షణం చేసే విలుకాండ్రూ, ఆ విలుకాండ్ర వంచింప నెంచి, అంతకు ముందే ఆకుల సందుల్లో దాగి, సూర్యాస్తమయం చేరువైనకొద్దీ క్రమ క్రమంగా విలుకాండ్ర మాటుచోటులచేరి. వెనుకనుంచి పొంచి తలలను నోళ్ళతో భక్షించే భల్లూకాలూ, ఆ భల్లూకాల చేష్టలకు అసూయచెంది గుంపులుకట్టి ఎటు చూచినా తామే అవుతూ, అగ్నికణాలు అనే భ్రమ కల్పించి వృక్షాలను ఆవరించిన ఖద్యోత సంతతి ( మిణుగురు పురుగులు ) వాటికి దిగులుచెంది పట్టువదలి నేలపడు ఎలుగుగొడ్ల గుమతింపలేక, క్షుద్బాధావశంతో చంగున పైకుఱికి కోరలవాక్కల్లో గ్రుచ్చి విగతప్రాణుల చేసి. సహజాహారంకాక. దిక్కుల పిక్కటిల్ల ఘూర్ధరించు వనక్రోడాలూ

(అడవిపందులు) ఆ వనక్రోడాలను తాకి, పగలనక, రేయనక, పలు ప్రొద్దులు, సవ్యాపసవ్యంగా, ఆకుంచిత సర్వాంగంగా అయి, విరుచుకొనిన పెనగి, నెత్తురు బొటబొట బొత్తిల్లి దెసలకు వడుగెత్తే మువ్వన్నెమెకాలూ (పులులు), ఆ మెకాలను సజీవంగా పట్టవలచి, గుట్టలుకొట్టి కందరాలపై కప్పివేచియున్న మాటుకాండ్రు సంతపింప లోనికి దాకదారిన వేగానికి దాచిన బోనులబెట్టు నవలి ముఖద్వారం బంధింపబడుట తడవుగా చెవులు చిల్లులుపడ, గిరిగహ్వరాలు ప్రతిధ్వనింప అర్భటించే కంఠీరవాల (సింహాలు) చే కాపుక్రమ్మిన నెలవులు మరోప్రక్కనూ, వెలగ, చింత, నేరేడు, మారేడు, తాడి, జువ్వి, మర్రి, బూరుగు వేప, ఉసి మొదలైన మహా వృక్షాలతో సంకీర్ణంగా వున్న చోట్లు వేరొకవంకనూ, పూగ, పున్నాగ, కరవీర, క్రముక, కురువక, ఖర్జూర, నారికేళ, నింబ, రసాల, ఏలకీ, లవంగ, లుంగ, కదళీ మాతులుంగాది కుసుమఫల శ్రీకారాలైన వృక్ష లతామండితాలగు స్థలాలు ఇంకోప్రక్కనూ: సారస, క్రౌంచ, బలాక, చకోర, చాతకాది హృదయంగమ విహగ సంచరస్ఫురణధవళము తరంగ సంగత నృత్య కళా సంపన్నవ పుష్పిత కుముదకల్హార పంకజ శ్రీవాసాలైన కాసారాలతో నిండిన దిక్కులు మరో దిక్కునూ, ఝుంఝూమరుత్సంపాతం చేత రేగిన ధూళి గగనందాకా వ్యాపించి, కృత్రిమంగా కల్పించిన అంధకారమా అన్నట్లు భ్రమకూర్చే ఎర్రరేగడి చోట్లు ఇంకోవంకనూ సకల ఖగ మృగపాంథ పిపాసహరణాలూ, బహుమార్గప్రయాణ లబ్ధాలూ అయిన వేశంతాలు (నీటిపడియలు) కల్గిన బయళ్ళు వేరొకప్రక్కనూ నిండి నిబిడీకృతమై దుర్జనహృదయంవలె ప్రవేశ దుర్లభంబైన దండకారణ్యాన్ని చూచి మార్గదృష్టిగల పినతల్లి ఈ ప్రదేశం ఎందుకు నిర్దేశించిందో అర్థం చేసుకున్నాడు.

## విరాధుడు సీతను ఎత్తుకొనిపోవుట

తాపసులు చూపిన దారి ఆ అరణ్య ప్రవేశంతో అంతర్హితమైంది. అక్కడక్కడ, నలిగి నడచినట్లున్న కాలిబాటలు వెంబడిపోయి అక్కడ ఆగిపోగానే, ఎటు తాము వెళ్ళాలో తెలియక మళ్ళీ వెనుకకు వచ్చి చెట్ల

ప్రక్కనుంచీ ముళ్ళదొంకల సందుల్లోనుంచీ అడుగడుగు గండంతో, అతికష్టంతో లోపలికి పోతున్నారు. వెంటతెచ్చుకున్న జలం పండ్లూ, ఆకలికీ దప్పికీ ఉపశమనార్థం కొద్దికొద్దిగా గ్రహిస్తూ, మార్గం కల్పించుకుంటూ పోయి ఆ ప్రదేశం చూచి ఆశ్చర్యమగ్నులైనారు. తాము దాటి వచ్చిన ప్రదేశం ఎంత భయంకరమో ఇది కూడా నిర్జలమై, నిర్జనమై, నిర్భూజమై కనుచూపుమేర శ్మశాన షోణివలె కనుపిస్తూ, అంత భయంకరంగానూ వుంది. ఆ చోటంతా అడుగుపెట్టటానికి అవకాశం లేకుండా, మానవమృగ కంకాళాలు గుట్టలుగుట్టలుగా పడివున్నై. పగిలి, విరిగి, నలిగి నేలంతా ఎముకలతో నిండి వుంది. అల్లంతదూరాన పర్వతశిఖరమంత ప్రమాణాన్ని కలిగిన దేహంతోనూ, చండ్రనిప్పులవంటి కనుగ్రుడ్లతోనూ మృగాలకు వలె పెదవులు దాటి వెలికివచ్చిన కోరలతోనూ, వేయి చేతులు కలిపి కొలిచినా ఇంకా మిగిలే వుదరంతోనూ, కొండగుహవంటి నోటితోనూ, నెత్తురు కారుతున్న పులితోలు ఆచ్ఛాదనంగా నడుముకు అడ్డం చుట్టుకుని, మాటిమాటికీ నోరుతెరచి ఆవలిస్తూ, అప్పుడప్పుడు కొండలదరేట్లు అరుస్తూ, ప్రాణికోటి భయంకరమైన క్రూరాకారం వారికి గోచరించింది. కుడిచేతి ప్రక్క నిలుచుండపెట్టిన శూలానికి నాల్గు పులులూ రెండు తోడేళ్ళూ, మూడు సింహాలూ, పది కుందేళ్ళూ, ఏనుగు తలా గ్రుచ్చబడి వున్నై.

ఆ దారివెంట వస్తున్న సీతారామలక్ష్మణులను ఆ నరభోజి చూచాడు. ఎక్కడ లేని కోపం తలకెక్కింది. వెర్రికేకలు వేస్తూ, వికటంగానవ్వుతూ, మూడంగల్లో భూమి కంపించేలాగా వచ్చి, వంకెలు వేసిన మణిహారం తీసుకున్నంత తేలికగా నడుమ నున్న జానకిని పిడికిలితో ఎత్తికొనిపోయి తొడపై కూర్చుండబెట్టుకుని "ఎవరు మీరు? ఇది దండకవనం, ఇక్కడికెందుకు వచ్చారు? జడలూ, నారగుడ్డలూ దాల్చి, గర్వంతో భార్యను వెంటబెట్టుకుని భయం లేకుండా ఎక్కడికి పోతున్నారు? మీరు మునులైతే ఆడది ఎందుకు? కాకపోతే జడలెందుకు? మిమ్ముల చూస్తే మోసగాళ్ళ వలె వున్నారు. బ్రతుకుపై తీపివుంచే ఈ చోటికి రానే రారు. వచ్చినా కంటపడి తిరిగిపోలామనుకోటం వట్టి భ్రమ. నా పేరు "విరాధుడు"

నేను వీరుణ్ణి. ముని మృగ మాంసభోజనంతో మోదం పొందుతూ. శూలపాణినై ఈవనంలో సంచరిస్తుంటాను. మిమ్మల్ని ఇప్పుడే చంపుతా" అని అంటూ. కుండలోని రక్తం గడగడ త్రాగి. "దీన్ని నాకు వదలిపెడితే ప్రాణాలతో మిమ్మల్ని వదలుతా పెనుగులాటకు దిగితే పెండ్లాం దక్కక పోగా నిక్కిన మీరే నిల్వరాదు" అంటూ గ్రుడ్లురిమాడు. అనాటుగా జరిగిన ఆ సంఘటనకు రామలక్ష్మణులు కొయ్యబారినారు. సీత గాలికి చలించే కదళీతరువులాగా కంపించి పోతూంది. ఆమె దీనస్థితి చూచి రాముడు మొగం చిన్నచేసుకున్నాడు. పట్టరాని బాధతో "తమ్ముడా! లక్ష్మణా! జనకుని కూతురు. నాకు భార్య అయికూడా ఆ అధముని అంకంపై వుండి వణికిపోతూంది. మనం చూస్తుండగానే మైథిలికి ఎంత అవస్థ వచ్చింది? దీర్ఘదర్శిని అయిన పినతల్లి కోరిక ఇప్పుడు ఫలించింది. నేను ఇటువంటి ఆపదలతో ఇక్కడే క్రుక్కుతాననీ, భరతుని రాజ్యాధికారం నిష్కంటకంగా సాగుతుందనీ ఆమెకు ముందే తెలుసు. తండ్రి మరణంకన్నా, తల్లి వియోగంకన్నా, రాజ్య పరిత్యాగంకన్నా, మీ వదినను నా సమక్షంలో పర పురుషుడు అంటటం మిక్కిలి దుఃఖం కలిగిస్తూంది" అని శోకించసాగాడు.

"ఆప్తులైన బంధువుల మరణానికి దుఃఖించటం నైజం. మనం క్షత్రియులమై, శరచాపధారులమై శత్రు సమక్షంలో కన్నీరు పెట్టవలసినంత కర్మం ఏమి వచ్చింది? మన అస్త్ర శస్త్రాలేమైనై? ఆర్జించిన దివ్యాస్త్ర విద్య ఏమైంది? భూతనాథుడవై పొగడిన నీవే అనాథునివలె చింతిస్తే అర్థం ఏముంది? పినతల్లి నిన్ను పంపించి ఎందుకో ఇప్పుడర్థమైంది. జగత్ప్రదాహకులైన ఇటువంటి దుష్టులను సంహారం చేసి, లోకకల్యాణ కారకుడవు కమ్మని. ఈ పధ్నాల్గేండ్లూ అరాజకం కాకుండా అయోధ్యను భరతుడు రక్షిస్తాడని. తెలియక భరతునిపై తెచ్చుకున్న కోపం. పర్వతాలపై ఇంద్రుని వజ్రప్రయోగం వలె వీడిపై ఇప్పుడే ప్రయోగిస్తాను. ఇక మీ తమ్ముడు నేనుండగా నా వదినకు అపచారం జరుగదు. బంధువులు మాత్రం పశువులు కారా?" అని భుజంగంవలె ఫూత్కరిస్తూ "ఎవడవురా నీవు? ఈ శ్మశానంలో ఏమిటికి తిరుగుతున్నావో చెప్పు. చెప్పకపోతే

నీతో చెప్పిస్తాను" అని అనగానే, వాడు "నన్నడిగేముందు మీరెవరో చెప్పండి. ఎందుకు వచ్చారు, ఎక్కడికి పోతారు ?" అని అడిగాడు. ఆ మాటకు ప్రతిగా "మేం ఇక్ష్వాకులం, క్షత్రియులం, వనసంచారులం. నిర్మలవృత్తులం ఇక నీ సంగతి చెప్పు"మని రాముడన్నాడు.

"వినండిరా వినండి. నా తండ్రి జయుడు. తల్లి శతహ్రద. నాపేరు చెప్పాగా విరాధుడని. నేను తపస్సుచేసి శస్త్రాస్త్రాలతో చావని వరం బ్రహ్మచేత పొందాను. ఛేదన భేదనవ్యాపాదనంతో శత్రువులు నన్ను నిర్జింపలేరు. తెలివి తక్కువతో తలపడి చెడిపోకండి. ఇది ఇకమీద దక్కదు." అంటూ రాక్షసుడు వెక్కిరింతగా నవ్వాడు. "ఏమన్నావురా దానవాధమా ! చావని వరం పొందావు కనుక సతిని విడిచి పొమ్మనా ? చంపి సతిని గ్రహిస్తానని శపథం చేస్తున్నాను. రాముని ధనుర్గుణంలో బాణం చేరిస్తే దాటి బ్రతికినవాడు లేడు. నీవూ బ్రదుకవు. నిష్కారణంగా నిన్ను చంపటం ఎందుకని ఇంతవరకూ విలుపరింపకున్నాను. నేటితో నీ ఆయువు ముగిసింది" అంటూ రాముడు ధనువ్సు సజ్యంచేసి, శాతమార్గణ కదంబాన్ని ప్రయోగించాడు. అంతతో ఆగక, వాయు సువర్ణ వేగోచ్చండమైన సప్త శర సాయకాలను వక్షస్థలం లక్ష్యంగా వదిలాడు. అవి ఆ శైలాకారుని హృదయకుహరం చీల్చి నెత్తురు త్రాగుతూ వెలికి వచ్చి భూమిపై వ్రాలినై. లక్ష్మణుడు కోప తామ్రాక్షుడై, అన్నకంటె అధికంగా అస్త్రవర్షం కురిశాడు.

## రామలక్ష్మణులు విరాధుని చంపుట

ఆ బాణపాత తీవ్రతకు తట్టుకోలేక జానకిని క్రిందికి దించి, శూలంకేల దాల్చి, దాశరథులతో తలపడి, వికటంగా అర్భటిస్తూ, మ్రింగటానికి నోరు తెరిచి మీదికి దుకారు. ఆ తెరిచిన నోటిలో అగ్నిహోత్రంలాంటి అస్త్రాలు ప్రయోగించి, వుదరం వుడికించారు. వాడు భూరకనిల్చి హాసం చేస్తున్నాడు. సోదరులు బాణ ప్రయోగం చేస్తూనే వున్నారు. అంతకంతకు బాణాగ్ని శరీరం కాలుస్తూ వుంది. వరంచావ

కుండా చేస్తుందేకాని, బాధపడకుండా చేయదుగా. ఆవేదనకు తట్టుకోలేక వారిపై శూలాన్ని విసిరాడు, ఆ శూలం దిక్కులు వెలిగిస్తూ రాముని వైపు రావటం చూచి రెండు దివ్యాస్త్రాలు అనుసంధించాడు సౌమిత్రి. రాముడు కూడా, ఆ కర్ణాంతంనారిలాగి రెండు నెలవంక బాణాలు శూలం నడిమిభాగం, వంపుగాతాకేలాగా వదిలాడు. సోదర ధనుర్ముక్తమైన అంబకాలు నాలుగూ అటూ ఇటూ ఒక్కసారి తగిలి రెండు తుండేలుగా శూలాన్ని ఖండించినై. అపజయం అంగీకరించని అసురుడు తన దేహం వీను వీథికి పెంచాడు. దాశరథుల బాణాలన్నీ కటిభాగం కింద్రనే తగులుతున్నై. అదిచూచి మారదేవి దివ్యాస్త్రాలను పుంఖానుపుంఖంగా వర్షించి శక్తిహీనుణ్ణి చేశారు. ఇక ప్రయోజనం లేదని ఆగ్రహంతో అగ్నిహోత్రతుల్యంగా వెళ్లిపోతున్న దాశరథులను, ఎత్తుకుని అమాంతం అంతరిక్షానికి ఎగిరిపోయాడు.

వాని పోకడచూచి రాముడు " తమ్ముడా ! ఈ దుష్టుడు మనలను కొని పోతున్నాడు. వీడు పోయిపోతే అదే మనకు మార్గం. ఏంచేస్తాడో చూద్దాం " అని అంటుంటే, జానకి ఈ దుస్సంఘటనచూచి " అయ్యయ్యో ! ఈ నరాంతకుడు వీరిని హింసించటానికి ఎక్కడికో ఎత్తుకుని పోతున్నాడు. నాకిక్కడ రక్షకులెవ్వరు ? ఓ దానవా ! నీకు నమస్కారం చేస్తాను. వారిని వదలి నన్నెత్తుకునిపో. నన్ను మ్రింగి నీ ఆకలి తీర్చుకో. ఇక్కడి ఈ మృగాలవాత పడటంకన్నా వారి రక్షణకైనా ప్రాణాలు విడువటం మేలు " అని ఆక్రోశించ సాగింది. జానకి శోకసంతప్త వాక్యాలు దాశరథులువిని, త్వరగా దానవుణ్ణి చంప సంకల్పించి, లక్ష్మణుడు ఎడమచేయి ఖండించాడు. రాముడు కుడిచేయి నరికాడు. వెంటనే పక్షాలు నరికిన పర్వతంలాగా నేలపడ్డాడు. పడినవాణ్ణి విడువక మోచేతులతో, మోకాళ్ళతో శరీరం అంతాక్రుమ్మి, పిడిగ్రుద్దులు గ్రుద్ది, ఎగరవేసి వదలి. బాణాలతో పొడిచి చిత్రహింస చేశారు. ఎంతచేసినా విరాధుడు విగతప్రాణుడు కాలేదు. విసిగిన శ్రీరాముడు " తమ్ముడూ ! వీడు వరబలం కలవాడు కనుక అస్త్ర శస్త్రాలతో చావడు. పెద్ద గోయితీయ్యి అందులో పాతిపెడదాం, అప్పుడుగాని చావడు " అని అంటుంటే.

విన్న విరాధుడు "రామచంద్రా! నే నిపుడు నిజంగా చచ్చాను. నాచావు మర్మం నీకు తెలిసింది. నాకు పూర్వజ్ఞానం వచ్చింది. ఇంత వరకు అజ్ఞానంతో అహంకరించి అపచారం చేశాను. నన్ను క్షమించు."

## విరాధుడు తన శాపం సంగతి శ్రీరామునితో చెప్పుట

నీవు శ్రీరాముడవు. నీ తమ్ముడు లక్ష్మణుడు. ఈ తల్లి సీత. నా పూర్వజన్మలో నేను గంధర్వుణ్ణి. అప్పటి నాపేరు తుంబురుడు. క్రమంతప్పి రంభతో విహరించగా, శ్రీపతి శపించాడు. ఆ శాపం ఎటువంటిదో నన్ను చూసి మీరు తెలుసుకోగలరు. సాత్త్వికుడను, భక్తుడను అయిన నేను ఘోరరాక్షస శరీరంతో, క్రూరమైన జీవహింసతో బ్రతుకలేక శాప మోక్షణం చెప్పమని చరణాలపైబడి వేడుకున్నాను. ఆయన, దశరథ పుత్రుడు రాముడు దండకారణ్యానికి వస్తాడు. వచ్చినప్పుడు నీ వికృత చేష్టకు కినిసి నిన్ను వధిస్తాడు. అప్పుడు నీకు మళ్ళీ దివ్యరూపం వస్తుందని అనుగ్రహించాడు. ఇప్పుడు నీ దయవల్ల నాకు శాపాంతం జరిగింది. ధన్యుడనయ్యాను. కూరిమితో నాకు సెలవిస్తే నా లోకానికి నేను పోతాను. మీకు శుభం జరుగుతుంది. ఈ వైపుగా సార్థయోజన దూరంపోతే అక్కడ నిజతేజః పటిమా సత్ప్రసంగుడైన శరభంగుని ఆశ్రమముంది. అక్కడకు పోయి ఆయనను దర్శించండి. నేనీ మార్గణాఘాత వేదన భరించలేను. వెంటనే గోతిలో పెట్టి పూడ్చండి. ఎవరు చచ్చిన రక్కసిని గుంటలో పెట్టి పూడ్చుతారో వారు సనాతన లోకాల్లో విహరిస్తారు. ఇది చచ్చినరాక్షసులకు చేయవలసిన సహాయం. దయతో నాకుతొందరగా విముక్తి కల్పించండి" అని వేడుకున్నాడు. అతడు అర్థించినప్రకారం లక్ష్మణుడు ఏనుగునువలె గోయిత్రవ్వాడు. రాముడు వాడికంఠంపై కాలు నొక్కిపెట్టాడు. [illegible] పూర్తి కాగానే సోదరుడు పట్టి పైకెత్తి ఆ కందకంలో కంఠ దఘ్నంగా పాతిపెట్టి [illegible]తో విరాధుణ్ణి యమసదనానికి పంపారు. అనంతరం ఆయుధా, కొమ్ములూ అంబులోనింపి, మట్టితో పెల్లకప్పివేశాడు. ఈవిధంగా లోకకంటకుడైన రాక్షసుణ్ణి చంపి, సంతసంతో, ధనుర్బాణాలు ధరించి, మేము

విముక్త చంద్రసూర్యులవలె వెలుగుతూ, సీతను సమీపించి, ఆమెభీతిని పారద్రోలి, విరాధుని వధవృత్తాంతం వివరించారు.

## సీతారామలక్ష్మణులు శరభంగాశ్రమం చేరుట

ఆమె, నావ విరిగి సముద్రంలో మునిగిన మనిషి మరల బయటపడిన విధంగా పరమానందం పొందింది, భర్తనూ మరదినీ ఎంతో శ్లాఘించింది. వారి శస్త్రాస్త్రవిద్యనూ, వారి తేజోమూర్తులనూ విస్మయం పొందింది. ముగ్గురు ఉత్సాహంతో కదలి ముందుకు నడుస్తుండగా, రాముడు "సోదరా! దారితెలియక దుర్గమమైన కాననంలో ప్రయాణించటం కష్టం. విరాధుడు చెప్పిన మార్గం వెంటపోయి శరభంగుని దర్శిద్దాం. ఆయన ఆజ్ఞచొప్పున ఎక్కడ నివసించాలో అక్కడ పర్ణశాల నిర్మించుకుందాం. దానవుడు చెప్పినగుర్తులు చూచుకొంటూ తమ్ముడా! దారితీయి" అని అన్న వెంటనే సౌమిత్రి ముందుకు నడవసాగాడు. సీతారాములు అనుసరించారు. ఏప్రయత్నంలేకుండా శరభంగముని ఆశ్రమప్రాంతదేశం చేరుకున్నారు. రాముడు సమీపంగా దాని వస్తున్నదృశ్యాన్ని చూపిస్తూ, "జానకీ! చూచావా? ఆ మునిమహర్షి సూర్యాగ్నిసమ తేజంతో, భూమినంటక ఆకసమునందె, రమణులైన తపోధనుల సేవలు కొంటూ, పాండురాభ్రసంకాశమైన శ్వేతచ్ఛత్రం క్రింద వెలుగుతున్న శరభంగ మహర్షిని దర్శించటానికి ఇంద్రుడు సురగణంతో వచ్చాడు. ఆకాశంలో "దేవపతిరథమంటి" రథం, ఆకుపచ్చని హయాలు కట్టబడి నిల్చిఉంది. అప్సరసలు వానికి వింజామరలు వీస్తున్నారు. గంధర్వగంధర్వ సిద్ధసాధ్యులు మహర్షిని స్తుతిస్తున్నారు. ఆహో! ఏమి ఆ మహనీయుని తపశ్శక్తి. త్రిలోకాధిపతి స్వయంగావచ్చి, నమస్కారపూర్వకంగా ఏదో వచ్చిన పని విన్నవించుకుంటున్నాడు. మానవజన్మ ఎంత పవిత్రమైందీ? అందుకే, "జంతూనాం నరజన్మదుర్లభం" అన్నారు. మీరంతా వేరుగా ఉండక నేను వెళ్ళి విచారించి వస్తాను. అంతవరకు మీరిక్కడే ఉండండి" అనిచెప్పి ఆశ్రమప్రవేశం చేశాడు. లక్ష్మణుడు "వదినా! ఆకాశంలోని రథం ఎంతశోభాయమానంగావుందీ? దాన్నిరక్షిస్తూ పంచవింశతి (25) వర్షప్రాయులు కృపాణ

ధరులై, విరజ వస్త్రభూషితులై, మణికుండల శ్రవణులై, దేవతా కుసుమ పరికల్పితమాలాలంకృతకంఠులై, అనిమేషులై ఉన్నారు. వీరి రాకనుగూర్చి ఇన్ని వివరంగా తెలుసుకుని వస్తాను. నీవావల్లని పొన్న చెట్టు నీడక్రింద విశ్రాంతితీసుకో అని చెప్పగా, ఆమె అలాగానే చేసింది. సౌమిత్రి జాగరూకుడై ప్రదేశం గమనిస్తూ, అన్నరాకను ప్రతీక్షిస్తూ నిల్చున్నాడు.

రాముడు ఆశ్రమంలో అడుగిడగానే, ఇంద్రుడు ఏకాంతంగా, శరభంగ మహర్షితో "స్వామీ! మీదర్శనార్థం శ్రీరాముడు వస్తున్నాడు. నే నిక్కడ ఇప్పుడు ఉండరాదు. ఈయనచేయవలసిన మహాసాహసకార్యాలు ఎన్నోవున్నై. అవిపూర్తిగా నిర్వహించి అద్భుతకీర్తిమంతుడైనపిమ్మట, నేనేవచ్చిం చి మాట్లాడుతాను. నాకు సెలవొసంగుడు" అని శతాంగారోహణంచేసి, సపరివారంగా స్వర్గంవెళ్ళాడు. ఇంద్రుడీవిధంగా అదృశ్యంకాగానే, ధర్మా సోదరుల సమ్మని చేయమని, వారురాగానే వెంటనిడుకుని రాముడు మౌని తిలకుని దర్శించి నమస్కరించి నిలుచున్నాడు. వారి నమస్కారాలందుకుని ఆశీర్వదించి ఉచితపీఠాలపై వసింపనియమించాడు.

## ఇంద్రుని రాకకు కారణం శరభంగుడు శ్రీరామునికి చెప్పుట

ఉభయుల కుశల ప్రశ్నానంతరం రాముడు "మునిచంద్రా! ఇంద్రుడు పరివార యుక్తుడై ఇక్కడికేలవచ్చాడు? ఒకరథం ఎవరులేక అంతరిక్షంలో ఎందుకు నిలిచివుంది? ఇంతలోనే అంతా ఎందుకు అదృశ్యుడైనాడు" అని అడిగాడు. అదివిని ముని "రామచంద్రా! అనితరలభ్యమైన బ్రహ్మలోక నివాసాన్ని నాతపోబలంతో నేడే సాధించుకున్నాను. బ్రహ్మ ఆజ్ఞ మేరకు సగౌరవంగా నన్ను కొనిపోవడానికే, సురనాథుడు రథసహితంగా వచ్చాడు. అతిప్రియుడవైన అతిథివి నన్నుచూడ వస్తున్నావని తెలిసిన నేను, నిన్నుచూడక, అర్చించక, బ్రహ్మలోక ప్రయాణం చేయటానికి మనసురాకపోవటంచేత నీకై నిరీక్షిస్తూ నిలిచాను. తాపసశ్రేష్ఠులు ఎవని దర్శనంకోసం ఘోర తపస్సు చేస్తారో ఆయన సాకారంగావస్తే వ్యర్థ బుద్ధినై సదవకాశాన్ని జారవిడుచుకుంటానా? నాకోరిక సిద్ధించింది. నీచే

## మునులు శ్రీరామునితో తమకష్టములు తెలిపి శరణు చొచ్చుట

ఆవిధంగా శరభంగమహాముని సత్యలోకయాత్ర చేసి ప్రీతిగా కనుగొన్న వనవాసులు సుతీక్ష్ణాశ్రమానికి ప్రయాణిస్తుండగా మునికోటి ఎదురు వచ్చింది, ఆవచ్చినవారు కొందరు వైఖానసవాలఖిల్యులు. కొందరు గాత్రశయానులు. కొందరు అశయ్యానీర పత్రాశనభోజులు, కొందరు వాయుభక్షకులు. సురపథాలయులు కొందరు. మహిశయ్యులూ, అశ్మకుట్టానలతేజులూ, రసాంతరవాసులూ, యోగలగ్నులూ, వ్రతులూ, సంప్రక్షాలులూ, సతతార్ద్రపటులూ, మరీచిపయపానులూ, నిర్జితసకలేంద్రియులూ, సమ్మతదంతోలూఖలులూ, ధర్మజ్ఞులూ, అచలులూ కొందరు. వారంతా, పరమపూజ్యుడూ, సత్యరతుడూ ధర్మశీలుడూ అయిన శ్రీరామునిచేరి ఆశీర్వదించి, "రఘురామా! వేల్పులలో ఇంద్రునివలె, రాజులలో శ్రేష్ఠుడవు. ఇక్ష్వాకువంశ భూషణుడవు. ఈ జగత్తునకు ప్రభుడవు. పితృభక్తి, సత్యాచారతి, ధర్మనిష్ఠ, నీ రూపు దాల్చినవి. నీ సాధు జనసంరక్షణకు గాధేయుని సవనరక్షణ మొక సాక్షి. నీ దుష్టశిక్షణ దక్షతకు తాటకా సుబాహువిరాధుల సంహరణ మింకొక సాక్షి. నీ సోదరప్రేమకు భరతుడే ప్రబలమగు సాక్షి. నీ సాటిలేని వీరత్వమునకు శివ ధనుర్భంగమే ఇంకొక సాక్షి. నీ దైవత్వమునకు పరశురామ పరాజయము వేరొక సాక్షి. నీమిత్రభావనకు శృంగి బేరపురాధిపతి గుహుడు మరొక సాక్షి. మేం నీశరణు జొచ్చాము "అన్యథాశరణం నాస్తి, త్వమేవ శరణం" "రక్షమాం రక్షమాం రక్ష" అని అన్నారు.

"మహాత్ములారా! రాముడు మీ సేవకుడు. మీ ఆజ్ఞానువర్తి, మీరు పరమబ్రహ్మర్షులు. భృకుటి భంగమాత్ర చతుర్దశ భువన కంపితులు సంకల్ప మాత్ర పునస్సృష్టికర్తలు. నన్నిట్లు ప్రశంసించి శరణార్థులు కావటం మిక్కిలి అపచారం. నా చేత మీరేం పని గోరివచ్చారు? అది తప్పక నెరవేరుస్తాను. సెలవీయండి" అని అన్నాడు. వారు "రామా! కారుణ్యధామా! మా విన్నపం సాదరంగా విను. మేం భగవంతుని ప్రతినిధిగా ప్రభువును భావిస్తాం. భగవంతుడు సర్వ జీవాంతర్యామియై

సంరక్షిస్తుంటాడు. ప్రభువు బాహ్యజగత్తును పాలిస్తుంటాడు. కనుక నీ పట్ల మేం చేసిన స్తుతి ఏమీ అపచారం కాదు. నీవు మాకు రాజువు. నీ రక్షణలో వుండి కూడ ఎన్నో బాధలు పడుతున్నాం. పన్నులు ప్రజల నుండి గ్రహించి వారిని కాపాడనివాడు పాపలోకానికి పోతాడు. వాళ్ళ తమ కష్టంలో ఆరోవంతు రాజరక్షణకు ఇస్తారు. మా తపస్సులో నాల్గో వంతు రాజు తేజోబలాభివృద్ధికి ఇస్తాం. దేనికంటే ప్రజారక్షణం ప్రభువు చేస్తూండాలని. ఈ వచ్చిన మేం మహిమగలవాళ్ళం అయినా దుష్టశిక్షణం రాజుచే చేయిస్తాం. మా తపస్సు వ్యర్థం కాకూడదు. లోకవ్యవహారాలు వదలి గ్రామ పట్టణవాసాలనువీడి, సాంసారిక చింతను త్యజించి అడవుల్లో వానప్రస్థులంగావున్న మమ్ములను రక్కసులు నానాహింసలు పెడుతున్నారు. మా తోవచ్చి చూడు. రాక్షసులచే చంపబడిన మునుల కంకాళాలూ, ఎముకల ప్రోగులూ. మందాకినీతీరంలో, పంపానదీతటంలో, చిత్రకూటనగ ప్రదేశంలో నివసించే మునీశ్వరులంతా మ్రుక్కడిరక్కసిమూకలచే సంహరింపబడ్డారు. అయినా ఈ అడవిని వదలలేకుండా వున్నాం. ఈ ప్రదేశాలు యుగయుగాలుగా మహర్షులచే గౌరవింపబడినై. తపస్సిద్ధి శ్రమ ఎక్కువ పడకుండా లభిస్తుంది. వారి మరణాన్ని చూడలేక నీ శరణు జొచ్చాం" అంటూ శ్రీరాముణ్ణి మహర్షులు అర్థించారు.

## శ్రీరాముడు మునులకు అభయం ఇచ్చుట

అందులకు రాముడు "మహర్షులారా! త్రిలోక పూజ్యులైన మీరు నన్ను ఇంతగా ప్రార్థింప తగదు. తాపస రక్షణం, ప్రజాపాలనం ఇక్ష్వాకులకు దాటరాని ధర్మాలు. మీ ఆజ్ఞ తప్పక నెరవేరుస్తాను. జనకుని ఆజ్ఞ సాకుగా అరణ్యానికి వచ్చిందెందుకు? నేనిది ఆత్మకార్యంగా భావించి రాక్షస సంహారం చేయుటానికీ, మీకు శోభనం కలిగించటానికీ. నాకీ కాననవాసం ఫలప్రదం అయ్యేటట్లుగ మీరు ఆశీర్వదించండి. అది చాలు. అన్ని కార్యాలు నేనూ సోదరుడూ చక్క చేస్తాం. మీరు చింతదక్కి స్వీయ కార్యాచరణ దీక్షలో వుండండి" అని వారికి అభయప్రదానం చేసి, జడదారులు వెంటరాగా సుతీక్ష్ణ శ్రమ సందర్శనార్థం బయలుదేరాడు

అనంతరం కొంత దూరం పోయి మందాకిని తరించి, అంజనాచల సన్నిభమైన ఘన్నుర పర్వతం చేరి. అక్షయ్య ఫల సుమ ప్రవాళ సంతతితో వింతగొల్పే వృక్షవాటిక మధ్యప్రదేశంలో "చిరమాల్యం" అనే పేరు గల సుతీక్ష్ణ మునిచంద్రుని ఆశ్రమం దర్శించారు. మహర్షులు ముందు నడువగా, భార్యాసోదర యుతుడై అందులో ప్రవేశించి, ధూళిధూసరిత జటాకలాపుడూ, విగతపాపుడూ, కృతసుకృతకర్ముడూ, విరచిత జగద్ధర్ముడూ అయిన మహాతపోరాశిని చూచాడు.

## శ్రీరాముడు సుతీక్ష్ణుణ్ణి దర్శించుట

అంజలించి వినయంతో "పరమపూజ్యుడా! నేను ఇక్ష్వాకువంశ మండనుడైన దశరథ మహా రాజ జ్యేష్ఠ తనయుణ్ణి. నా పేరు రాముడు. ఇతడు నా సోదరుడు లక్ష్మణుడు. ఆమె నా సహధర్మచారిణి జనకనందిని. జానకి. మీ సందర్శనార్థం వచ్చాం మమ్ము ఆశీర్వదించి అనుగ్రహించండి" అని అన్నాడు. రాముడు రాగానే సుతీక్ష్ణముని లేచి ఎదురునడచి బారసాచి కౌగిలించుకుని "రామా. ఎన్నాళ్ళకు నీ దర్శనం లభించింది. నా ఆశ్రమం పావనమైంది. ధన్యుల్లో ధన్యుడనయ్యాను. నీ రాజ్య భంగం, భార్యతో, తమ్మునితో నీవు వనవాసానికి రావటం, మునివేషం ధరించటం, విరాధుని వధించటం, శరభంగాశ్రమాన్ని దర్శించటం, ఆయన ఆదేశానుసారం నా ఆశ్రమానికి రావటం నా అంతశ్చక్షువులకు అవగతమైంది. నేను నీ రాకనే వాంఛించి వున్నాను. నన్ను దేవేంద్రుడు తన లోకానికి ఆహ్వానించవచ్చాడు. నేను తన లోకాన్ని తపస్సుచేత గెల్చుకున్నానట అయినా నిన్నుచూచి నీకు నా తపః ఫలం ధార పోసి పోదామనుకున్నాను. నీ వంగీకరిస్తే ఇప్పుడే సంక్రమింపచేస్తా" నన్నాడు రాముడందుకు సవినయంగా, "స్వామీ! మీ సుకృత ఫలాన్ని గ్రహిస్తాను. కాని, నా వునికికి తగిన స్థానం మీవల్ల తెలుసుకోమని శరభంగర్షి చెప్పారు. ముందు ఆవిషయం తెలియచేయం"డని చెప్పాడు. సుతీక్ష్ణుడు-

"రఘురామా! అన్నివిధాలా నీకు ఆవాసయోగ్యమైన చోటు నా ఆశ్రమ ప్రదేశమే. దీనికి చుట్టుప్రక్కల బ్రహ్మణ్యులు ఎందరో తపస్సు

చేస్తూన్నారు. ఈ భూమి మిక్కిలి గుణవంతమైంది. ఆశ్రమవాసులకు కాదగిన అన్ని సౌకర్యాలు ఇక్కడ వున్నై. ఇచటికి రాక్షసులు రారు. అకుతోభయమైన ఆశ్రమం ఇది. అయితే మృగాలు మాత్రం స్వేచ్ఛా విహారం చేస్తుంటై. అప్పుడప్పుడు వాటి రాకపోకలవల్ల అంతరాయాలు వస్తుంటై. అంతేగాని వేరేమీ ప్రాణాంతకను భంగపడే అవకాశం లేదు" అని జవాబు చెప్పాడు. "మేం అహింసావ్రతులమైనా క్షత్రియులం. అవసరం వస్తే క్షత్రధర్మం పరిగ్రహిస్తాం. మృగాలవల్ల ఆశ్రమోపద్రవం వస్తుంటే మీకని మేం చూచి వూరుకోలేం. వాటిని వాడి బాణాలతో సంహరిస్తుంటే జీవకారుణ్యమూర్తులైన మీకు సంతాప కారణం అవుతుంది. ఈ రాత్రికి మీ ఆతిథ్యం గ్రహించి రేపు ఈ వచ్చిన మహర్షుల వెంట వెళ్తాను. వారి ఆశ్రమాలకు రమ్మని ఆహ్వానించ వచ్చారు. వారిని అసంతృప్తులుగా చేయటం మాకు ఇష్టం లేదు" అని రాముడు ఆయనను సమ్మతిపరచి. ఆ రేయి అక్కడ మౌనివర్యాతిథ్యాన్ని గ్రహించి సతీ సోదరులతో, మునులతో గడిపాడు. తెల్లవారగానే, చల్లని కలువపూల తావులతో సువాసనంగా వున్న నదీజలంలో స్నానంచేసి. అగ్నిహోత్రాది విధులు నెరవేర్చి, సూర్యోపాస్తి సలిపి మునీంద్రుని దర్శించి, "దేవా! మీ ఆదరంతో, ఆతిథ్యంతో ఆనందంగా రాత్రి గడిచిపోయింది. ఇక మాకు సెలవిస్తే పోయివస్తాం. మహర్షులు తొందర చేస్తున్నారు. నేను పోవటానికి ఉత్సహిస్తున్నాను" అని నమస్కారంచేసి నిలుచున్నాడు. అభిముఖంగా, నిల్చున్న రాముణ్ణి ప్రియమార సందిట గదించి "రామా! పోయిరా. మరల ఎప్పుడైనా, నా ఆశ్రమానికి రా. సూర్యకిరణాల సోకున వికసించిన తామరలూ. పూలతో. పులుగులతో. నిర్మల నీరంతో కాసారాలూ, మిన్నంటు శిఖరాలతో. ఫలభరాల వృక్షాలతో, ధాతువులతో. సెలయేళ్ళతో, జలపాతాలతో, ప్రకాశించే పర్వతాలూ. వనాల్లో అందమైన నెమళ్ళూ. నిరంతరం మీకు ఆనంద సంపాదనకారణాలవు గాక అని ఆశీర్వదిస్తున్నాను. నాయనా! లక్ష్మణా! అమ్మా! జానకీ! మీకు శుభమగు గాక" అంటూ ముని అనుమతించాడు. జానకి, చాపదండాలూ, ఖడ్గ తూణీరాలూ. తీసుకుని సోదరుల కందించింది. అవి గ్రహించి వారు వెంటనే ధనుస్సుల సజ్యం చేశారు.

## సీత శ్రీరామునకు హితోపదేశం చేయుట

బాటసారు లందరూ పరమ హర్షంతో ప్రయాణం సాగిస్తున్నారు. ఎన్నో ప్రాచీనగాథల పరమార్థాన్ని శ్రవిస్తూ పోతున్నారు. ఆ సమయంలో ప్రేమ స్పందితమైన డెందంతో, మృదుమంద మధుర వచన రచనా సామర్థ్యం పొందపరుస్తూ, శ్రీరాముని చేరవచ్చి జనకనందిని, "ప్రాణేశా! అన్యథా భావించక నా మనవి ఆలకించు. నిశ్చయ బుద్ధితో మీరనుష్ఠిస్తున్న నిష్ఠ పరస్పరవిరుద్ధంగా వుంది. ఒకవంక గార్హస్థ్య ధర్మంతో వుండి కూడ వానప్రస్థులవలె దీక్షలో వున్నారు. మునివేషధారులై అహింసావ్రతం పాటిస్తూ అస్త్రశస్త్రాల అవలంబనం పొందుతున్నారు. ఇంకొకవంక పరమ పూజ్యులైన మహర్షులకు రాక్షస సంహారం చేస్తానని మాట ఇచ్చారు. ఏ విధంగా వీటిని సమన్వయించాలి? లోకంలో దాటరాని కామజవ్యసనాలు (కోర్కెలతో పుట్టి వాటిలోనే లీనం చేసేవి) మూడున్నై. మొదటిది "మిథ్యాభిభాషణం" (అబద్ధమాడటం) రెండోది "పరదారాభిగమనం" (వ్యభిచరించటం) మూడోది "నిర్హేతుక శత్రుత్వం" (కారణం లేకుండా పగపట్టటం) ఈ మూడూ మహాపాపాలు. ఎంతవాడైనా ఏదో ఒక విధంగా వీటిలో పడక తప్పదు. పడినవాడు వెలికిరావటం బహుకష్టం.

ఈ మూడు వ్యసనాల్లో మొదటి రెండూ మీకు లేవు. సత్యవ్రత పాలనపరు కాబట్టే పిన్నత్తగారికిచ్చిన బాస ప్రకారం భరతుడు ప్రార్థించినా అయోధ్యకు పోలేదు. ఏకపత్నీవ్రతుడవనీ, త్రికరణాలలో పరదారగమనాభిలాష లేదనీ, నీ ఆత్మేశ్వరిగా నేను చెప్తున్నాను. ఈ రెండు గుణాలు ఇప్పుడు లేకపోవటం కాదు, ఇకముందు కూడా మిమ్మంటవని ప్రమాణం చేసి పలుకుతాను. మూడో వ్యసనం నిర్హేతుకంగా పగపట్టటం ఇప్పుడు చేపట్టారు. ఇది మిక్కిలి రౌద్ర కర్మ. ఈ మహర్షుల కిచ్చిన మాట చొప్పున దండకాటవిలో వున్న దనుజులను దంపుటకై సోదర సహితంగా బయలుదేరారు. అందుకు పోతున్న మిమ్ముల అడ్డుపెట్టే భావంతో కాక మీ శుభమే నా శుభం కనుక కొన్ని మాటలు చెప్తున్నాను. మీ ఈ ప్రయాణం నాకెంత మాత్రం రుచించలేదు. అందుకు కారణం కూడ చెప్తాను. అప్రతిహతవీరులైన మీరు, కార్ముకబాణకృపాణపాణులై

పోతుంటే ఎందుకైనా బాణప్రయోగం చేయవలసివస్తే చేస్తారు. అదే పగకు కారణం అవుతుంది. అగ్నిహోత్రునికి సమిధల సాహచర్యంలాగా క్షత్రియునకు శస్త్రాస్త్రాలు బలతేజాలను పెంచుతై. అందుకే భయపడుతున్నాను. మీ రాక రాక్షసులకు అనిష్టంగా వుంది కూడా మిమ్మల్ని ఇంతవరకు ఏమీ చేయలేదు. విరాధుడు రాక్షసుడుగా అపచారంచేసి అనుభవించాడు. శాపముక్తుడైనాడు, అందులో అతనికి ప్రతీకారవాంఛ లేదు. అసలే రాక్షసులు, అందులో కామరూపులు. అనిష్టులు. మీరు శరచాపధారులు కావటం నాకెందుకో ఇష్టం కావటంలేదు. ఇందుకు నాకు తెలిసిన వృత్తాంతం ఒకటి వుంది. చెపుతా వినండి.

## శస్త్ర సాంగత్యదోషం తెలిపే కథ సీత రామునితో చెప్పుట

పూర్వం ఒక అరణ్యంలో ధర్మాత్ముడూ. సత్యరతుడూ అయిన తాపసి వుండేవాడు. ఆయనకు ఆ అడవిమృగాలపై ఎంతో అనురాగం వుండేది. ఆయన తపం ఎలాగైనా భంగపరచాలని ఇంద్రుడు ఎన్నో ప్రయత్నాలు చేశాడు. అవన్నీ బూడిదలో పోసిన పన్నీరులాగా వ్యర్థమైనై. చివరకు సైనికుని వేషంతో వచ్చి విలువగల కత్తి ఆయనవద్ద వుంచి మళ్ళీ వచ్చి గ్రహిస్తానని చెప్పి మాయమైనాడు. ఈ మోసం తెలియక, దాని రక్షణ కోసం ఎక్కడికి వెళ్ళినా ఏ పని చేసినా చేతిలో ధరించే చేసేవాడు. క్రమక్రమంగా రక్షణ తత్పరమైన మనస్సు దాని సౌందర్యం దాని ప్రయోజనం మొదలైన విషయాలపై రమించసాగింది. ఆ రతి రౌద్ర గుణాన్ని ప్రేరేపించింది. దానితో నైజమైన శాంతకరుణారసాలు సమసిపోయినై. క్రూరత విజృంభించి స్వీయకర్మ విడిచి కిరాత వృత్తితో జీవించి, మరణానంతరం దుర్గతులపాలైనాడు. అందువల్ల శాంతమూర్తులూ, వ్యసననిగ్రహాలూ అయిన మీరు అస్త్రధారణం చేసి వుండటం అనర్థాలకు దారితీస్తుందేమోయని భయపడుతున్నాను. మీరు నాకు ఇచ్చిన చనువును పురస్కరించుకుని మీ మనస్సులోనికి గుర్తు తెచ్చాను. అంతేకాని, మీకు తెలియని ధర్మాన్ని తెలుపటంకోసం కాదు. ఇంత సహృదయులు కారణరహితంగా కఠిన కర్ములు కారాదు. ఎంత సరిపెట్టుకున్నా మనస్సు స్థిమితపడ్డం లేదు,

మీరు క్షత్రియులు. శస్త్రధారణం తప్పు గాదు. అలంకారం కూడ. ప్రజాక్షేమం కోసం, ఆర్తజన రక్షణకోసం శత్రుగర్వనిర్వాపణకోసం శస్త్రధారణం తగుతుంది: కాని రిత్తదండనానికి ధరించటం తగదు. శస్త్రధారణం ఎక్కడ? కానన సంచారం ఎక్కడ? క్షాత్రం ఎక్కడ? తపం ఎక్కడ? అన్యోన్య విరుద్ధ ధర్మాలకు మీరు ఆశ్రయం కారాదు. దేశకాల పాత్రాదులు తెలిసిన మీకు చెప్పవలసిందిలేదు. ఏ దేశ ధర్మాన్ని ఆ దేశంలో ఆచరించటం తగిన పని. మునిరూపధారులై అడవిలో వుండే మీరు ముని మార్గంలో నడవటమే శ్రేయం. శస్త్రధారణంతో, అమలినమైన మీ మనస్సు మలినపరచుకోవద్దు. మీరు క్షత్రధర్మాన్ని ధరించే రోజూ, అది చూచి నేను ఆనందించే రోజూ వుంటుంది. అది మీరు అయోధ్యా సింహ పీఠంపై అలంకరించిన రోజు. ఆడుదానను. స్త్రీ చపలత్వంవల్ల నాకు తోచిన ధర్మం నేను చెప్పాను. ధర్మ స్వరూపులైన మీకు ధర్మం చెప్పే అధికారం మూడు లోకాలల్లో ఎవరికీ లేదు. నే నేపాటిదాన్ని? మీరూ, తమ్ముడూ కలిసి యోచించి మీకు నచ్చిన మార్గంలో నడవండి " అని చెప్పింది.

## శ్రీరాముడు ఆర్తరక్షణం పరమ ధర్మం అని సీతకు చెప్పుట

రాముడు అర్ధాంగి ఆడిన పల్కులు విని " దేవీ! ప్రేమతో, నీ పల్కులో చిరముగ చెప్ప తగినరీతిలో చెప్పావు. ఇక నాసమాధానంవిను. రాజునకు అస్త్ర శస్త్రాలతో అవసరం ఎప్పుడూ వుంటాను. ఎప్పుడూ వుంటుంది అంటే: ధర్మాసనంమీద వున్నంతసేపూ ధర్మ దండం వుంటుంది. అది అపరాధిని అపరాధి. ఇక రాజునకు నిత్యం సన్నిహితంగా మరణం వుంటుంది. అందుకోసం ఆత్మరక్షణకు అస్త్ర శస్త్రాల్లో ఏదో ఒకటి వుండాలి. అతని జీవితం నిత్య శంకితం. కనుక శస్త్రాస్త్రధారణం క్షత్రియునకు అవశ్యకర్తవ్యం. అది అతనికి సహజమే కాని వ్యసనంకాదు. కులాలునకు ( కుమ్మరి ) కుండలు చేసే కర్మవుంది. దానికి మృత్తిక, సారె, దండం అవసరం. ఎల్లప్పుడూ అతడు అందులో మునిగితేలుతున్నా అది వ్యసనంకాదు. ఇక నా ప్రవర్తనంలో వైవిధ్యం గోచరిస్తున్నదని

అన్నావు. నేను జన్మించిన క్షత్రియుణ్ణి. ఆ క్షత్ర ధర్మాన్ని సన్యసించి మునిరూపం దాల్చలేదు. మునివేషం ఎందుకు వేశామంటే: ఇక్కడ సంస్కారాలు జరుగవు. అవి కోరితే అయోధ్య విడువటం అవసరం లేదు. నీకు కలిగిన సందేహంలో బలమైంది అకారణవైరం. నే చేసిన ప్రతిజ్ఞ సకారణమైందే. నీవే చెప్పావుకదా ఆర్తరక్షణకు అస్త్రధారణం అవసరమని.

ఈ మహర్షులంతా ఆర్తితోనే వచ్చి నన్నాశ్రయించి, నా రక్షణ కోరారు. అడవుల్లో కాయలూ, కూరలూ, దుంపలూ, ఆకులూ తింటూ, ఎవరికీ అపకారం చేయక, శక్తివున్నా శపించక అసురుల చేష్టలకు హతులవుతున్నారంటే చూస్తూ ఊరకుండుట క్షత్రియుడు చేసే పనికాదు. అందులో స్వయంగా అర్థించినప్పుడు కూడా చేతకానివానివలే వుండటం అసలుదగదు. దేశకాల పాత్రాలు చూసే అభయం ఇచ్చాను. దండకాటవి రాక్షసులకు ఎటువంటిదో, మహర్షులకూ అటువంటిదే. వాళ్ళ పనులకు వీరు అడ్డుపోనప్పుడు వీరిని వాళ్ళు చంపటం అధర్మం. అధర్మాన్ని చూచి నేను సహించలేను కనుక అభయం ఇచ్చాను. అన్నమాట తప్పడు రాముడని అందరికీ తెలుసు. ఈ దేశం నా తండ్రిది. ఇందులో మమ్మాశ్రయించి మా రక్షణ కలదని నమ్మకంతో తపస్సు చేసుకునే మహర్షుల నిష్కారణంగా, బలవంతులమనే గర్వంతో చంపటం క్షమించరానిది. ఇంతకంటే పగ ఏం కావాలి? మునిజన పాలనం నాకు ముఖ్య కర్తవ్యం. వారు అర్థించకుండా చేయవలసినపని అర్థించినా చేయక పోవటం మహాపాపం. వారు నామాటపై ఎంతో ఆశతో వున్నారు. వారి మాటను త్రోసిస్తే జరిగేదే విరోధం వస్తుంది. స్నేహంతో, మోహంతో, సౌహార్దంతో నాకు నీవు బోధ చేశావు. నేనెంతో సంతోషించాను. నాపై ప్రాణాధికమైన స్నేహ భావం లేకపోతే ఎందుకు చెప్తావు? నీ వంశానికీ, నీ చరిత్రకూ, అనురూపమూ, అర్హమూ అయినట్లుగానే అన్నావు. నా సహధర్మచారిణివీ, నా హృదయేశ్వరివీ నీవు అధర్మబోధ ఎన్నడూ చేయవు. నీవర్త కలలో కూడ ధర్మ వ్యతిరేక మార్గంలో నడువదని నమ్ము" అంటూ తృప్తి పరచి ధనుర్ధా

రియై అగ్రభాగంలో నడువసాగాడు. ఉవిద మధ్య నడుస్తూంది. సహిత కోదండ హస్తుడుగా సౌమిత్రి వెనుక నడిచాడు. ( అ + ఉ + మ = ఓమ్. ప్రణవం, ప్రణవార్థం ఈ మాటల్లో వున్నై. ) సారవంతములూ, సౌందర్యవంతములూ అయిన నవసారస కైరవ సౌరభ వాసిత భాసితకాసారాలూ, తటినీ తట సైకత సంచర దంచిత చక్రయుగీ వారాలూ, గిరిసుందరకందరపాతసుపూతఝరీ, లహరీ పూరాలూ, సుమమంజుల కుంజక పుంజిత గుంజదళి ప్రకరాలూ నేత్ర పర్వం కలిగిస్తూండగా, చవిచని భీకరాలైన సూకరాలూ భయంకరములైన దర్వీకరాలూ కరికేసరి వికరాకరాలూ అయిన ప్రదేశాలు చూస్తూ ఎట్టఎదుట దూరంగా అంబరలంబమాన దివాకరబింబంలాగా ఒప్పి, ఒక యోజనం చదరం కలిగి అద్భుతాన్ని కలిగిస్తున్న తటాకాన్ని రాముడు దర్శించాడు. ఆ తటాకం అళినీ మలినీ కృశంగానూ నలినీదల నీరజాతనవశోభితంగానూ దేవకాంతాకల నారుతంగానూ మదకరీంద్ర బాధితంగానూ నిర్జనంగానూ కనుపిస్తూ మధుర సంగీతనాద మేదురముఖరితంగానూవున్న ఆ తటాకాన్ని అర్థంచేసుకోలేక తోడుగా వస్తున్న " ధర్మభృత " మహర్షిని రాముడు ప్రశ్నించాడు.

## ధర్మ భృతుడు మాండకర్ణి కథ శ్రీరామ చంద్రునకు చెప్పుట

"స్వామీ ! ఇంత విశాలంగావున్న చెఱువు నేనింతకు ముందెన్నడూ చూడలేదు. దీని చరిత్ర వినాలని కుతుహలంగావుంది. గోప్యంకాకుంటే వక్తవ్యం అయితే మీరు చెప్పం" డనిన ధర్మ భృతుడు దాశరధి సల్లాపం ఆలించి ఆ సరస్సు సంగతి చెప్పసాగాడు. "రామచంద్రా! విను. " మాండకర్ణి" అనే మహర్షి అనేక వత్సరాలు గడు సుతపంచేశాడు. ఆ తపోబలంతో ఈ సరస్సు సాధించాడు. దీనిపేరు " పంచాప్సరం " ఈ జలాంతర్భాగంలో పంచేంద్రియ నిస్స్పృహుడై పదివేల ఏండ్లు తపస్సమాధిలో నున్నాడు. ( దీన్నేజల స్తంభనం అంటారు. ) జలవాయు భక్షణతో కొన్నాళ్ళు కేవలం వాయు భక్షణతో కొన్నాళ్ళు ఘోరాతి ఘోరంగా తపస్సు చేస్తూంటే దేవతలెల్లా ఒకచోటచేరి ఏస్థానంకోరి

ఇతడు ఇంత భయంకర తపస్సు చేస్తున్నాడో ఎవరి పదవులకు ముప్పు వస్తుందో అనే భయంతో తపోభంగం నిమిత్తం అయిదుగురిని అందాల రాణులను కల్పించి ఆ ముని సన్నిధానానికి పంపారు. ఆ మహర్షి ఎదుట నిల్చిన లీలావతుల హావభావ విలాసాలకు ముగ్ధుడు కాగానే మన్మథుని బాణవృష్టి, అలి వేణుల నేత్రాంచల దృష్టి ఒక్కసారే తగిలి మోహితుడై ఇంద్రియ నిగ్రహాన్ని కోల్పోయాడు. కామశర విద్ధుడైన ముని వారిని దారలుగా గ్రహించి జలాంతర్భాగంలో మనోహరమైన గృహం నిర్మించి తపశ్చర్యకు భంగం లేకుండా యువతీ యోగ్యమైన యౌవనాకారంతో వారితో క్రీడిస్తుంటాడు. ఆ సమయంలో వారు ఆమునీశ్వరుని ఆటలతోనూ పాటలతోనూ ఆనందింపచేస్తుంటారు. ఈవినవచ్చే నాదం ఆదేవతాంగనల కర కంకణక్వాణం, మంజీర నాదం, భూషణ ఘంటికా రావం కలిపి వస్తూంది" అని చెప్పాడు. ఆ కథవిన్న రాముడు రోమాంచిత గాత్రుడై "తపస్సు సాధించలేనిదేదీ వుండ" దని తలుస్తూ తమ్ముడూ భార్యా తోడులాగా పయనం సాగించాడు. సాయంకాలానికి ఋషివాటిక చేరుకున్నాడు. ఋషులంతా ఆ ముగ్గురినీ భక్తి విశ్వాస గౌరవాదరాలతో ఆహ్వానించి అర్చనాది విధులు ముగించి ఆతిథ్యం ఇచ్చారు. ఆ మహర్షులు వంతులవారీగా మూడు, నాలుగూ, ఆరూ, పదీ, పన్నెండూ, పదమూడూ నెలల చొప్పున ఆతిథ్యం ఇస్తూ ఆదరించారు. పరమహర్షంతో ఏ ఈతి బాధలు లేకుండా పది వత్సరాలు గడిపారు.

## రామాదులు సుతీక్ష్ణాశ్రమంచేరి అనంతరం అగస్త్యాశ్రమం చేరుట

ఒకనాడు రాముడు సంయమిశ్రేష్ఠుల సందర్శించి "మహాత్ములారా! మీ అనురాగాదరాలతో పది వత్సరాలు పది నెలలుగా గడచిపోయినై. నేను సుతీక్ష్ణాశ్రమాన్ని దర్శించ దలుచుకున్నాను! సెలవిస్తే పోయివస్తా" నని వేడుకున్నాడు. వారు రాముణ్ణి విడువలేక హృదయ భారంతో కొంత దూరం సాగనంపి వచ్చారు. ఋషులచే అనుజ్ఞాతుడై సుతీక్ష్ణముని సన్నిధానం చేరాడు. అక్కడ కొంతకాలం గడిపి "స్వామీ! ఈ

ప్రాంతంలో ఎక్కడో అగస్త్య మహర్షుల ఆశ్రమం వుందని విన్నాను. వారిని చూడాలని వాంఛ కల్గింది. అక్కడికి చేరే మార్గం ఆనతిస్తే వెళ్ళి దర్శించుకుంటాం" అని అడిగాడు. రామా! నేనే ఆ విషయం నీకు చెప్పదలిచాను. నీవే కోరావు. చాలాసంతోషం కలిగింది. తప్పక నీవు దర్శించ వలసిన అవసరం కూడా వుంది. ఇక్కడికి నాల్గు యోజనాల దూరం వెళ్ళితే అక్కడ నీవు పోయే దారికి దక్షిణంగా పెద్దరావితోపు వస్తుంది. అది, మిళిందకబృంద సుందరమైన అరవింద చుంబిత విశుద్ధ జలాశయాలూ, ఫలపుష్ప మనోహరాలైన వృక్షాలూ, జలపక్షి సంతానాలూ కలిగి హృదయంగమంగా వుంటుంది. ఆ ఆశ్రమం అగస్త్య మహర్షి అనుజునిది. ఆయనను సేవించి, ఆరాత్రి ఆతిథ్యం గ్రహించి, మరునాడు, దానికి దక్షిణంగాపోయే దారివెంట ఒక్క ఆమడ దూరంపోతే అగస్త్యులవారి ఆశ్రమం వస్తుంది. బహుపాదప సంవృతమై, బహుళార్థ సాధకంబై సత్యలోకాన్ని తలపిస్తూ సంయమివర్యుల ఆశ్రమ భూమి నయనపర్వంగా గోచరిస్తుంది. నీ ప్రయాణానికి ఇప్పుడే శుభకాలం. బయలుదేరు" మని సుతీక్ష్ణుడు ఆనతిచ్చాడు.

ఆయనవద్ద అనుజ్ఞకైకొని ముగ్గురూ నడకసాగించారు. దారికి ఇరు వైపులా గోచరించే అనేక సుందర దృశ్యాలూ, భయంకర ప్రదేశాలూ చూస్తూ, మెత్తని ఇసుకలో, అక్కడక్కడ కొద్దినీటిలోవున్న పంకలా (కొండవాగులు) తీయనిజలంతో, రకరకాలైన పిట్టలలో నిండిన కనిపించే కొలంకులూ (సరస్సులు) తరించి, ఆపరిస్థితుల పరిశీలించి, అగస్త్యుని తమ్ముని ఆశ్రమాన్నిగుర్తించి, లక్ష్మణునితో, అవరాజు (తమ్ముడు) ముని చెప్పిన లక్షణాలన్నీ ఇక్కడ గోచరిస్తున్నై, తరువులన్నీ ఫలపుష్పపుటముల భారంతో ధరణి తాకుతున్న కొమ్మలతో నిండివున్నై. చక్కగా పండిన పిప్పలీఫలాల వగరు వాసనతో వాయువు వీస్తున్నది. చీల్చి ఎండపెట్టబడిన కట్టెల గుట్టలు తరచుగావున్నై. వైడూర్యాలవర్ణంగల కోయబడ్డ దర్భలు కుప్పకుప్పగా పెట్టబడినై. నీలమేఘాన్ని తలపింప చేస్తూ హోమధూమం గగనానికి ఎగసిపోతూంది. వివిక్తమైన రేవుల్లో విప్రవర్యులు పుష్పోప హారాలు సమర్పించారు. ఇది ఆయన సహోదరుని ఆశ్రమం అయివుం

టుంది. ఏమహాత్ముడు లోకహితంకోరి ఉత్తరం విడిచి దక్షిణదిశను తన వాసంగా ఎన్నుకున్నాడో, ఎవడు వింధ్య గర్వాపహారియో, ఆయన అనుజ్ఞ పొందకుండా పోవడం మనకు మంచిదికాదు. ఎందుకు నేను అగస్త్యుల వారిని దర్శిస్తున్నానో ఈవృత్తాంతంవల్ల నీవే గ్రహిస్తావు.

## రాముడు సౌమిత్రికి వాతాపి, ఇల్వలుల వృత్తాంతం చెప్పుట

చాలాకాలానికిపూర్వం "వాతాపి," "ఇల్వలుడూ" అనే పేర్లుగల సోదరులు ఈ అరణ్యంలోనే వుండేవారు. వారు బ్రహ్మచేత వరాలుపొంది మాయతో ఋషులను చంపి తినేవారు. వారు రాక్షసులూ, బ్రహ్మఘ్నులూ అయికూడా బ్రాహ్మణవేషధారులై ఆశ్రమం నిర్మించుకుని ప్రతిదినం శ్రాద్ధం పేరుతోనో పండగపబ్బాల పేరుతోనో మునులను నిమంత్రించి వారురాగానే ఇల్వలుడు వాతాపినిచంపి ఆమాంసం వండివారికి భుజింపపెట్టేవాడు. భోజనానంతరం సుఖోపవిష్టులై వున్నప్పుడు "వాతాపీ రా" అని పిల్చేవాడు. మునుల గర్భంలో మేష మాంసంగా వున్న వాతాపి వారి పొట్టలు చీల్చుకొని వెలికి వచ్చేవాడు. వారు బయటకు రాగానే వచ్చిన మునులను ఇద్దరూ కబళించేవారు. ఈవిధంగా దండకారణ్య వాసులైన తపసుల సందర్శి తమ పొట్ట పెట్టుకుంటున్న క్రవ్యాదుల దుర్మార్గాన్ని సహించలేక దేవతలు అగస్త్య మహామునినిచేరి నక్తంచరుల మోసం వివరించి బ్రాహ్మణుల రక్షింపుమని ప్రార్థించారు. కొన్నాళ్ళకు వాళ్ళ ఆయువు పూర్తిఅయినరోజూ చిత్రగుప్తుని లెక్కల్లో మిగులుతగిన పేర్లూ కలిసివచ్చినై. ఆనాడు ఇల్వలుడు అగస్త్యులవారిని ఆమంత్రించేడు. ఆయన ఆశ్రమానికి రాగానే వాతాపిని మేషంగామార్చి వధించి ఆ మాంసంతోనే అర్చించాడు. ఆసీమాంతం అయినతర్వాత ఒక్కసారి అగస్త్య మహాముని తనచేతితో పొట్టరాచుకుంటూ "వాతాపి జీర్ణం. వాతాపి జీర్ణం" అని రెండుసార్లు వినకుండా పుచ్చరించి విశ్రాంతి తీసుకుంటున్నాడు. ఇల్వలుడు "స్వామీ! సర్వం సంపూర్ణమేకదా?" అనిఅడిగాడు. "ఇల్వలా! సర్వం సంపన్నమే" అని అన్నాడు. తర్వాత "వాతాపీ! ఒక్కసారి ఇటురా" అని తమ్ముణ్ణి పిల్చాడు కానివాడు రాలేదు. మహర్షి నవ్వుతూ "అయ్యో! తమ్మునిపై అంత మమ

కారం ఏమి" కని ఆశ్చర్యంతో అడిగి "నీతమ్ముడు మేషఫలంగా నా కడుపునబడి జీర్ణించాడు. పాపం! ఇంకెక్కడి సోదరుడు? ఇల్వలా! వాడు కాలనిపురంలో పాతకాపైనాడు. ఇక నేపోయి వస్తా" నంటూ లేచాడు.

ఆసంగతి విన్న ఇల్వలుడు నేయిపోసిన అగ్నివలె మండుతూ, మీ దికింఘించాడు. లంఘించిన రాక్షసునితేరిపారచూచాడు మౌని. అతడున్న ప్రదేశం బూడిదెతో నిండిపోయింది. ఆయన తమ్ముదేసుమా ఈయన" అనిముగించి అసురసంధ్య అయినందున సాయంకర్మలు సలిపి మునీశ్వరుని దర్శించి మొక్కి నిలుచున్నాడు రాముడు. ఆయన వారిని ఆహ్వానించి కంద మూలఫలాలు కడుపారపెట్టి సత్కరించాడు. తెల్లవారగానే ఆయన అనుమతి అందుకుని పూర్వంవిన్న వారిని బడిపోవుచూ మంజుల వంజులపుంజములూ మాధవీ కుంజములూ, బిల్వనికుంజములూ, సాలములూ, పుత్తాలతాలములూ, నీవారములూ, పున్నాగవారములూ, సుందర తిందుక బృందములూ, కుంద ములూ, మధుపాత్త మధుపూర్ణ మధూకములూ, తిమిసెలూ, పనసలూ, బహువిధ విహంగమ కలకలనాదమేదురక్ష్మాజములూ, కరికరా కృష్ట ములూ, కపికంపితములూ, కన్నులపండువుగా వనంలో కనుగొన్నారు. వెనుకవస్తున్న తమ్ముణ్ణి పిల్చి రాముడు "సోదరా! ఇక్కడ సంచరించే మృగాలన్నీ జాతివైరం మాని అన్యోన్యం అనురాగంతో వున్నై. ఇది ఆ మహనీయుని తపశ్శక్తిని చాటుతూంది. దీనిబట్టి ఆశ్రమం అతి సన్ని హితంగా వుండవచ్చు.

## శ్రీరాముడు అగస్త్యుని ఆశ్రమం చూచుట

ఈయన ఇక్కడ నివాసం ఏర్పాటుచేసుకున్నప్పటినుంచీ, రాక్షసులు శాంతిపరులై, లోదెమరుతో పైకి క్రూరంగా కనుపిస్తున్నా చెడ్డపనులేమీ చేయటంలేదని విన్నాం. ఇంతకుపూర్వం ఈ మహాత్ముడు వుత్తరదిక్కులో వుండేవాడు. మేరుపర్వతంపై కలిగిన అసూయతో మింటికి అంటపెరిగి సూర్యగమనం నిరోధించిన వింధ్య పర్వతగర్వం అణచే నిమిత్తం దక్షిణ దిశకు ప్రయాణించాడు. ఈయన రాకకు హర్షం, వినయం చూపిస్తూ ఆతిథ్యరూపంగా వింధ్యుడు నేలకు అణగిపోయాడు. "నేను మరల

నిన్ను దాటివెళ్ళవద్దు. ఈ విధంగానే వుండు"మని శాసించి దక్షిణానికి వచ్చి ఇక్కడే స్థిరపడ్డాడు. ఆయన మళ్ళీ ఉత్తరంగా పోలేదు. వింధ్య సూర్యావరోధప్రయత్నం చేయలేదు. అంతటి లోకోపకారి, ప్రాజ్య భూరుహకులం, శ్రాంతలోకసుఖదం, చిరమాలికాసుందరం, శాంతమృగ యూథ సంయుతం రమ్యవిహగనాదరంజితం ఐన ఈ ఆశ్రమం ఆనందానికి ఆవాసమై, అసూయకు అభావమై, కరుణారసానికి కల్పకమై, కామితాలకు కామధేనువై భూలోక సత్యధామంగా వుంది. దీర్ఘాయువైన ఈ దీప్త తేజుని సేవిస్తే సర్వ శుభాలు మనకు సమకూరుతై. మనం వనవాసశేషం ఈ మహర్షిని అర్చిస్తూ ఇక్కడే గడుపుదాం. ఈ పూజ్యుని సందర్శనార్థం ఎందరో మహాత్ములూ, దేవతలూ వస్తుంటారు. వారి దర్శనంకూడా మనకు అయాచితంగా లభిస్తుంది. శఠులూ, కల్లరులూ, క్రూరులూ, నృశంసులూ, కామవృత్తులూ, హింసాపరులూ ఇక్కడ ప్రవేశించలేరు. ప్రవేశించి బ్రదుకలేరు.

ఇక్కడ ఎందరెందరో తపస్సులో సిద్ధిపొంది శరీరాలు వదలి, దివ్య రూపాలు ధరించి దేవలోకంలో బృందారకపతి నందితులై అనంతకాలం హాయిగ సుఖాలు అనుభవించారు. అదిగో ఆశ్రమం. మేం ఇక్కడ నిలుస్తాం నీవు పోయి మన రాకను తెల్పిరా" అని రాముడు చెప్పాడు. వెంటనే సౌమిత్రి ఆశ్రమ ప్రవేశంచేసి కలశభవుని శిష్యునిగాంచి, అయ్యా! దశరథేశ్వరుని పెద్దకొడుకు భార్యాసమేతంగా వచ్చాడు. ఆయన పేరు శ్రీరాముడు, ఆమె పేరు జానకి, ఆయన తమ్ముణ్ణి నేను, పేరు లక్ష్మణుడు. మహర్షుల సందర్శనార్థం వచ్చాం. ఈ సంగతి వారికి వినిపించి వారేమన్నది నాకు చెప్పవలసింది అని మిమ్ముల వేడుకుంటున్నాను" అన్నాడు. ఆ మాటల కంగీకరించి ఆ ముని తల్లజుడు అగ్నిహోత్రగృహంలోకి వెళ్ళి నమస్కరించి, "దశరథ పుత్రులు రామలక్ష్మణులట, సీతతో కూడి మిమ్ముల సేవింపవచ్చాం" అని చెప్తున్నారు. తమ ఆజ్ఞను వారికి వినిపిస్తాను" అనగానే, "ఇప్పటికే కాలం మిక్కిలి గడిచింది. వెంటనే వెంటపెట్టుకుని రమ్మని" అగస్త్యుడు ఆదేశించాడు.

## శ్రీ సీతారామలక్ష్మణులు అగస్త్యుని ఆశ్రమంలోకి పోవుట

ఆదేశం అందుకుని ఆ ముని త్వరితంగా వచ్చి, "అయ్యా! వారెక్కడ వున్నారో చూపండి. వెంట తోడ్కొని రమ్మన్నా"రని, చెప్పి లక్ష్మణునితో కలసి వారిని సమీపించి, మహర్షి వచించిన మాటలు చెప్పి వెంట నిడుకుని ఆశ్రమంలోనికి కొనిపోయాడు. ఆయన వెంట పోతూ, పాముల పడగల నీడను పండిన ముంగిసలనూ, ఎలుకలతో కలసి తిరిగే పిల్లులనూ, కపోతాలతో ఆడే డేగలనూ, లేడికూనలకు రక్షణ ఇచ్చే సివంగులనూ చూస్తూ, అద్వైతానందం అనుభవిస్తూ, ముగ్గురూ, పరమేష్ఠి. పావక, శ్రీవిష్ణు, శక్ర, దివాకర, చంద్ర, భగు. ధనద, ధాత. విధాత, వీతిహోత్ర, అనంత. గాయత్రి స్థానాలు కడచి, వసుస్థానం. వరుణస్థానం, స్కంద. ధర్మలస్థానం అనే పూజాప్రదేశాలు దాటి ముందుకు పోగానే మునిశేఖరుడు ఎదురువస్తుంటే లక్ష్మణునికి చూపి ఆ వచ్చేవారే అగస్త్యుల వారు. తారాగణంలో చంద్రబింబంలాగా శాంతజ్యోత్స్న వర్షిస్తున్న వదనం అనురాగం క్రుమ్మరించే కన్నులూ వెండితీగలవలె మిలమిల మెరుస్తూ వున్న శిరోజాలూ గడ్డం ధర్మదేవత వసించే పీఠం అనదగిన వక్షం చూచి పోల్చుకున్నాను. ఓహో! ఎంత శాంత గంభీరమూర్తి. ఈయన ఆపోశనకు సప్తసముద్రాలు అరచేతిలో ఇమిడినవంటె ఈ మహనీయుని మహిమగూర్చి ఏమి చెప్పగలం? ఆ తపోబలం ఎంతటిదో!" అని "రామచంద్రుడు చెప్పి భార్యా సోదరులతో పాదాక్రాంతుడైనాడు. అగస్త్య ముని అర్ఘ్యపాద్యాదులిచ్చి అతిథిగ నిమంత్రించి క్షేమం ప్రశ్నించి ఆసనాసీనులను గావించాడు. పిమ్మట వైశ్వదేవం పూర్తిగావించి వానప్రస్థ ధర్మానుసారం భోజనపదార్థాలు సమకూర్చి తాను ముందుగా కూర్చుండి భోజనానంతరం పూర్ణతుష్టులైన రామాదులగని ప్రేమతో "శ్రీరామా! ఎంత భాగ్యవంతుణ్ణి. ఎంతకాలంనుంచి నీ రాకకు వేచివున్నాను. ఇప్పటికది ప్రాప్తించింది. అయోధ్య చరిత్ర అంతా విన్నాను. ఇందులో తండ్రి మరణం తప్ప విచారించదగిన వికృత విషయం ఏమీ లేదు. కాగినకొద్ది కాంచనం కాంతులు విరియిస్తుంది. తరచినకొద్దీ దధి నవనీతాన్ని ప్రసా

విస్తుంది. సద్ధర్మచారులకు కష్టాలు సన్నిహితంగానే వుంటై. కష్టసుఖాలు జీవుల కన్నింటికీ వున్నా ఎంతో భేదం వుంది.

## శ్రీరామునికి సుఖదుఃఖాలలోని భేదం చెప్పుట

లోకవ్యవహారంలో సుఖం అంటే, ఆహార విహార వ్యవహారాలన్నీ అనుకూలించటం, తనకు అయినవారెవరూ మరణించకుండా వుండటం. దీనికి వ్యతిరేకంగా జరగటం దుఃఖం. ఇది సామాన్యంగా అందరూ అనుకునేదే. కాని, ఇవి తను చేసే కర్మలవల్ల వస్తై అనీ, తనకు తెలియనిదేదో వుండి, ఆ కర్మఫలాన్ని క్రమంగా అనుభవానికి తెస్తున్నదనీ గుర్తించరు. ఒకనికి అన్నీ వున్నై. సుఖభ్రాంతితో నియమం లేకుండా అన్నీ అనుభవించాలని ఆకాంక్షతో సంచరించాడు. కాని, అతనికి తెలియకుండానే వార్ధక్యం వస్తూంది. తనకంటే ముందు పుట్టినవారంతా పెద్దవారై కాలగర్భంలో కలిసిపోతున్నారు. తానూ వృద్ధుడు కాబోతున్నాడు. ఈ స్థితి సుఖ కారణమా? దుఃఖ కారణమా? స్వేచ్ఛావిహారంతో శరీరధర్మం చెడిపోయింది. రోగం వచ్చింది. మందులు తిన్నాడు. పని చేయక మరణించాడు. ఇక సుఖమెక్కడ? అది వుందే, లోకధర్మంగా లేదు. మనస్సులో వుంది. ఒకడు వ్యవస్థాధర్మంలో నీచంగా పరిగణించే వృత్తిలో జీవిస్తున్నాడు. అది అతనికి నీచంగా కనుపించక సహజమైందిగానే కనుపిస్తూ, తన్నీ స్థితిలో ఎవరో వుంచారని ద్వేషిస్తాడు.

తింటానికి తిండీ, వుంటానికి ఇల్లూ, కట్టటానికి గుడ్డా లేక బాధపడే వాని బాధ, ఐశ్వర్యం పెంచాలనీ, అధికారం పెంచాలనీ చేసే పనుల్లో అనుకూలించక పడే బాధ, పెద్ద పనులకు దిగించే శక్తులవల్ల వచ్చే బాధ అంధుడు కాలుజారి పడినప్పుడు పడే బాధ, గుర్రంమీదినుంచి పడినవానికి కల్గే బాధ, ఎప్పుడూ ఒకటి కాదు. మంచిబలంతో పెద్ద మంచిగా చలామణి అయినా, చెడు ఫలాన్ని ఇస్తుందేకాని, మంచి ఫలాన్ని ఎప్పుడూ ఈయదు. నీవు బుద్ధిపూర్వకంగా వాంఛించిన వనవాసం కనుక ఇది నీకు సుఖకారణమే అవుతుంది; కాని, ఎన్నటికీ దుఃఖకారణం కానేకాదు. అసలు కష్టం నియమపాలనం అసలు సుఖం స్వేచ్ఛావిహారం. నేను హోమకార్యం

పూర్తి చేసి, నీకు అర్ఘ్యంఇచ్చి ఆహారం సమర్పించాను. నియమవ్రతుడైన తాపసి విధి భంగం చేసి భుజిస్తే పరలోకంలో కూటసాక్షివలె స్వమాంసమే కోసి తినిపిస్తారు.

నీవు మహారాజ పుత్రుడవు, రాజువు, మహారథుడవు, ధర్మవర్తివి, కీర్తిమూర్తివి. మా ఆశ్రమానికి అతిథివిగా రావటం మా తపఃఫలం. నా వద్ద చాపాక్షయ శరాసనాదులు వున్నై. నీకు చూపిస్తాను చూడు.

ఇది పూర్వం విశ్వకర్మచే నిర్మితమైంది. హేమమణిభూషితంగా వున్న ఈ ధనువు విష్ణుశరాసనం. అస్త్రాల్లో ఇది తిరుగు లేంది. ఇది అక్షయతూణీరం. దీనిలో బాణాలు తీసినకొద్దీ నిండుతూనే వుంటుంది. ఇది బంగారుపిడి గల ఖడ్గం. ఇది దాని ఒర. ఇవన్నీ ఇంద్రునిచే ఇక్కడ వుంచబడినై. ఈ వైష్ణవ ధనువు ధరించే శ్రీ విష్ణువు స్వర్గపతి విరోధుల సంహరించాడు. ఆ సమయంలో ఆయన ధరించినవే ఇవన్నీ. నీకు విజయప్రాప్తి నర్థిస్తూ ఇస్తున్నాము. వీటి ప్రయోజనం ఎంతో వుంది. నీకే వీటిని ధరించే అర్హత వుంది. అర్హుని కిచ్చేది ఏదైనా అది దానం కాదు. అతని సొమ్ము అతనికి ఇచ్చినట్లే. ఇవి నీవి. నీవు గ్రహించు" అని ఆ దివ్యాస్త్రాలు రామునికి సమర్పించాడు. ఆనందంతో రాముడు పొందాడు.

## అగస్త్యుడు శ్రీరామునితో సల్లాపం సలుపుట

అనంతరం అగస్త్యుడు అనురాగం వెల్లుబుకగా, "వత్సలారా! మీరు నాకై ఇంత శ్రమించి వచ్చినందుకు ఎంతో సంతృప్తి కలిగింది. దారిలో మిక్కిలి శ్రమపడి వుంటారు. ఈ పరమ సుకుమారి దేహం విశ్రాంతి కోరుతున్నది. ఆగర్భశ్రీమంతురాలు. ఏనాడూ ఎట్టి వ్యసనాలు ఎరుగదు. పరమధర్మమైన భర్తృసేవ నిమిత్తం భయంకరమైన దండకారణ్యానికి వచ్చింది. ఆమె మనస్సు సంతోషించేలాగా ఇక్కడ మీరు సంచరించండి. సృష్టి మొదలు నేటివరకూ, మగడు సౌఖ్యం కూర్చినంతసేపూ అనుకూలంగావుంటారు. కష్టదశప్రాప్తిస్తే, గడ్డిపోచకైనా హీనంగా కడకు త్రోస్తారు. మెరుపుల్లో చంచలతా, వాడికత్తుల కరకుతనం, గరుత్మంతుని తొందరా, కాంతలకు నైజగుణాలు. జానకిపట్ల ఈ దోషాలు కనరావు.

ఈమె అరుంధతి వంటిది. సతీ జన సమ్మానిత. మీరు సందర్శిస్తే ఈ ప్రదేశం పూర్వంకన్నా ప్రతిభావంతమవుతుంది" అని చెప్పాడు. అందుకు రాముడు "రాజ్యభ్రష్టుడనై, భార్యా సోదర సంయుతుడనై అడవుల్లో కాలం గడుపుతున్న నేను మీ హృదయంలో చోటు గడించుకుని ధన్యుడనైనాను. సమృద్ధంగా జలం, ఫల పుష్ప కాష్ఠ సంభారం అయిన వనం వుండే ప్రదేశం తెలిపిస్తే అక్కడ గడువు ముగిసేవరకూ వుంటాను" అని అర్థించాడు.

ఆ మాటలు విని మౌని అంతర్ముఖుడయ్యాడు. ఇంద్రుడు గోచరించి "స్వామీ! మీ ఆశ్రమంలో వుండవద్దు. దూరంగా వున్న పంచవటికి పంపించు. అక్కడనే అసలు అవతార కథ ప్రారంభం అవుతుంది. అరణ్యవాస కాలం సమీపిస్తోంది. మీవద్ద వుంటే ఆ కార్యం జరుగదు" అని చెప్పి అదృశ్యుడైనాడు. కన్నులు తెరచి మహర్షి "రామా! నీవు కోరిన అన్ని లక్షణాలు వున్న ప్రదేశం ఇక్కడకు రెండామడల దూరంలో వుంది. దాన్ని పంచవటి అంటారు. అక్కడ ఆశ్రమం నిర్మించుకొని శేషించిన సమయాకాలాన్ని జాగ్రత్తగా గడపండి. ఆ అవధి కూడా చాలా తక్కువగానే వుంది. ప్రతినను పూర్తి చేసి, ధరాపతివై ప్రజానందకరంగా పాలనం చేస్తావు. యయాతి రాజ్యం గ్రహించి తండ్రికి పుత్త్రమగటలు కల్పించినట్లు, జ్యేష్ఠుడవైన నీవు కులాచారం తప్పకుండా ప్రభువుగా నీ తండ్రికి శాశ్వత యశస్సు సంక్రమింపచేస్తావు. నేను దివ్యదర్శనంతో భూతభవిష్యద్వర్తమానాలను గ్రహించాను. నీ తండ్రి నీకే అరణ్యవాసం విధించటం, నీ పినతల్లి అందుకు హేతువు కావటం, అందుకు సమ్మతించి వచ్చిన నీలోని ఆంతర్యం అంతా ధర్మసంగతంగానే వుంది. ముందు మీరిక్కడనే వుండుడని చెప్పినా పంచవటికి పొమ్మని చెప్పవలసి వచ్చింది. నేను మీ క్షేమం కోసమే కాక లోక క్షేమంకోసం కూడ చెప్పుచున్నాను. పంచవటిని ఆనుకొని గోదావరి ప్రవహిస్తోంది. ఫలపుష్పాలకు, సమిధలకు అక్కడ లోటు లేదు. ఎంతో చక్కనివీ, చూడముచ్చటైనవీ పక్షులు కొల్లలుకొల్లలుగా వున్నాయి. ఆ ఏకాంత ప్రదేశం జానకికి ఎంతో ఉల్లాసం, ఉత్సాహం కల్పిస్తుంది. కాబట్టి మీరు అక్కడ సుఖంగా

నివసించి, అక్కడి తాపసపుంగవుల తపస్సుకు విఘ్నంలేకుండా చేయండి. నీకు దారి చెపుతాను అదిగో ఆ కనుపించేదే ఇప్పతోపు. దానికి పడమరగా పోతే పెద్ద మర్రిచెట్టు వస్తుంది. అది దాటిపోతే ఎత్తుగా వుండే ప్రదేశం వస్తుంది. దాన్ని దాటగానే పల్లంలో పర్వతం కనుపిస్తుంది. ఆ పర్వతానికి సమీప స్థలంలో "పంచవటి" అనే పేరు గల ప్రదేశం వుంది. అక్కడ మీకు తగిన సౌమ్య కుటీరం ఏర్పరచుకుని గడుపతగిన కాలం గడపండి" అని అనుమతి ఇచ్చాడు.

## శ్రీరాముడు జటాయువును చూచుట

ఆ ప్రకారం అగస్త్యులవారి అనుమతి పొందినతర్వాత, వెంటగొని పోవతగిన వస్తు సంచయం సర్దుకుని సౌమిత్రి కొంత, రాముడు కొంత వహించి, సీత సమేతు నడువగా పంచవటికి ప్రయాణం సాగించారు. వారట్లు ముని నిర్దేశిత మార్గంలో పోగా మర్రిచెట్టు కానవచ్చింది. ఆ వృక్షంపై ఆసీనుడైన అంత ఆకారంలో వున్న గృధ్రపతి ( డేగల్లో శ్రేష్ఠుడు) ని చూచాడు ఏ రాక్షసుడో ఈ రూపం దాల్చి వంచించవచ్చాడని సంశయించి రాముడు "ఓయీ! నీ వెవ్వడవు? నీ చరిత్ర మాకు వివరించు" అని అన్నాడు. "రామా! నా సంగతి సంతోషంతో చెబుతాను. నీ తండ్రి దశరథ మహారాజుకు ఇష్టసఖుణ్ణి. నేను బహు కాలంగా ఇక్కడే నివసిస్తున్నాను' అని గృధ్రరాజు సమాధానం చెప్పాడు. నమ్మీ నమ్మని మనస్సుతో "అయ్యా! నా జనకునికి చెలికాడవు అయినందున మాకు మిక్కిలి పూజనీయుడవు. నిన్నుచూస్తే, గతించిన నా తండ్రిని చూచినట్లే వుంది. నీ పేరేమిటి? ఇది నీకు నిజమైన ఆకారమా! లేక అవసరార్థం ధరించావా? పక్షులు మానవ సంభాషణం చేయటం వింతగా వుంది." అని ప్రశ్నించిన రామునకు సకల భూత జన్మ సహితంగా తన జన్మ వృత్తాంతం సాకల్యంగా గ్రద్ద చెప్పసాగింది.

"రఘుకుల భూషణా! రామా! ఈ భూత సృష్టికి బీజ భూతంగా మున్ను ప్రజాపతులు పధ్నాలుగురు కలిరి." కర్దముడు, విక్రీతుడు, శేషసంశ్రయుడు, స్థాణుడు, మరీచి, అత్రి, క్రతువు, పులస్త్యుడు, అంగి

రసుడు, ప్రచేతసుడు, బులహుడు, దక్షుడు, వివస్వతుడు, కశ్యపుడు " అనే పేరులతో వారంతా ధాతసృష్టిని సాగించారు. వారిలో దక్షునకు అరవైమంది ఆడు బిడ్డలు కలిగారు. అందులో ఎనిమిది మందిని కశ్యపుడు భార్యలగా స్వీకరించాడు. ఆ ఎనిమిది మంది పేర్లు వివరిస్తాను విను. అదితి, దితి దనువు, కాళి, క్రోధవశ, తామ్ర, మనువు, అనల కాంతలను కాంచి కశ్యపుడు మూడులోకాలు రక్షించే శక్తి కలిగిన పుత్రులను నా వంటివారిని మీకు ప్రసాదిస్తా "నని చెప్పాడు. వారిలో మొదటి నలుగురు అంగీకరించారు. తక్కినవారు తిరస్కరించారు. అదితి ముప్పై ముగ్గురు కొడుకుల కన్నది. వారు రుద్ర వసు అశ్వినేయ ఆదిత్యులనే దేవవర్గంగా వర్ధిల్లారు. దితికి దైత్యులు పుట్టారు. సప్తసముద్ర ముద్రితమైన ఈ ధరణి అంతా వారిదే. దనువునకు అశ్వగ్రీవుడూ కాళికకు నరకుడూ కాలకుడూ కలిగారు. తామ్రకు క్రౌంచీ భాసీ శ్యేనీ ధృతరాష్ట్రి శుకీ పేర్లు గల అయిదుగురు కూతుళ్ళు పుట్టారు. క్రౌంచి వులూకాలను ( గుడ్లగూబలు ) కన్నది. భాసి, భాసజాతినీ శ్యేని, గృధ్రశ్యేనాలనూ ధృతరాష్ట్రి, హంసలా కలహంసలా, చక్రవాకాలా కన్నది. శుకి నతనూ నతవినతనూ కన్నారు.

క్రోధవశకు పదుగురు కూతుళ్ళు పుట్టారు. " సురస మృగమంద హరి శ్వేత సురభి భద్రమద మాతంగి శార్దూలి కద్రువ మృగి " అనే పేరులతో వాళ్ళు పిలవబడినారు. వీరిలో మృగమందకు ఎలుగులూ సృమరాలూ, చమరాలూ, హరికి, సింహాలూ, భద్రమదకు ఇరావతీ ఇరావతికి ఐరావతం అనేగజం మాతంగికి ఏనుగులు పులులూ గోలాంగూలాలూ శార్దూలికి కలిగినై.

శ్వేతకు దిగ్గజాలు జనించినై. సురభికి రోహిణీ గంధర్వీ, కలిగారు. వారిద్దరికీ వాహ ( బరువుమోసేవి ) సంతానం కలిగింది. సురసకు అనేక ఫణాలు కల్గిన నాగజాతి ఆవిర్భవించింది. కద్రువకు పాములు పుట్టినై. మనువు అనే ఆమెకు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులనగా మానవులు జన్మించారు. సర్వపుణ్య ఫలవృక్ష సంతానాన్ని అనల కన్నది. వినతకు అరుణుడూ గరుడుడూ ప్రభవించారు. సురస తోబుట్టు

పైన కద్రువ భూమిని భరించే వేయితలల ఆదిశేషుణ్ణి కన్నది. అరుణునకు సంపాతీ నేనూ జన్మించాం. నన్ను "జటాయువు" అంటారు. నా సాయం మీకిష్టమైతే వెంట వుండి మీరులేని వేళ ఈ తల్లిని కాపాడు తుంటాను." అని

## సీతారామలక్ష్మణులు పంచవటి ప్రవేశించుట

ఆ పక్షిరాజు పలుకులకు రాముడు పరమానంద భరితుడై ఆదరంతో ఆలింగనం చేసుకుని తండ్రికి ఆతనికి గల స్నేహానుబంధ వృత్తాంతం వింటూ, సీతను సంరక్షణ నిమిత్తం అప్పగించి సౌమిత్రి సహాయుడై ముందేగగా అందరు పరమ ప్రశాంతమైన పంచవటి ప్రవేశించారు. మండే మంటలు మిడుతల దహియించునట్లు రాముని పంచవటిలో ప్రవేశం రాక్షస కులాంతకానికి ప్రారంభ సూచకమా అన్నట్లు తోచింది. నానావిధ మృగాలతో నానా భయంకర సర్పాలతోవున్న ఆ చోటును చూపించి రాముడు "సోదరా! ఇదే పంచవటి. ఇక్కడ మనం వుండటానికి మంచి ప్రదేశం నిర్ణయించు. నీటికి దూరం గాకుండా, హృదయంగమంగా వుండే సుపుష్పితలతాశ్మజాతాల నడుమ ఎత్తుపల్లాలు లేని సమతలంలో సమిధలకూ కట్టెలకూ శ్రమపడకుండా ఇసుక గల్గిన చోటు గుర్తించి చెప్పు" మన్నాడు. జానకి వింటుండగా, సౌమిత్రి సాంజలిబంధంగా సవినయంగా "అన్నా! నేను నిర్ణాయకుడుగాను, మీకు పరతంత్రుణ్ణి. ఇక్కడ మీరు నూరేండ్లున్నా నాకు సంతోషమే. మీకు రుచించే స్థానం చూపిస్తే అక్కడ ఆవాసం నిర్మిస్తాను. మీ పరిచారకుణ్ణి. నామీద అంతబరువు మోపవద్దు" అని వేడుకున్నాడు. తమ్ముని మాటలకు తనివి చెందిన రాముడు ఆయాచోటుల పరిశీలించి "తమ్ముడా! ఈ చోటు బాగున్నది. ఇదిగో! వికసించిన పూలతో, ఫలభారంతో వంగిన కొమ్మలతో దట్టంగా వ్యాపించి ఆకుపచ్చని వర్ణంతో వున్న చెట్ల సమూహాలతో నిండివున్న పర్వతం. ఇది సరస్సు. నిర్మలంగా వున్న నీళ్ళతో తామరలూ కలువలూ విరిసి పుప్పొడులు రాలుస్తూ

గంభీరం చేస్తుండే తుమ్మెదలు ఝుంకారంచేస్తూ వ్రాలి మధువ్రోలి స్వేచ్ఛగా తిరుగుతున్నై.

అదిగో అగస్త్యులవారు వచించిన గోదావరి. వృక్షమృగ సమాకీర్ణమైన రెండు కొండల నడుమ వుద్వేగంగా ప్రవహిస్తూంది. వెగురు పక్షులు కొంగలు జలకుక్కుటాలు ధ్వనిచేస్తూ కొన్ని తీరాలవెంటా, కొన్ని ఆకాశం పైనా తిరుగుతున్నై. ఆనుపూర్వికంగా చూస్తే ఈచోటు మనకన్నివిధాలా తగివుంది. దీని చుట్టూవున్న రాతిప్రదేశాలు సూర్యకాంతికి బంగారం, వెండీ రాగి ధాతువుల రంగుల్లో మెరుస్తూ ఆకర్షణీయంగా వున్నై. పక్షి మిత్రుడు బాసటగా ఇక్కడ గడువుకాలమంతా గడుపుదాం. తమ్ముడూ! ఆవాసం నిర్మించు."

## లక్ష్మణుడు పంచవటి పర్ణశాల కట్టుట

అన్నాడు. అన్నమాటలకు సంతుష్టుడై సౌమిత్రి దీర్ఘచతురస్రాకారంగా నేలనుకొలిచి, తగినంత పునాదులు త్రవ్వి గోడలు నాల్గువైపులా పెట్టి వెదురుబొంగులతో స్తంభాలు నిల్పి వాటిమీద వెదురువాసాలు పరచి జమ్మివాసాలు అమర్చి నారతో చక్కగా బిగించి బోదగడ్డీ రెల్లుగడ్డీ దట్టంగా కప్పి లోపలా బయటా నేలను దిమ్మసచేసి గోదావరికిపోయి స్నానం ముగించుకుని పండ్లూ పూలు సేకరించి శాంతికార్యం సలిపి బలులిచ్చి అనంతరం అన్నకూ వదినకూ పిల్చి అధికశ్రమతో నిర్మించిన ఆశ్రమం చూపించాడు. అదిచూచి సీతారాములు లక్ష్మణుని గృహనిర్మాణ చాతుర్యానికి ఎంతో మెచ్చుకున్నారు. "మహామతీ! అల్పకాలంలో ఆశ్చర్యం కలిగే విధంగా అనుకూలమైన పర్ణశాల నిర్మించిన నీపనితనానికీ నామీద నీకున్న భక్తి విశ్వాస గౌరవాలకూ తుల్యమైన పారితోషికం ఇవ్వలేక కౌగిలి రూపంగా హృదయం ఇచ్చుకున్నాను. నా మనస్సెరుంగుదువు. వదిన వాంఛితంఎరుగుదువు కృతజ్ఞుడవు. నిన్ను తనయునిగా వడసిన తండ్రి అతిబుద్ధుడు ధర్మరతుడు. నాభయంకర వనవాసకాలం నీసేవలో అయోధ్యలో అంతఃపుర వాసంలాగా గడిచిపోతున్నది. నిజంగా నేనెంతో అదృష్టవంతుణ్ణి. సోదర ప్రేమ నావలె. నాకగొన్నవాడుండటం లోకంలో అరుదు" అని మాటి

మాటికీ ఆనంద బాష్పాలురాలుస్తూ పర్ణశాలలో ప్రవేశించాడు. వైజయంతిలో ఇంద్రుడువలె కొంతకాలం ఏవిధమైన ఆటంకాలు లేకుండా హాయిగా గడిపాడు.

## సౌమిత్రి అన్నకు హేమంతఋతువును వర్ణించి చెప్పుట

కాంతానుజ సహితుడై చింతలు వంతలు మరచి ఏకాంతసుఖాన్ని రాముడు అనుభవిస్తూండగా శరత్కాలాంతంకాగా సురచిసంతమైన హేమంతంవచ్చింది. ఒకనాడు రాముడు వేకువకాగానే మేల్కొని భార్యతో స్నానార్థం గోదావరికి ప్రయాణిస్తున్నాడు. లక్ష్మణుడు జలార్థంపాత్ర చేతపట్టుకుని వెనుకవస్తున్నాడు. రాముడు వుత్సాహంగా నడుస్తున్నాడు. సౌమిత్రి అన్నను చూచి "అన్నా! సంవత్సరం ఏఋతువుచేత సర్వజీవకోటికి సంతోషహేతువవుతుందో నీకు ఏఋతువంటే మిక్కిలి ఇష్టమో ఆ హేమంతం వచ్చింది. శరీరం బిరుసెక్కి ప్రజలకు స్నానార్హం కాకుండావుంది. మెరుగెక్కి పైరుపచ్చలు ఆనందార్హంగా వున్నై. అతిమూరస్థుడైన అగ్నిహోత్రుడు ఆప్తుడు కాజొచ్చాడు. గృహస్థులు క్రొత్తధాన్యముతో పొంగళ్ళుపొంగించి దేవతలకూ పితృదేవతలకూ సమర్పిస్తుంటారు. దండయాత్రాభిరతులై ధరణీపతులూ ఫలపత్ర పుష్పభరితమై తరులూ, ప్రాజ్యకాములై జనపదులూ ఈకాలంలో ప్రకాశిస్తుంటారు. దక్షిణదిశగా జగచ్చక్షువైన సూర్యుడు వుదయిస్తూ వుంటే శోభాలక్షణమైన తిలకంలేని హరిణాక్షిలాగా వుత్తరదిశ వెలవెలపోతున్నది.

సహజంగా మంచుగడ్డలకు హిమవంతుడుస్థానం. ఇప్పుడు సూర్యుడు మిక్కిలి దూరస్థుడు కావటంచేత నామసార్థక్యం మిక్కిలి పొందాడు. గడుపరాందికదా కాలశక్తి! జీవసంతానం సంతోషించేలాగా చిరువెచ్చ ఎండ మధ్యాహ్న సమయంలో కాస్తున్నది. సూర్యకాంతిలో తప్తశక్తి తగ్గినందున జలం జిల్లుమంటూ దుస్సహంగా వుంటుంది. ప్రొద్దెక్కినకొద్దీ మంచు విరిసిపోతూంటే చల్లబడి గాలివీస్తుంటే అడవులన్నీ మానవసంచారహీనంగా వున్నై. స్వేచ్ఛగా ఆచ్ఛాదనరహితంగా శయనించే మానవులు దళసరి గుడ్డలు కప్పుకుని మూడంకెవలె ముడుచుకుని పడుకుంటారు. బయట పడ

కలకై ప్రాపులాదేవారు గృహాంతర్భాగాలను కోరుకుంటారు. పుష్య సంబంమై మంచుబూజువారి శీతపుగాలిగా మారుతుండే రాత్రులు దీర్ఘంగా మారుతున్నై.

తనసౌభాగ్యాన్ని చంద్రుడు సూర్యునికొసంగి, హిమప్రాబల్యంచేత కావురుక్రమ్మి నోటిఆవిరిచేత మాసిన అద్దంలాగా తేజోహీనుడైనాడు. నిండు పున్నమిరాత్రి వెన్నెల మంచుచే ఆవరించబడి సుఖాస్పదం కాలేక పోతూంది. ఎండకు కావిక్రమ్మిన భూమిలాగా చంద్రిక వుండికూడా ప్రకాశాన్ని కోల్పోయింది. గాను స్వాభావికంగా చల్లనివాడైనా ఈ మంచు స్పర్శతో మరింత శీతలుడై ప్రాభాత సమయంలో పశ్చిమానిలుడు ద్విగుణీకృతంగా వీస్తున్నాడు. యవగోధుమ సస్య విరాజితమైన విపినం హిమబిందువుల మునిగి, సూర్యోదయం కాగానే సారసక్రౌంచాది విహంగనాదంతో శోభిస్తూంది. ఖర్జూర పుష్పాల కాంతికలిగి చక్కగా పండిన వెన్నులతో తలవంచి బంగరురంగు చిందిస్తూ వరిపైరుప్రమోద కలిగిస్తూంది. దూరంగా వుదయించిన సూర్యుడు వ్యాపింపచేసే స్వీయకిరణాలు మంచులక్రమించుకొనగా చల్లనివాడైన చందమామవలెవున్నాడు. పూర్వాహ్ణం (వుదయకాలం) ఎండలో వసతగ్గి హాయికలిగిస్తూ మధ్యాహ్నం కొంచెం తెల్లగా కానిపిస్తూ, కొంచెం ఎరుపుతనం కలిగి కొంచెం వేడికగులుతూంది. మంచు రాలినందున తడిసి పచ్చికబయళ్ళు సూర్యరశ్మి సోకంగానే శిరస్సులపై చిరుముత్యాలు ధరించినవా అన్నట్లు భ్రమకొల్పుతున్నై.

అడవిఏనుగు మిక్కిలి దప్పిగొనివచ్చి తొండం నీటిలోపెట్టి జిల్లుమంటున్న కారణంగా త్రాగటం మాని ముడుచుకుంటున్నది. నీటిపక్షులు నీటిసమీపంగా కూర్చుండి నీళ్ళల్లో కనుపిస్తున్న చేపలకోసం మునకలు వేయటానికి జంకుతున్నై. యుద్ధరంగంలో ప్రవేశించని భీరువులవలె నాకు గోచరిస్తున్నై. లోపల మంచు కావిరిచే కల్గినచీకటి పైన కాలసంబంధమైన గాఢాంధకారం క్రమ్ముకొనగా కాననం పుష్పరహితంగా నిద్రిస్తున్నదా అన్నట్లు కనబడుతూంది, ప్రవాహం ఆవిరితో ఆచ్ఛాదింపబడి ధ్వనిచేత బెగ్గురుపక్షుల గుర్తింపవలసివస్తూంది. గాఢమంచుతో తడిసిన ఇసుక వేలంతా జలమయంగా కానవస్తూంది. మంచు కురియుటంచేత సూర్యకిర

గాలి తప్తశక్తి కోల్పోవటంచేత శిలలపైపడిన బిందువులు రసరూపం దాల్చినై. హిమపాతంతో కొంత విధ్వంసమై, జలచరసంతాన సంహారంతో ఇంకా రూపరి జారిపడుతున్న కింజల్కాలతో భుక్తశేషమైన తామరలతో కొలనులు పొలుపు తరిగివున్నై. అన్నా! ఈస్పుంసువంటి చలికాలంలో సోదరుడు భరతుడు దుఃఖవేదనతో క్రాగుతూ రాజ్యాన్నివదలి భోగాలు త్యజించి తాపసియై నేల నిద్రిస్తూ మితాన్నం స్వీకరిస్తూ నీపైగల భక్తితో నీరాకకు ఎదురుచూస్తూ అయోధ్యలో వున్నాడుకదా?

సరిగా తెల్లవారకే నిద్రలేచి ప్రకృతులు వెంటరాగా స్నానార్థం సరయూ నదికి తమ్ముడు పోతుంటాడు. పుట్టినప్పటినుంచీ ఎంతో గారాబంతో తల్లి వద్దా మేనమామలవద్దా పెరిగాడు. కష్టమంటే ఏమిటో తెలియకుండాగడిపాడు. అపరనిశల్లోవెళ్ళి సరయువులో ఏవిధంగా స్నానంచేస్తున్నాడో సుకుమారుడు వీరుడు సురుచిరవదనుడు సుందరుడు ధర్మజ్ఞుడు ప్రాజ్ఞుడు ప్రమదాపాఠి సత్యవాది నిర్దిష్టకార్యనిగతుడైన భరతుడు నీఅనుగ్రహాన్ని అర్థించి భోగరాశి దాపి స్వర్గాన్ని అడవిలోవున్న నిన్ను బోలిజయించాడు. లోకంలో సామాన్యంగా కొడుకులు తల్లినిపోలి పుట్టుతారు తండ్రిపోలిక రావటం దుర్లభం అంటారు, తమ్మునిపట్ల లోకోక్తి తారుమారైంది. తండ్రి ధర్మ స్వరూపుడూ. సత్యవ్రతుడూ. అయితే అనుజుడు, త్యాగిగా తాపసిగా విరాగిగా ఆధిక్యం సంపాదించుకున్నాడు. పినతల్లి ఇంతటి క్రూరస్వభావ ఎలా అయిందో వూహించలేకుండా వున్నాను" అని చెపుతుంటే రాముడు "తమ్ముడా! నీవు మిక్కిలి తొందరపాటువాడవు. కారణ రహితంగా పిన్నమ్మను కఠినంగా మాట్లాడవద్దు. ఆమె చేతకు కారణం వున్నదని, మహర్షులు అనలేదా? తండ్రి గుణాలకూర్చిగానీ, తమ్మునిగుణాల కూర్చిగానీ చెప్పు. వీనులవిందుగా వింటాను. వనవాసంలో మనస్సు నిశ్చలంగా నిల్పినగాకే, ఆ ధన్యుని భావించినప్పుడల్లా, గాలికి వగుదాకు వలె కంపనం కల్గుతుంది. ఆ తీయని మాటలు, అమృతంవంటి ఆ వుక్తులు హృద్యమైన ఆ వినయం మరపు రాక మనస్సును వికలం చేస్తుంటై. నిన్నూ, భరతశత్రుఘ్నులనూ, జనకజనూ కూడి సంతోషంగా ఎప్పుడు వుంటానో" అంటూ గోదావరీనది చేరుకున్నాడు. సమంత్రకంగా స్నానం

చేసి, సూర్య, ముని, పితృ, దైవతముల నారాధించి గౌరీనందులు సేవించగా ఒప్పుచున్న రుద్రుడులాగా కుటీరం చేరాడు.

## శూర్పణఖ శ్రీరాముని చూచుట

లక్షణ లక్షితుడైన శ్రీరాముడు జనకజా లక్ష్మణులతో స్నానవిధులు ముగించుకుని పర్ణశాల ప్రవేశించి, శేషించిన వైదికకర్మలు పూర్తిగావించి వాకిటిముందర భాగంలో మెత్తగా పరచిన దర్భలపై ఆసీనుడై, మనోహర గాథలతో మైథిలినీ, సోదరుణ్ణీ మంత్రముగ్ధులుగా చేస్తున్నాడు. ఆ దృశ్యం చిత్రా నక్షత్రసంగతుడైన చంద్రుణ్ణి తలపిస్తూంది. స్వేచ్ఛగా అరణ్యంలో సంచరిస్తూ అవాటుగా రాముణ్ణి చూచి, రాక్షసరాజైన రావణుని సోదరి శూర్పణఖ ఆశ్రమంలోకి వచ్చింది. సింహంవంటి వక్షం, అరవిందాల వంటి అక్షం, ప్రక్కనేవున్న కోదండచాపం, నల్లకలువల వన్నెవంటి రూపం, ఆమెను ఆకర్షించింది. కొంతసేపు నిశ్చేష్టురాలైంది. అంతకంతకు ఆమెలో వికారభావం అభివృద్ధి కాసాగింది. సలలితదీప్తాస్యునీ, సజ్జనలోపాస్యునీ, వర్ణితసుకుమారునీ, బంధిత జటాధారునీ, ప్రియదర్శునీ, శత్రుకర్శునీ విడిచిపోలేకపోయింది. చరచర సమీపించింది. సుముఖుని. దుర్ముఖి. సుశీలుని పాపశీలా, సుందరాకారుని, వికారవిరూపా, మధురస్వరుని, భైరవస్వరా, విశాలమనోహరలోచనుని భీకరాక్షి, భ్రమరకుంతలుని, తామ్రశిరోజా, దక్షిణుని, వామభాషిణీ లలితదేహుని దారుణాకారా, ఇంద్రియ నిగ్రహుని ఇంద్రియ వశంవదా చేరిన రీతి రాముని చేరింది. "కామాతురాణాం నభయం నలజ్జా" అన్నట్లు సిగ్గుసెగ్గును విడిచి తనలో తత్తరపెడుతున్న చిత్తజవికారాన్ని అణచుకోలేక, తన రూపవంశ కార్యకలాపాలు గుర్తించక రామునికి ఎదురుగా నిల్చింది.

## శూర్పణఖకు శ్రీరాముడు తమ వృత్తాంతం చెప్పుట

"ఓయీ! మానవమన్మథా! ఈ ఆకారసౌష్ఠవం ఏమిటి? ఈ జటాజిన వల్కలాలధారణం ఏమిటి? ఈ శాంత ప్రసన్నరూపం ఏమిటి? ఈ భయంకర శరచాప సంపర్కం ఏమిటి? పొత్తుకుదరని ఈ విచిత్ర వేషం

ఎందుకు వేశావు? దానవ సంచారయోగ్యమై, మానవసంచారదుర్గమమైన ఈ విపిన ప్రదేశానికి ఎందుకు వచ్చావు? నీకు అయినవాళ్ళు లేరా? ఇల్లు కూడా కట్టుకున్నావు. ఎంతకాలం ఇక్కడ వుంటావు? నీ వూరు, నీ పేరు చెప్పు. ఇది ఎవ్వతె? వాడెవ్వడు? మానవాశనులైన దానవులు స్వేచ్ఛగా తిరిగే దండకారణ్యానికి బ్రతుకుపై భ్రాంతి వున్నవాడెవడూ రాడు. నీవు తెలిసి వచ్చావా? తెలియక వచ్చావా? వచ్చినవాడవు ఏమి సాధించ తలిచావు? మహాశక్తిమంతులైన మునులకే ఇక్కడ ముప్పుతెప్పరంగా వుంటే మీరు ముగ్గురు ఏ విధంగా బ్రతుకుతారు? నా కంటబడ్డారు కనుక ఇంతవరకైనా జీవించగలిగారు. మా వాళ్ళు చూస్తే ఈపాటికి మాయమైపోయేవాళ్ళు, నిజం చెప్పు. నీవు చెప్పేది నిజమో కాదో నాకు తెలుస్తుంది. అబద్ధంచెపితే ఆగ్రహం వస్తుంది. అంతా రసాభాసం అవుతుంది" అని రాముణ్ణి శూర్పణఖ నిష్కర్షగా అడిగింది, అనృత దోషం ఎరుగని రాముడు అబద్ధం ఆడుతాడా? అందులో అబలల సమక్షంలో, దానవికేం తెలుసు రాముని తత్త్వం.

"కామినీ: మా సంగతి వినుపించుతా, విను. భారతంలో పేరు ప్రతిష్ఠలు కల్గిన అయోధ్యా నగరం మా ఆవాసం. దానిని దశరథుడనే ధర్మప్రభువు పాలించేవాడు. ఆయనకు నలుగురు పుత్రులున్నారు. వారిలో నేను పెద్దవాణ్ణి, నాపేరు శ్రీరాముడు. ఈతడు రెండోవాడు, పేరు లక్ష్మణుడు. ఇంకా ఇద్దరు భరత శత్రుఘ్నులనేవారు అయోధ్యలో వున్నారు. ఈమె నా భార్య. పేరు సీత. మా తలిదండ్రుల కోరికపై దండకకువచ్చాం. ఇక్కడ కొద్దికాలం మాత్రమే వుంటాం. మేం ఎవరికీ అపకారం చేయం. ఎవరైనా చేస్తే సహించం. మేం సుక్షత్రియులం. కనుక శరచాపాలు మా వెంట ఎప్పుడూ వుంటాయి. అడవిలోపల వుంటున్నాంకాబట్టి మునులధర్మాన్ని పాటించాం. ఇందులో విచిత్రం ఏమీలేదు. విద్ధూరం అంతకన్నా లేదు. ఇక నీ వృత్తాంతం చెప్పు. నీ ఆకారభూషణాలవల్ల రాక్షసకాంతగా భావిం చాను. నీ విక్కడికి ఎందుకు వచ్చావు? మీ పెద్దలు నిన్ను దండించరా? లేక లేనే లేరా? వుంటే ఎక్కడ వున్నారు? వాడేం చేస్తుంటారు? నీ పేరే

మిటి? ఇంత నిర్లజ్జగా నాతో ఎందుకు ప్రసంగించావు? యథార్థం నీవుకూడా చెప్పు, మేం వింటాం" అని రాముడు అడిగాడు.

## శూర్పణఖ శ్రీరామచంద్రుని మోహించుట

"రాజకుమారా! తాపసశ్రేష్ఠుడైన విశ్రవసుని పుత్రికను. నా పేరు శూర్పణఖ. రావణ కుంభకర్ణ విభీషణ ఖరదూషణులనే వారు నా తోబుట్టువులు. వారిలో రావణుడు పెద్దవాడు. రాక్షసరాజు. లంకా ద్వీపాన్ని పాలిస్తున్నాడు. కుంభకర్ణుడు అధిక నిద్రాళువైనా అసమశక్తి సంపన్నుడు విభీషణుడు దైవ మానవ ధర్మాలయందు విశ్వాసంకలవాడు. వాళ్ళిద్దరూ అన్నదగ్గనే వున్నారు. చిన్నన్నలైన ఖరదూషణులు ఈ దండకారణ్యానికి ప్రభువులు. ఇక్కడే జనస్థానం అనే పేరుతో మేం నివసించే నగరం వుంది. నా చిన్నన్నలు సాటిలేని పరాక్రమ వంతులు. వాళ్ళపేరు చెపితే దేవతలు సైతం నిద్రపోరు. నేను స్వతంత్రురాలను. నామీద వాళ్ళకున్న అనురాగానికి హద్దులులేవు. నేనేం చేసినా హర్షిస్తారు. నేను చూచిన వాళ్ళల్లో నీయంత అందగాడు కనపడలేదు. అందుకోసం నిన్ను మోహించి వచ్చాను. మానవులకూ, దానవులకు సంబంధం ఏమిటని అంటావేమో. మేంకూడా మానవులమే. మావాళ్ళంతా తపస్వం పన్నులే, మేం బ్రహ్మవంశం వాళ్ళం. మేం ఇహ సుఖాలను ఆశిస్తాం. అందుకోసం ఏమైనా చేస్తాం. పైగా కామ రూపులం. ఎటువంటి ఆకారం కావాలంటే అటువంటి ఆకారాన్ని పొందుతాం. మాలో కూడా అందగాళ్ళు వున్నారు.

వాళ్ళు నీ కాలి గోటికి పోలరు. అందుకని ఆశించి వచ్చాను. నేనింతవరకూ అవివాహితనే. నీప్రేమ ఆశించకపోతే ఈ పాటికి మిమ్మల్ని నామరూపాలు లేకుండా నమిలి మ్రింగేదాన్ని. నన్ను తేలికగా భావించకు. అమానుషశక్తులు కలదాన్ని. అమేయ బలాన్వితను, నా భర్తవై త్రిలోకాధి పతివై అనంత సౌఖ్యాన్ని అనుభవించు. నేనే నీకు తగిన భార్యను. దీనిపేరు సీతా! ఎంత రోతగా వుంది? ఈ విరూపతో

ఏం సంసారంచేస్తావు ? నాతోబాటి శైలాటవీ సుందర కందరాల
క్రీడింపు. పోవాంరా." అని వైర్యాంగన సాహసస్యం లేని సంభాష
సాగించింది. ఆ మాటలు వినివిని చివరకు రాముడు చిరునవ్వు నవ్వి
ఒకసారి తేరిపార చూచాడు. "ఓ రామణీ ! నేను ఈమె పట్టిదైనా ఆ
సాధిగా వివాహం చేసుకున్నాను. ఇంక ఏవిధంగా విడిచిపెడతాన
పోనీ, నిన్ను స్వీకరించటానికి నీవంటి సుందరి మరికి సవతి పోటంత
పరిహాసు. ఇదిగో అతనిచూడు. అతడు నిశ్చయంగా నాయంతవా
నాకు తమ్ముడు. శీలవంతుడు. ప్రియావలోకనుడు. మహా తేజు
పేరు లక్ష్మణుడు. ఇతనికి ఇక్కడ ఇప్పుడు భార్యలేదు. అందుకు భం
కరుడు మిక్కిలిజాణ. ప్రాయంలో నాకన్నచిన్న. అందంలో అస
దృశుడు. అపూర్వ. సతీలాలసుడు, నీరూపానికీ, నీరు కోర్కెకూ మె
తగినట్లు ప్రవర్తిస్తాడు. నీ కపతిర్వయోగ్యుడు. ఎందుకు మేము పన్వ
లాగా. నిస్సపత్నంగా అతని భజించి వెలుగు," అని అంటూండగా
ఆ రక్కసి కామమోహిత కావటంచేత, మంచి చెడ్డలు గమనించ
యోగ్యా యోగ్యతలు చూడక సౌమిత్రి వున్న చోటికి పరభసగమనం
పోయి, "ఓ రామానుజా ! నీ చక్కదనానికి సరి అయిన కాంత
నేనే. నీ ఒంటరితనం పోగొట్టి తుంట విల్కాని గర్వం త్రుంచి
హరించు దామని వచ్చాను. నాయకా. నన్ను భార్యగా గ్రహిం
ఇదిగో నాచేయి. పట్టుకుని నా వెంటరా. నీ వెరుగని ఆనందం నీ
కూరుస్తాను."

అని లక్ష్మణుని హస్త గ్రహణం చేయబోయింది. ఆ
అభిప్రాయం తెలిసిన లక్ష్మణుడు పరిహాసంగా "ఆగు ఆగు. తొం
పడకు. నా సంగతి నీకు తెలియదు. తెలిస్తే ఇటువంటి తప్పు
చేయవు. నేను ఆశ్రమంలో వున్నాయనకు అనుజుడనైనా సేవకు
దానిసను కట్టుకుని లంకాధీశుని సోదరివి దానిసగా బ్రతుకుతావా ? మ
రాజభోగాలు అనుభవించవలసిన నీవు కనిష్ఠణ్ణి కట్టుకుని పూటిగం చేస్తా
నీ అంతరానికి తగిన వాణ్ణి నీవు గ్రహించాలి. కాని, కనిపించిన వాడిని
కొంటువవు కమ్మని గందరగోళం చేస్తావా. నీవే బాగా ఆలోచించు

—:o:—

# ఎమెస్కో వచన రామాయణం

శతావధాని కోట వీరాంజనేయ శర్మ



Volume Four

Price Rs. 5/-

COVER PRINTED AT NANDINI ART PRINTERS HYD-29